# శ్రీ యంత్ర రహస్యాలు

(శ్రీవిద్యా ఉపాసనపై సమగ్ర సమాచార గ్రంథము)


-: రచన, సేకరణ :-

**శ్రీ జోస్యుల రామచంద్రశర్మ, M.A.,**





☎ 473444

**రోహిణి పబ్లికేషన్స్**

మెయిన్‌రోడ్ - రాజమండ్రి 1.




# శ్రీయంత్ర రహస్యాలు

- శ్రీ జోస్యుల రామచంద్రశర్మ, ఎం ఏ ,



ప్రథమ ముద్రణ

సెప్టెంబరు 2000




మూల్యం రు 50/-

ముద్రణ
**స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
స్వామి వీధి, గాంధీనగర్,
విజయవాడ- 3
✆ 578211, 572832

ప్రకాశకులు
**రోహిణి పబ్లికేషన్స్**
మెయిన్‌రోడ్, రాజమండ్రి-1
ఫోన్ 473444

# విషయ సూచిక



# శ్రీయంత్ర రహస్యాలు

## 1. యంత్రమంటే ఏమిటి?

యంత్ర శబ్దం 'యమ్' అనే ధాతువునుండి యేర్పడింది. ఈ ధాతువునకు వ్యతిరేకమైన దిశలో చుట్టబడినది అని అర్థం యంత్రం రహస్యమయమైన శక్తుల భాండారం అంటే ఒక నిధిగా దానిని మనం పేర్కొనవచ్చు. వాంఛితమైన ప్రతిమ (అంటే విగ్రహం) మనకు లభ్యం కానప్పుడు దాని స్థానంలో యంత్రాన్నే ఇష్ట దైవంగా ఉంచి పూజించవచ్చునని శ్రీదేవీభాగవతం చెబుతోంది

యంత్రానికి పూజ చేయకుండా దేవతలు ప్రసన్నులు కారు. ఈ విషయాన్ని మనకు శాస్త్రకారులు అనేక విధాలుగా వివరించారు

ప్రపంచంలోని సభ్య సమాజాలన్నింటిలో ఏదోరూపంలో యంత్రతంత్రాలమీద, తాయెత్తులమీద ఏదో ఒక పద్ధతిలో విశ్వాసం ఉంది. వ్యాధులు, ప్రకృతి వైపరీత్యాలు, దయ్యాలు మొదలైన వాటిద్వారా జరిగే కనికట్టులు, మాయలు ఇత్యాది మంత్ర తంత్రాలను దూరంగా ఉంచడానికి పారద్రోలడానికి తరచు ప్రజలు తాయెత్తులను (యంత్రాలను) మెడలో వేసుకోవడమో లేదా జబ్బకు కట్టుకోవడమో చేస్తూంటారు.

జంత్రం అనే శబ్దం యంత్రానికి వికృతరూపం. పంజాబీ వాడుక భాషలో మంత్రాన్ని 'మంతర్' అని జంత్రాన్ని 'జంతర్' అని అంటారు దీన్నే ఉర్దూ భాషలో మహమ్మదీయులు 'తావీజు' అని అంటారు

చారిత్రక దృష్టితో చూసినట్లయితే ప్రాచీన కాలంనుండీ ప్రజలు తాయెత్తులను ధరిస్తూ వస్తున్నట్లు తెలుస్తోంది. 'భగవంతుడు' అనే శబ్దంతోకూడా పరిచయం లేని రోజుల్లో ఆదిమానవుడికి సూర్యకాంతి మొదలు, ఆకాశంలో మెరుపు మెరవటం, తుఫాన్లు, వర్షాలు, వ్యాధుల వరకూ జరిగే ప్రతి సంఘటన వింతగా, అద్భుతంగా ఒక కనికట్టుగా గోచరించేది. అతడు ఈ విధమైన కనికట్టుయొక్క దుష్ప్రభావం నుండి

భయపడుతూనే దానినుండి బయటపడాలనుకొనేవాడు. ఆ పరిస్థితుల్లో అతడు కేవలం తనని తానే కాకుండా తన భార్య, బిడ్డలు, ఇతర సహచరవర్గాన్నికూడా అన్ని విధాలా ప్రకృతి ప్రకోపాలనుండి, అశుభాలకు సంబంధించిన భయాలనుండి రక్షించాలని తలచేవాడు.

మానవునిలో భగవంతుణ్ణి గురించిన విజ్ఞానం పెరిగాక ఆతడు ప్రకృతిలో సంభవించే ప్రతి అద్భుతకార్యమూ భగవత్కృతమైన అద్భుతంగానే భావించేవాడు. అయినప్పటికీ ఆతడు తాయెత్తులను, యంత్రాలను పైన పేర్కొన్న కారణాల వల్లనే ధరిస్తున్నాడు అనగా ఏదోఒక దుష్టప్రభావంనుండి తనని రక్షించుకునేందుకే తావీజులు మొదలైనవాటిని ధరిస్తున్నాడన్నమాట. ప్రాచీనకాలంలో తాయెత్తులకు ఆకార ప్రాకారాలేవీ ఉండేవికావు ఏదో ఒకరంగులో ఉండే రాతిముక్కనో, విత్తనాన్నో, వేరునో, ఫలాన్నో తన వద్ద ఉంచుకొని దానికారణంగా తన కుటుంబం, పశువులు, మొదలైనవి సురక్షితంగా ఉండాలని తలచేవాడు. అప్పట్లో మానవుడు తాయెత్తులను మెడలో వేసుకోవడంకాని, ముంజేతికి ధరించడంగాని చేసేవాడుకాదు. మృగచర్మంతో చేసిన వస్త్రాల్లో కూరటంగాని, లేదా గుహల్లో దాచటంగాని చేసేవాడు. విత్తనాలను, రాళ్ళను పొడచి టి గడ్డిపోచలకు దండగుచ్చి మెడలో ధరించడం మొదలుపెట్టినప్పటినుండీ తాయెత్తులు ఒంటిమీద ధరించడం అనే ఆచారం వ్యవహారంలోనికి వచ్చి ఉండవచ్చు.

ఆంగ్లభాషలో తాయెత్తును 'యామెలెట్' అని పిలుస్తారు. ఇది లాటిన్ శబ్దం 'ఎమ్యులేటమ్' నుండి ఏర్పడింది. ఎమ్యులేటమ్ 'సైక్లామెన్' అనే పేరుగల ఒక మొక్కయొక్క అపభ్రంశ స్వరూపము. దీనిని రోమ్‌వాసులు తమ ఇండ్లలో ఉంచుకొనేవారు. దానివల్ల విషపూరితమైన మందులు ప్రభావరహితమవుతాయని వారి విశ్వాసం.

ప్రాచీనకాలంనుండీ తాయెత్తులు రెండువిధాలుగా ఉండేవి. ఒకటి వ్యక్తిగతంగా వాడుకొనేవి. వీటిని వ్యక్తులు శరీరంమీద ధరిస్తారు. రెండవరకం సాధారణమైనవి. అనగా వ్యక్తులు ఇంటిగోడలకు కట్టడం; గ్రామంయొక్క పొలిమేరల్లో, నాలుగురోడ్ల కూడళ్ళలో పాతిపెట్టడం చేస్తుంటారు. యంత్రాలను రాళ్ళతో, పుల్లలతో, ఎముకలతో, లోహాలతో, ఏనుగు దంతాలతో, గవ్వలతో, చర్మంతో, పాము కుబుసంతో తయారుచేస్తారు. జంతువులయొక్క చర్మంనుండి తీసిన ముక్కలతో, మానవశరీర భాగాలతో, చేతివేళ్ళతో, చేతి ఐదుకేళ్ళ సమూహంతో కూడా తాయెత్తులను తయారుచేస్తారు చాలాచోట్ల తాయెత్తులమీద మంత్రతంత్రాలకు సంబంధించిన మంత్రాలు లేదా చిత్రాలు ఉంటాయి.

ఖనిజాలకు సంబంధించిన విజ్ఞానం పెరిగాక మానవులు రాగి, ఇత్తడి, ఇనుము, బంగారము, వెండి మొదలైన లోహాలతో యంత్రాలను తయారుచేయడం ప్రారంభించారు మొదట్లో అయితే ఏవస్తువుతో లేదా ఏ లోహంతో యంత్రాన్ని తయారు చేశారో ఆ వస్తువును బట్టి, లోహాన్ని బట్టి యంత్రప్రభావం ఉంటుందని భావించేవారు తర్వాత కాలంలో తాయెత్తుల మహిమ లిఖించిన మంత్రాన్నిబట్టి లేదా గీసిన చిత్రాన్ని బట్టి ఉంటుందని గ్రహించి యంత్రాల శక్తికి మంత్రమే అసలు కారణంగా తెలుసుకో నారంభించారు కాబట్టి తాయెత్తు నిర్జీవవస్తువువలె తన పని తాను చేసుకుపోతూంటుంది పూర్వకాలంలో కూడా యంత్రం లేదా తాయెత్తుల కట్టే పూజారులు, భూతవైద్యులు వాటి పై ఊదుతూ మంత్రాలను ఉచ్చరించేవారు. ఈ కారణంగా తాయెత్తుకు మహిమ పెరుగు తుందని భావించేవారు

మొసపుటేమియా వాసులకు మూడువేల సంవత్సరాలకు పూర్వమే ఈ యంత్ర తంత్రాలమీద అపార విశ్వాసం ఉండేది. ఈజిప్టు ప్రజలలాగానే వీరుకూడా మానవుని చేతికి వశీకరణశక్తిని పరమేశ్వరుడే ప్రసాదించాడని భావించేవారు. భగవంతుణ్ణే ఒక ఐంద్రజాలకునిగా నమ్మేవారు ఇలాంటి నమ్మకమే బాబిలోనియా, ఈజిప్టు దేశస్థుల ప్రాచీన సంస్కృతిలో కూడా కనబడుతుంది.

ప్రాచీన ఈజిప్టు దేశస్థులు తాయెత్తుల్ని శరీరంపై ధరించకుండా మిక్కిలి మక్కువతో ఇళ్ళలోనే ఉంచుకొనేవారు. ఈజిప్టు పిరమిడ్లలో, దేవాలయాల్లో అక్కడ ఉంచే మృత దేహాలతో కూడా తాయెత్తుల్ని ఉంచేవారు యంత్రాలను లేదా తాయెత్తుల్ని అనేక రకాలైన రాళ్ళతో, కర్రలతో, రాగి, వెండి, బంగారం వంటి లోహాల మిశ్రధాతువులతో, ఏనుగు దంతాలతో, ఎముక ముక్కలతో, గవ్వలతో, మైనంతో, చెట్టు బెరళ్ళతో తయారుచేస్తూ ఉండేవారు. ఈజిప్టు రాజకుటుంబీకులు 'ఆంఖ్' అనే పేరుతో యంత్రాలను ధరించేవారు. ఇది ఆంగ్ల అక్షరం 'T' లాగా ఉంటుంది ఈ 'T' ఆకారంలో ఉండే యంత్రం దీర్ఘకాలిక జీవనాన్ని సూచిస్తున్నట్లు భావించేవారు. ఈజిప్షియన్లు మృతవ్యక్తుల దేహాలను 'మమ్మీ' లుగా తయారు చేశాక వాటి గుండెలదగ్గర చచ్చిన పేడపురుగును ఒక తాయెత్తు లాగానే ఉంచేవారు అందుచేతనే ఆ దేశస్థులు పేడపురుగుల్ని మిక్కిలి పవిత్రమైనవానిగా భావించేవారు.

ఇథియోపియాతో సహా అన్ని దేశాల్లోను యేసుక్రీస్తు కాలంనుండీ 'క్రాస్' (లేదా క్రీస్తును బలిగొన్న స్తంభము)ను అన్నిటికన్న ఉత్తమమైన యంత్రంగా (తాయెత్తుగా)

భావిస్తూ వచ్చారు. క్రైస్తవులు నేటికీ ఈ మతానికి సంబంధించిన సాధువుల పేర్లతో, గుర్తులతో తాయెత్తులను, యంత్రాలను, పతకాలను ధరిస్తున్నారు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలోను, రెండవ ప్రపంచ యుద్ధకాలంలోను కూడా సైనికులు, సైనికాధికారులు, పైలట్లు, ఈతగాళ్ళు, సొరంగాలను త్రవ్వేవారు అందరూ కూడా తావీజులు ధరిస్తూ ఉండేవారు. ఈ యంత్రాల మహిమను విశ్వసించేవారి సంఖ్య ఈనాటికీ సన్నగిల్లటం లేదు సరికదా, రాబోయే కాలంలోకూడా వారి సంఖ్యాబలం మరింత పె రిగే సూచనలు కనబడుతున్నాయి.

ఒకసారి నోబెల్ పురస్కార గ్రహీత, ప్రఖ్యాత వైద్యుడు నెల్సుబోర్న్ Niels Bhor (1885-1962) ఇంటిముందు గుర్రాలపై ఉంచే ఫిరంగి ఉండటంచూసి ఆయన మిత్రులు ఆశ్చర్యంతో ఆయనను 'అయ్యా! మీరూ మూఢనమ్మకాలను నమ్మేవాళ్ళలో చేరిపోయారా ఏమిటి?' అని ప్రశ్నించారు అప్పుడు ఆయన సవినయంగా 'నేను మూఢవిశ్వాసాలను విశ్వసించేవాడిని అయినా కాకున్నా మంత్రించిన యంత్రాలను, తాయెత్తుల్ని నమ్మినా నమ్మకపోయినా తేడా ఏమీ లేదు. కాని ఈ ఫిరంగి నాయింటిముందు కట్టిపడేసినప్పటి నుండి నాకు బోలెడు విశ్రాంతి, సౌఖ్యం లభిస్తోంది.' అని బదులుపలికి నమ్మకానికి మూఢత్వం లేదనిపించాడు

ప్రపంచంలోని అతి ప్రాచీనమైన హిందుసంస్కృతికి చెందిన వైదిక సాహిత్యంలో యంత్రాలకి సంబంధించిన సశాస్త్రీయమైన విషయాలు విస్తృతంగా విశదీకరిస్తూ కనిపిస్తాయి. 'యమనాత్ త్రాయత ఇతి యంత్రమ్' (బాధలనుండి రక్షించేది) అనే అర్థం నిర్వచనం విశేషార్థాన్ని వివరిస్తోంది. సకల దుఃఖాలను నివారణ చేస్తుంది గనకనే యంత్రం అంటారని ఆగమ శాస్త్రజ్ఞులు నిర్వచించారు

శ్రీదేవీభాగవతంలో అర్చాప్రతిమ అలభ్యస్థితిలో యంత్రాన్నే ఇష్టదేవతా స్వరూపంగా పేర్కొంటూ చెప్పిన విషయం ఇలా ఉంది :

అర్చాభావే తథా యంత్రమ్ (3/26/21)

ఇంకా 'నారదపురాణం'లో ఈ విషయాన్నే మరింత బలపరుస్తూ యంత్రాన్ని విష్ణు ప్రతిమతో సమానమైనదిగా పేర్కొంది.

**ఆపోఽగ్ని హృదయం చక్రం విష్ణోః క్షేత్ర-సముద్భవమ్।**
**యంత్రంచ ప్రతిమా స్థాన మర్చనే సర్వదా హరేః॥**

అనగా "జలం, అగ్ని, హృదయం, చక్రం, విష్ణు క్షేత్రంలో ఉద్భవించిన వస్తువులు యంత్రము అన్నీ విష్ణు ప్రతిమతో సమానంగా సదా పూజనీయస్థానాలు" అని అర్థము.

'గౌతమీయ యంత్రము' అనే గ్రంథంకూడా ఈ విషయాన్నే చెప్పింది

సాలగ్రామే గణౌ యంత్రే ప్రతిమా మండలేషు చ ।
నిత్యం పూజా హరేః కార్యా న తు కేవలభూతయే ॥

ఈ ప్రమాణాన్ని బట్టి సాలగ్రామశిలాఖండం, మణి, మండలం, స్వతస్సిద్ధంగా ఉన్న శిల అన్నీ యంత్రాల వరుసలోనే నిలుస్తాయి

'యంత్రాన్ని పూజించకుండా దేవతలు ప్రసన్నులు కారు' అనే విషయం కూడా ఇతరత్ర స్పష్టంగా నిర్దేశింపబడింది. మనకు నివసించదానికి నివాసస్థలం యిల్లు ఉన్నట్లుగానే దేవతలకు నివాసయోగ్యమైన గృహం యంత్రం అంటే దేవతానివాస స్థానం యంత్రమన్నమాట

నిజానికి యంత్రాన్ని 'దేవనగరం' అనీ, 'దేవతావాసస్థాన'మనీ , గృహమని చెప్పడం యంత్రాన్ని ఉత్తమంగా నిర్వచించడమే అవుతుంది ఈ గృహం కేవలం గృహం మాత్రమే కాదు ఒక దృఢమైన దుర్గంగా, పెట్టని కోటగా ఉండి మనల్ని రక్షిస్తుంది దీనిలో తమతమ స్థానాలు, దిశలు, మండలాలు, కోణాలు మొదలైనవాటికి సంబంధించిన అధిపతులు పూర్ణరూపంలో సాదరంగా ఆహ్వానింపబడి పూజలందుకొంటారు వారు యంత్రంయొక్క ప్రధాన అధిష్ఠాన దేవత యొక్క ఆజ్ఞలను గ్రహించి, తమ తమ స్థానాలలో రక్షకోసంగా నియుక్తులవుతారు

ఈవిధంగా యంత్రస్థమైన సమస్త దేవతా పరివారమూ యంత్రాన్ని ధరించిన సాధకుని రక్షణకు, కార్యసిద్ధికి ఎల్లవేళలా సహాయకమవుతారు.

మంత్రాలవలెనే యంత్రాలను కూడా సిద్ధి చేయాల్సి ఉంటుంది. సిద్ధిచేసిన యంత్రాలను పూజించడం, ధరించడం, ప్రతిష్ఠించడం, పంచోపచారపూజ మొదలైన ప్రక్రియలన్నీ పరిపూర్ణ ఫలితాల నిస్తాయి. యంత్రాన్ని అనేక శక్తులతో నిండిన భాండాగారంగా ఒక శక్తిమంతమైన 'క్యాప్సూల్' గా మనం పేర్కొనవచ్చు. ఈవిధంగా యంత్రం అత్యున్నతస్థానంలో ఉంటుంది. మంత్రతంత్రాలు దానికి సాధక తత్త్వాలుగా ఉంటాయి. మంత్రము, తంత్రము, సిద్ధి ఈ మూడూ కలసి సాధకుని కోరికలను నెరవేరుస్తాయి.

కేవలం మంత్రాన్ని ఒక కాగితంమీద లిఖించినంత మాత్రాననే అది సిద్ధిపొందుటకు ఉపయోగపడదు. అలాగే ఏ యంత్రాన్నైనా కాగితంమీదగానీ, లోహంమీద గానీ లిఖించినంతమాత్రంచేతనే అది సిద్ధిపొంది మన కోరికలు నెరవేర్చదు. కాబట్టి యంత్రశక్తిని పరిపూర్ణంగా పొందటానికి ఒక శుభముహూర్తంలో యంత్ర నిర్మాణం

చేపట్టాలి. ప్రాణప్రతిష్ఠ చేసి నిర్దిష్ట మంత్రాలద్వారా, పూజావిధానం ద్వారా ఆ యంత్రాన్ని సిద్ధి చేయాల్సి ఉంటుంది. అప్పుడే యంత్రం మనకు కావలసిన ఫలితాల నిస్తుంది ఈ రోజుల్లో రోడ్డు ప్రక్కన అమ్మే యంత్రాలూ, శాస్త్రజ్ఞానం లేని వ్యక్తుల ద్వారా సృష్టింపబడుతున్న యంత్రవిషయకమైన సాహిత్యమూ యంత్రశక్తిని దిగజారుస్తున్నాయి

ఈ గ్రంధంలో శాస్త్రీయ నేపథ్యంలో అసలైన యంత్రాల వివరణ ఇవ్వబడుతుంది (అలాంటివాటిలో సౌందర్యలహరిలోని యంత్రాత్మక ప్రయోగాలకు సంబంధించిన అత్యంత గోపనీయ విషయాలను పాఠకులకు అందజేయడం జరుగుతోంది) ఇంకా ఇతరమైన అనేక ఉపయోగకరమైన యంత్రాలను గురించిన ప్రామాణిక సమాచారం కూడా ఇందులో వివరించడం జరిగింది

## 2. యంత్రాల వల్ల ప్రయోజనాలు

అద్భుత విద్యలలో యంత్రం యొక్క స్థానం విశిష్టమైనది. అత్యున్నతమైనది యంత్ర, తంత్రాలు సాధకతత్త్వాలుగా భావింపబడతాయి యంత్రం సర్వసిద్ధులకు ముఖద్వారం దేవతలకు ఆవాసగృహం. దీనిలో తమతమ స్థానాలలో, దిశలలో, మండలాలలో, కోణాలలో ఆయా అధిపతులు వ్యవస్థీకరింపబడి ఆహ్వానితులై విరాజిల్లుతూ ఉంటారు. యంత్రం యొక్క మధ్యలో ఉన్నత సింహాసనం మీద ప్రధాన అధిష్ఠాన దేవత ప్రాణప్రతిష్ఠ చేయబడి పూజలు అందుకొంటూ ఉంటుంది. యంత్రం మంత్రంయొక్క నిర్మాణాత్మకమైన శరీరం. దీనిలో అనుష్ఠించాల్సిన కర్మకాండయొక్క సంపూర్ణ ప్రక్రియ ననుసరించి సమర్థంగా సరియైన రీతిలో కూర్చబడి ఉంటుంది. ఇది ఎలాగంటే ఒక చిత్రపటంలో భవన నిర్మాణం కూర్చినట్లు, ఒక విత్తనంలో వృక్షం దాగి ఉన్నట్లు యంత్రంలో అంతా దాగి ఉంటుంది. యంత్రాలలో క్లిష్టమైన యంత్రాలు కూడా ఉంటాయి. ఇవి ఆవరణపూజల ద్వారా వశీకృతమై ఉంటాయి. వీటికి భిన్నంగా మరికొన్ని శక్తిమంతమైన యంత్రాలు కూడా ఉంటాయి. ఈ యంత్రాల ద్వారా దర్శనమాత్రం చేతనే వ్యక్తిగత అభీష్టాలను నెరవేర్చుకొనవచ్చు శ్రీయంత్రం, గాయత్రీయంత్రం, స్వర్ణాకర్షక యంత్రం, భైరవ యంత్రం, మొదలైన యంత్రాలు ఈ కోవకు చెందినవి. వీటిని దర్శన మాత్రంచేతనే శుభఫలదాయక యంత్రాలుగా పేర్కొన్నారు

'అంకసిద్ధి' పొందిన యంత్రాలు కూడా కొన్ని ఉంటాయి. మంత్రాలు లేకుండా సమకూడే యంత్రాలు కొన్ని ఉంటాయి వీటి ఫలితాలు ఆశ్చర్యజనకంగా ఉంటాయి

సిద్ధపురుషులైనవారు యంత్రాల మాధ్యమంతో ఆశ్చర్యజనకమైన కార్యాలను చేసి చూపిస్తారు. అలాంటి మంత్రాలలో పంచదశి మంత్రాన్ని సర్వోన్నతమైనదిగా తీసుకోవచ్చు

మంత్రంలో వలెనే యంత్రంలోకూడా అనంతశక్తుల భాండారం ఉంటుందన్న విషయాన్ని మనం ఇక్కడ పిండితార్థంగా చెప్పవచ్చు

## 3. వివిధ ఆకృతులలో యంత్రాలు

యంత్రాలు అనేకం ఉన్నట్లుగానే వాటి ఆకృతులు కూడా అనేకం ఉన్నాయి యంత్రాలు ఎన్ని విధాలు ఉన్నాయో వివేచన చేస్తూ వాటి ఆకారాలు ఎలా ఉండాలో కూడా నిర్దేశించారు ఆ విషయాలను ఇక్కడ మనం విస్తారంగా పరిశీలిద్దాం!

ముఖ్యంగా యంత్రాల ఆకృతులు 'పూజ' కోసం 'ప్రయోగ' సంబంధంగా రెండు విధాలుగా సమకూర్చుతారు పూజనీయమైన యంత్రాల ఆకృతులను గురించిన విశేషాలు మనకు శాస్త్రాలలో లభిస్తాయి. వాటిలో –

1. భూపృష్ఠం 2. మేరుపృష్ఠం 3.పాతాలం 4.మేరుప్రస్తారం 5.కూర్మపృష్ఠం అనే యంత్రాలు ఇప్పుడు మనకు లభిస్తున్నాయి. వాటి విశేషాలు పరిశీలిద్దాం.

### భూపృష్ఠ యంత్రాలు

'భూపృష్ఠం' అంటే 'సమతలమైన భూభాగం' అని అర్థం అనగా భూపృష్ఠ యంత్రాలన్ని సమతలంగా ఉండే వస్తువుమీద యంత్రంగా చెక్కి తయారు చేస్తారన్నమాట. ఈ ఆకృతి యంత్రాలు ఏవస్తువుమీదనైనా తయారు చేయవచ్చు ఇవి రెండు రకాలుగా ఉంటాయి.

అ) రేఖలు, రంగులు మంత్రాలు, బీజాక్షరాలు మొదలైనవన్నీ యంత్రాధార మీద ఉండి పైకి వెల్లడియై (చెక్కినట్లు) కనిపిస్తాయి.

ఆ) పైన పేర్కొన్న విషయాలన్నీ యంత్రంమీదే ఉంటాయి.
రెంటిలో విషయాలు అన్నీ యంత్రాలమీదే ఉంటాయి.

### మేరుపృష్ఠ యంత్రాలు

ఈ ఆకృతి వస్తువుల ఆకారము మేరు పర్వతంలాగా ఉన్నతంగా క్రమంగా శిఖరంవైపు సాగుతున్నట్లుగా అంటే పర్వతాకారంగా ఉంటుంది. అంతిమభాగంలో శిఖరం ఉండి అది మొనదేలి ఉంటుంది. క్రిందిభాగం వెడల్పుగా మధ్యభాగంనుండి సన్నగా

ఉంటుంది దీనిలోకూడా 1 రేఖాది విషయాలు చెక్కబడి పైకి వెల్లడియై ఉంటాయి 2 కొన్నింటిలో స్వయంగా వాటిమీదే ఉంటాయి

## పాతాల యంత్రాలు

ఈ యంత్రం మేరుపృష్ఠ యంత్రం తిరగేసినట్లుగా ఉండి చిన్న గిన్నెలాగా ఉంటుంది

## మేరుప్రస్తార యంత్రాలు

పైన పేర్కొన్న మేరుపృష్ఠంలోని రేఖాదులు చెక్కబడి గాని, స్వయంగా ఉన్నట్లుగాని ఉండి యంత్రాకృతిలో కొంత కత్తిరించినట్లు ఉంటుంది. యంత్రంయొక్క విడిభాగము కత్తిరించినట్లు ఉండి ఉపరితలం యొక్క ఆకారం తాబేటి వీపులాగా (కూర్మపృష్ఠంలాగా) కనిపిస్తుంది.

## కూర్మపృష్ఠ యంత్రాలు

వీటి ఆకృతి శిఖరరహితమైన మేరు యంత్రంలాగా ఉండి పోతపోసినట్లు ఉంటుంది క్రిందిభాగం చతురస్రంగా పైభాగం కూర్మపృష్ఠం (తాబేటి వీపులాగా) ఉంటుంది ఇవేకాకుండా ఇంకా అనేక యంత్రాలు వివిధమైన ఆకృతులలో పోతపోయబడి యంత్రతంత్రాలతో అగుపిస్తాయి.

మెడలో ధరించే గొలుసులో ఉంచుకొనే 'పెండ్యులమ్' త్రికోణాకృతిలో, స్వస్తిక్ ఆకారంలో, తమలపాకు ఆకారంలో, తయారుచేస్తారు మరికొన్ని యంత్రాలకు ఒక నిశ్చిత రీతిలో ఒక ఆసనాన్ని సమకూర్చి దానిమీదనే యంత్రాన్ని నిర్మిస్తారు

ఈ యంత్రాల నిర్మాణమంతా భిన్నభిన్న ఫలితాలను దృష్టిలో ఉంచుకొని జరుగుతుంది. వీటికి సంబంధించిన విజ్ఞానమంతా గురుపరంపరగా వచ్చినప్పుడే అది విశేషంగా రాణిస్తుంది

విష్ణుః శివః సురజ్యేష్ఠో మనుశ్చంద్రో ధనాధిపః,
లోపాముద్రా తథాగస్త్యః స్కందః కుసుమసాయకః.
సురాధీశో రౌహిణేయో దత్తాత్రేయో మహామునిః,
దుర్వాసా ఇతి విఖ్యాతా ఏతే ముఖ్య ఉపాసకాః.

\- మానసోల్లాసము

# 4. యంత్రాలు - తత్త్వాలు

## పంచతత్త్వాలతో కూడిన యంత్రాలు - వాటి ఫలితాలు

రేఖాయంత్రాలు, అంకయంత్రాలు రెండింటిలో పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశానికి సంబంధించిన పంచతత్త్వాలు సమ్మిళితం చేయబడతాయి వీటిలో పృథ్వి, జలం, అగ్నికి సంబంధించిన రేఖలు స్పష్టంగా తెలుస్తాయి పృథ్వికి సంబంధించిన రేఖలు చతురస్రంగా చతుష్కోణాత్మకంగా ఉంటాయి జలానికి సంబంధించిన రేఖలు గుండ్రంగా వృత్తాకారంగా సూచింపబడతాయి అగ్నికి సంబంధించిన రేఖలు త్రికోణాకృతిలో ఉంటాయి వరుణరేఖలు త్రివృత్తంగా, మూడున్నర ఆవర్తాలతో లిఖిస్తారు అప్పుడు త్రివలయాకార కుండలినీ స్వరూపం యేర్పడుతుంది

త్రికోణం ఊర్ధ్వముఖంగా ఉంటే శివుణ్ణి సూచిస్తుంది అదే త్రికోణం అధోముఖంగా ఉంటే అది భగవతి పార్వతిని సూచిస్తుంది

పంచదశీ యంత్రంలోకూడా ఈ తత్త్వాలు మనకు కనిపిస్తాయి ఈ తత్త్వాలకు సంబంధించిన ఆకారంలో రేఖలు లేకపోయినప్పటికీ సంఖ్యలకు సంబంధించిన ప్రణాళిక వాటి తత్త్వాలను సూచిస్తుంది కాబట్టి పైన పేర్కొన్న తత్త్వోపాసనతో లభించే ఫలితాలు ఈ క్రిందివిధంగా ఉంటాయి.

1. పృథ్వీతత్త్వం· స్థిరత్వాన్ని, ధైర్యాన్ని, ఉత్సాహాన్ని, ఆలోచనను, భౌతిక సుఖాలను, సాఫల్యాన్ని ప్రసాదిస్తుంది.
2 జలతత్త్వం . చాంచలాన్ని, స్నిగ్ధతను, గౌరవాన్ని, ప్రేమను, సంతోషాన్ని, వివేకాన్ని ప్రసాదిస్తుంది
3. అగ్నితత్త్వం శీఘ్రతను, ఉద్వేగాన్నీ, క్లేశాన్ని, హానిని, అసఫలతను, వినాశాన్ని కలిగిస్తుంది ఉగ్రకర్మల ప్రవృత్తికి దోహదం చేస్తుంది
4. వాయుతత్త్వం మతిభ్రంశాన్ని (పిచ్చి), అవివేకాన్ని, అపకీర్తిని, దు:ఖాన్ని, గౌరవాన్ని, మూర్ఖత్వాన్ని, అజ్ఞానాన్ని పెంపొందించడంలో సహాయకారి అవుతుంది
5. ఆకాశతత్త్వం ఆధ్యాత్మికమైన ప్రేమకు, వైరాగ్యానికి, గహనచింతనకు, మననానికి, అధ్యయనానికి, ఏకాంతానికి ప్రతీక. ఈ తత్త్వాల ఫలితాలలో న్యూనాధిక్యత కలుగుతుంది. అలాగే కర్మదృష్టితో దీనిని ఉపయోగిస్తారు

ఈ తత్త్వాలకు అకృతులు నిర్దేశితమై వాటికి సంబంధించిన బీజాక్షరాలు కూడా ఆయా తత్త్వాలకు సంబంధించినవై లిఖింపబడినపుడు ఆయంత్రసిద్ధి అచిరకాలంలోనే సిద్ధిస్తుంది. శాస్త్రీయ జ్ఞానంవైపు బుద్ధి పెట్టగల వ్యక్తులకోసం స్వరాలు, వ్యంజనాలకు సంబంధించిన తత్త్వాలను ఈ క్రింద పొందుపరుస్తున్నాను

పృధ్వితత్త్వానికి సంబంధించిన వర్ణాలు (అక్షరాలు) ః ఉ, ఊ, ఓ, గ, జ, ఢ, ద, బ, ల.

జలతత్త్వానికి సంబంధించిన వర్ణాలు ఔ, ఘ, ఝ, ద, ధ, భ, వ, స

అగ్నితత్త్వానికి సంబంధించిన వర్ణాలు ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ర, ధ, ఫ, ర

వాయుతత్త్వానికి సంబంధించిన వర్ణాలు అ, ఆ, ఏ, క, చ, ట, త, ప, య, ష

అకాశతత్త్వానికి సంబంధించిన వర్ణాలు అ', అం, ఢ, న్య, ణ, న, మ, శ, హ

సిద్ధమాతృకలు లేదా వర్ణమాల యొక్క విస్తృతినిబట్టి మంత్రరాశి అంతా నిర్మితమౌతుంది కాబట్టి శాస్త్రాలలో నిర్దేశించినట్లు ముందుగా మాతృకలైన వర్ణాల ఉపాసన చేయాలి దీనివల్ల మంత్రసిద్ధికి కావలసిన సహకారం లభిస్తుంది ఈవిధంగా సంఖ్యల సాధనతోపాటు యంత్రగతమైన రేఖలయొక్క లేఖనరూపమైన సాధనకూడా చేయబడుతుంది

అంకెలసంఖ్య వర్ణమాలలోని అక్షరాలయొక్క క్రమానుగత గణనంవల్ల ఏర్పడుతుంది. అనగా అ-1, ఆ-2, ఇ-3, ఈ-4.. ఈ విధమైన గణనం వల్ల అంకయంత్రాలలోని అంకెలను కలిపిజూసినట్లయితే ఆ యంత్రంలోని మంత్రం ఆవిర్భవిస్తుంది. ఇది గురువులు చెప్పిన మాట

ఏ సాధన అయినా ఏదో ఒక అంగంతో పరిసమాప్తం కాదు ఈ విషయాన్ని విస్మరించరాదు అయితే దానికోసం ఏయే అంగాలు అవశ్యకమని చెప్పబడ్డాయో, వాటిని సంపూర్ణంగా సాధించటంకోసం పట్టుదల కలిగి ఉండాలి. కొద్ది అపవాదాలను మినహాయిస్తే అన్నిసాధనల్లో పరిపూర్ణత సాధించాకనే సాధన ప్రారంభిస్తే అది నిర్విఘ్నంగా సమాప్తమవుతుంది.

బాలార్కకోటి రుచిరాం స్ఫటికాక్షమాలాం,
కోదండ మిక్షు జనితం స్మరపంచబాణాన్.
విద్యాంచ హస్త కమలైర్దధతీం త్రినేత్రాం,
ధ్యాయే త్సమస్త జననీం నవచంద్ర చూడామ్.
- కామరాజ మాతృకాన్యాసము

# 5. అంక యంత్రాల మహిమా విశిష్టతలు

అంకయంత్రాలకు సహజంగానే విశేష మహిమ ఉంది అంకవిజ్ఞానంలో సంఖ్యల మాధ్యమంతో కఠినకార్యసిద్ధి కలగటం గమనించబడింది అంకయంత్రాలలో 15నుండి సుమారు 10,00,000 వరకూ అంకెలు ఉంటాయి ప్రాచీన శాస్త్రాలలో పేర్కొన్న మహత్త్వాన్ని ఈ విధంగా సంగ్రహించి చెప్పవచ్చు.

1 పదిహేనవ అంకయంత్రం (15) ఇది అన్నిరకాల సిద్ధులను ప్రసాదించే యంత్రంగా పేర్కొనబడింది ఈ యంత్రం అంకయంత్రాలలో 'యంత్రరాజం'గా కూడా కీర్తించబడింది

2. పదహారవ అంకయంత్రం (16). దీనివల్ల చోరభయం తొలగిపోతుంది

3 19వ అంకయంత్రం(19). ఈయంత్రం ద్వారా ధాన్యనికి సంబంధించిన పురుగులనుండి నివారణ పొందవచ్చు.

4 ఇరవైయవ అంకయంత్రం (20) ఈ యంత్రాన్ని లిఖించి దగ్గర ఉంచు కొన్నట్లయితే సకల భయాలు తొలగుతాయి

5. 24వ అంకయంత్రం(24) ఈ యంత్రంవల్ల శరాఘాతం నుండి తప్పించు కోవచ్చు అనగా ఎక్కుపెట్టిన బాణం గురితప్పుతుంది.

6. 28వ అంకయంత్రం(28) ఇది రోగభయాలను దూరం చేస్తుంది

7. 28వ అంకయంత్రం (28)· ఇది శాకిన్యాది పిశాచబాధలను తొలగిస్తుంది

8. 32వ అంకయంత్రం (32) : ఈ యంత్రాన్ని పుత్ర ప్రసవకాలంలో ఉపయోగించి నట్లయితే సుఖప్రసవం కలుగుతుంది.

9 34వ అంకయంత్రం (34 ) ఈ యంత్రాన్ని దేవధ్వజంమీద లిఖిస్తే శుభప్రాప్తి. పరయంత్ర భయం ఉన్నట్లయితే దానిని ఈ యంత్రాన్ని ధరించటం ద్వారా తొలగించుకోవచ్చు ఇంటి వెలుపలి గోడ మీద ఈ యంత్రాన్ని రచిస్తే అవమానభయం ఉండదు. గాలిదయ్యము, శాకిన్యాది పిశాచాల ప్రభావం తగ్గి పలాయనం చిత్తగిస్తాయి.

10. 36వ అంకయంత్రం (36)· క్రయవిక్రయాలలో ఈ యంత్రాన్ని వద్ద ఉంచుకొని పని ప్రారంభిస్తే సత్వర కార్యసిద్ధి.

11. 40వ అంకయంత్రం (40) : ఈ యంత్రము శిరోవేదనను నివారించు కొనవచ్చు శత్రువు పాదాక్రాంతుడవుతాడు. ఇంటా బయటా గౌరవసిద్ధి, సన్మానము లభిస్తుంది.

12. 50వ అంకయంత్రం (50) : ఈ యంత్రంలో పిల్లల ఏడ్పును (బాల రోదనాన్ని) నివారించవచ్చు.

13. 56వ అంకయంత్రం (56) ఇతరులను ఈ యంత్రంతో మోహింప జేసుకొనవచ్చు మన్మథకార్యాలలో విశేష ఫలప్రదము.

14 62వ అంకయంత్రం (62 ) ఈ యంత్రంద్వారా గొడ్రాలు తన గర్భాన్ని నిలుపుకోవచ్చు.(వంధ్యస్త్రీల గర్భం ఈ యంత్రం ద్వారా నిలుస్తుంది)

15 64వ అంకయంత్రం (64) ఈ యంత్ర మహిమ విశేషమైనది. మార్గమధ్యంలో కలిగే సర్పభయమును ఇది తొలగిస్తుంది. వైరభయం, శాకినీఢాకిన్యాది, పిశాచభయం మొదలైన భయాలన్నింటి నుంచి ఈ యంత్రం ధరించినవారిని రక్షిస్తుంది

16. 70వ అంకయంత్రం . ఈ యంత్రధారణవల్ల కీర్తిప్రతిష్ఠలు వృద్ధి పొందుతాయి. ఉన్నతమైన హోదా లభిస్తుంది.

17. 72వ అంకయంత్రం : భూతప్రేతభయం తొలగి రణరంగంలో విజయసిద్ధి కలుగుతుంది

18. 78వ అంకయంత్రం : ఇది సర్వశుభాలను కలిగిస్తుంది సకల కష్టాలను తొలగిస్తుంది

19. 80వ అంకయంత్రం :సేవాఫలం దీనిద్వారా సంప్రాప్తిస్తుంది

20. 85 అంకయంత్రం(85) మార్గమధ్యంలో కలిగే భయాలు దీనివల్ల తొలగిపోతాయి.

21. 90వ అంకయంత్రం : ఈ యంత్రం ఉండటంవల్ల ఏ దొంగ మన ఇంట దొంగతనం చెయ్యలేడు.

22. 100వ అంకయంత్రం (100) . ఈ యంత్రం సర్వకామనసిద్ధిని కలిగిస్తుంది

23. 120వ అంకయంత్రం (120) : విశేష ఫలప్రదమైన ఈ యంత్రం సుఖప్రసవానికి బాగా ఉపయోగపడుతుంది ప్రసవవేదన తొలగుతుంది

24. 126వ అంకయంత్రం (126) : గర్భవిచ్ఛిత్తికి దీనిని ఉపయోగించవచ్చు.

25. 152వ అంకయంత్రం (152) ఈ యంత్రాన్ని జలంతో కడిగి ఆ జలంతో ముఖం కడుక్కుంటే సౌభ్రాత్రం, స్నేహం వర్ధిల్లుతాయి. అన్న, చెల్లెళ్ళమధ్య ప్రేమాభిమానాలు వృద్ధి పొందుతాయి. తోబుట్టువులు మధ్య అనురాగం పెరుగుతుంది.

26 170వ అంకయంత్రం (170) ఈ యంత్రమహిమ విశిష్టమైనది

27. 172వ అంకయంత్రం (172) ఈ యంత్రం వల్ల పుత్రలాభంతోపాటు [illegible] వీడిపోతాయి

28 రెండువందల అంకయంత్రం (200) వ్యాపారస్థలంలో దుకాణం వెలుపలి గోడమీద లేదా ఇతరత్రా మంగళప్రదమైన చోట దీనిని లిఖిస్తే వ్యాపారాభివృద్ధి కలుగుతుంది.

29. మూడువందల యంత్రం (300) దీనివల్ల స్త్రీ పురుషుల మధ్య అనురాగం పెరుగుతుంది సడలిన ప్రేమలు మళ్ళీ చక్కబడతాయి కూడా

30. నాలుగువందల యంత్రం(400) : ఈ యంత్రం వల్ల గృహంలో ఏవిధమైన భయమూ ఉండదు. పొలంలో ఈ యంత్రాన్ని లిఖించినా లేదా లిఖించిన యంత్రాన్ని ఉంచినా ధాన్యోత్పత్తి విశేషంగా ఉంటుంది.

31. ఐదువందల యంత్రము (500) ఈ యంత్రంవల్ల స్త్రీలు గర్భవతులై సత్సంతానాన్ని పొందుతారు. పురుషులు ధరిస్తే ఉత్తమ సంతతిని బడయగలరు

32. ఆరువందల యంత్రము (600) ఈ యంత్రం సుఖసంపదలను సంప్రాప్తింప జేస్తుంది.

33. ఏడువందల యంత్రం (700) ఈ యంత్రం వల్ల తగాదాలు, కలహాలలో విజయం పొందవచ్చు.

34. తొమ్మిదివందల యంత్రం (900) : ప్రయాణాలలో ఈ యంత్రం ధరించడం ద్వారా భయరహితులు అవుతారు చోరభయం కూడా ఉండదు

35. వెయ్యవ యంత్రం (1000) · దీనివల్ల పరాజయంగాని, పరాభవంగాని ఉండదు. ఈ యంత్రాన్ని ధరించినవాడు సర్వత్ర కార్యసిద్ధిని పొందుతారు.

36. పదకొండువందల అంకయంత్రం (1100) : ఈ యంత్రం వల్ల దుష్టాత్మలు కలిగించే భయక్లేశాలు తొలగిపోతాయి

37. పన్నెండువందల అంకయంత్రం (1200) ఈ యంత్రం కారాగారాన్నుండి విముక్తి కలిగిస్తుంది.

38. యాభైవేల అంకయంత్రం (50,000) · ఈ యంత్రం రాజసన్మానాన్ని ప్రసాదిస్తుంది ఏవిధమైన కష్టమైనా తొలగిపోతుంది

39. పదిలక్షల పది అంకయంత్రం (10,10,000) దీనివల్ల ప్రయాణాల్లో మార్గమధ్యంలో కలిగే చోరభయం ఉండదు.

ఈవిధంగా చూస్తే ఆయా యంత్రాలు ఆయా ఫలితాలు నందించటాన్ని మనం గమనించవచ్చు. రేఖామాత్రంగా పైన పేర్కొనటం జరిగింది.

## 6.యంత్రాల సంఖ్యలు - వాటి దేవతలు

ఒకటి నుండి తొమ్మిది వరకూ గల సంఖ్యలకు సంబంధించిన దేవతలు సూచి, వాటి దిక్కులను క్రమంగా ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1వ | సంఖ్యకు | దేవత | సూర్యుడు | దిక్కు | తూర్పుదిశ |
| 2 | ” | ” | భువనేశ్వరి | ” | నైఋతిదిశ |
| 3. | ” | ” | గణపతి | ” | ఉత్తరదిశ |
| 4 | ” | ” | హనుమంతుడు | ” | వాయవ్యదిశ |
| 5. | ” | ” | విష్ణుమూర్తి | ” | పశ్చిమదిశ |
| 6 | ” | ” | కార్తవీర్యుడు | ” | ఆగ్నేయదిశ |
| 7 | ” | ” | కాళికాదేవి | ” | దక్షిణదిశ |
| 8 | ” | ” | భైరవుడు | ” | ఈశాన్యదిశ |
| 9 | ” | ” | భైరవి | ” | పశ్చిమదిశ |

## 7. యంత్రలేఖనంలో పాటించాల్సిన నియమాలు

యంత్రలేఖనంలో ఒక విషయం బాగా గుర్తుంచుకోవాలి ఏ మంత్రమైన చెక్కినట్లుగా ఉండరాదు. యంత్రానికి సంబంధించిన అన్నిరేఖలూ ధరాతలంనుండి ఉబ్బెత్తుగా వచ్చినట్లుగా ఉండాలి చెక్కబడిన రేఖలు దారిద్ర్యాన్ని తెచ్చిపెడతాయి గనక తగిన జాగ్రత్త తీసుకోవాలి.

యంత్ర లేఖనానికి ఉపయోగించే లోహాలలో రాగి అన్నిటికన్నా శ్రేష్ఠమైనదిగా భావిస్తారు

లక్ష్మీకటాక్షసిద్ధికి, ధనప్రాప్తికి, ఐశ్వర్యసిద్ధికి తయారుచేసే యంత్రాలు బంగారంతో గాని, వెండితోగాని తయారుచేయాలి శాస్త్రకారులు బంగారాన్ని, వెండిని లక్ష్మీనివాస స్థానాలుగా పేర్కొన్నారు అందువల్లనే కనకధారాయంత్రం, శ్రీయంత్రం, లక్ష్మీయంత్రం, లక్ష్మీగణేశ యంత్రం మొదలైన యంత్రాలన్నింటికి తరచుగా బంగారాన్ని, వెండినే ఉపయోగించాలి ఈ లోహాలతో తయారు చేసే యంత్రాలలోనే లక్ష్మీదేవి యొక్క ప్రాణప్రతిష్ఠ చేయడం జరుగుతుంది

# త్రిలోహాలు - వివరణ

త్రిలోహాలతో తయారుచేసిన ఉంగరాలు, యంత్రాలు అద్భుతంగా ఉంటాయి త్రిలోహయంత్రాలలో పది గురివెందగింజపట్టు బంగారం, 12 గురివెంద గింజల ఎత్తు వెండి, 16 గురివెందగింజల ఎత్తు రాగిని ఉపయోగిస్తారు ఈ పరిమాణాలలో తయారుచేసిన యంత్రాలు, ఉంగరాలు కేవలం "రవిప్రష్య" సంయోగంతో తయారుచేస్తారు. త్రిలోహనిర్మితమైన యంత్రాలు, ఉంగరాలు ధరించటంవల్ల దారిద్ర్యం తొలగి ఋణబాధలు తీరుతాయి. ఇటువంటి త్రిలోహపు ఉంగరాల ధారణవల్ల ఆకర్షణ పెరుగుతుంది. అందుకే వీటిని 'తాంత్రికయంత్రాలు' అని కూడా అంటారు

లోహాల మీదనే కాకుండా భూర్జపత్రాలు, పరిశుభ్రమైన తెల్లని కాగితాలమీద కూడా యంత్రాలను లిఖిస్తారు. ఈవిధమైన యంత్రలేఖనానికి సంబంధించి శాస్త్రాలలో 1. పంచగంధ 2. అష్టగంధ 3 గంధత్రయ విధానాలు ఉల్లేఖించబడ్డాయి వాటి వివరణ ఈక్రిందివిధంగా ఉంటుంది

1. గంధత్రయ విధానం · ఈ విధానంలో 1 సింధూరం 2 పసుపు 3 కుంకుమ ఉపయోగిస్తారు. సాధారణమైన నీళ్ళు వాడకుండా దానికి బదులుగా పవిత్ర గంగాజలాన్నిగాని, గులాబీనీరును గాని, అత్తరునుగాని వాడతారు. ఆకర్షణకు, వంశస్థమైన, ఇతర ప్రశస్త కార్యాలకు దీనిని ఉపయోగిస్తారు మరణం, ఉచ్చాటన, విద్వేషం వంటి అన్యనీచకార్యాలలో శ్మశాన భస్మం, శ్మశానాలలో లభించే బొగ్గు, రక్తం, జిల్లేడుపాలు వినియోగిస్తారు.

2. పంచగంధ విధానం · 1.కుంకుమపువ్వు 2 కస్తూరి 3. కర్పూరం 4 చందనం 5. గోరోచనం ఈ ఐదు వస్తువుల మిశ్రమంతో పంచగంధాన్ని తయారుచేస్తారు

3. అష్టగంధం : 1 అగరు 2 తగరం 3. గోరోచనం 4. కస్తూరి 5 చందనం 6. సింధూరం 7. ఎర్ర చందనం 8. కుంకుమపువ్వు ఈ ఎనిమిదింటిని ఒక కల్వంలో వేసి బాగుగా నూరి సిరాలాంటి రసాన్ని తయారుచేసుకోవాలి.

ప్రతి యంత్రలేఖనంలో 'లేఖని' యొక్క ఆవశ్యకత ఉంటుంది ఈ లేఖిని ముఖ్యంగా దానిమ్మ, మల్లె చెట్టునుండి గ్రహిస్తారు అలాగే బంగారం, వెండి, రాగి వంటి లోహాలతో ఇతర ధాతువులతో తయారుచేసిన పొడుగాటి చువ్వను కూడా మంత్రలేఖినిగా ఉపయోగిస్తారు. దీనిలో కూడా ప్రక్రియను బట్టి వేప, మామిడి, జిల్లేడులను, పక్షి ఈకలను, వృక్షాలముళ్ళను యంత్రలేఖనంలో 'లేఖిని'గా ఉపయోగిస్తారు వీటికి సంబంధించిన విశేష చర్చ ఆయా యంత్రాలతోపాటుగా ఉంటుంది

# యంత్రలేఖనంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు

యంత్రలేఖన సమయంలో కలం లేదా లేఖిని విరిగిపోవడం ఆగిపోవడం జరిగితే అది అపశకున మవుతుంది. కాబట్టి పూర్తి జాగ్రత్త వహించాలి.

ఈరోజుల్లో హోల్డరు, పాళీలతో ఉండే పెన్నుల వాడకం అధికం ఉంది. కాబట్టి అలాంటి పెన్నులు వాడేటప్పుడు బంగారంతో తయారుచేసిన సరికొత్త పాళీనే వాడాలి. అంతేకాని మేకు, బాల్‌పెన్ను, పెన్సిలు, స్కెచ్‌పెన్ను మొదలైనవి వాడరాదు. పెన్నులకు వాడే సిరా మన్నికైనదిగా ఉండాలి. అది పైన రాసేందుకు వీలైనదిగా ఉండాలి. బజారులో దొరికే సిరాను తీసుకోకూడదు. భూర్జపత్రం, కాగితం, వృక్షాల చెందిన ఆకులు, లోహాలకు సంబంధించిన పలుచనిరేకులు, స్ఫటికాలు, సాలగ్రామశిలలు, మణులు మొదలైన స్వచ్ఛమైన వస్తువులను యంత్రాల తయారీకి ఉపయోగించాలి. పురుగులు పట్టినవి, చిరిగినవి, విరిగినవి వంకరపోయినవి ఉపయోగించకూడదు. ఈ విషయాలను గుర్తుపెట్టుకోవడం అవసరం.

స్వచ్ఛత, పవిత్రత యంత్రసిద్ధికి ప్రథమసోపానం అని గ్రహించాలి.

యంత్రాన్ని ఇతరులచేత అనగా ఇతర శిల్పులచేత చెక్కించే పక్షంలో ఆధార వస్తువుమీద మొదటగా ఒక శుభముహూర్తాన తగిన వస్తువులతో రేఖాచిత్రం గీయించాలి. తరువాత యథాసమయంలో శిల్పి పనిముట్లను శుద్ధజలముతో ప్రక్షాళనచేసి గంధాక్షతలు చల్లాలి. శిల్పికి బొట్టుపెట్టి దక్షిణలు సమర్పించి ఖాద్య వస్తువులను ప్రసాదంగా ఇచ్చి ఆ తరువాత యంత్రాన్ని చెక్కించడం మొదలుపెట్టాలి.

యంత్రలేఖనం ప్రారంభించినప్పటినుండి యంత్రలేఖనానికి నిర్దేశించే విధివిధానాన్ని సక్రమంగా సంపూర్ణంగా పాటించాలి. ఇంకా ఈ క్రింద పేర్కొన్న విషయాలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి.

1. యంత్రలేఖన వేళలో మౌనంగా ఉండాలి. ఇష్టదేవతా మంత్రాన్ని గాని యంత్రసంబంధమైన మంత్రాన్నిగాని భక్తిపూర్వకంగా స్మరించాలి.
2. సుఖాసనంలో కూర్చోవాలి. కర్మభేదాన్నిబట్టి ఇతరమైన ఆసనాలను కూడా ఉపయోగించవచ్చు.
3. ఎదురుగా ఒక బల్లగాని, పీటగాని, నలుచదరంగా ఒక పట్టాగాని ఉంచుకొని దానిమీద ఆధారవస్తువును ఉంచుకొని యంత్రలేఖనం ప్రారంభించాలి. మోకాలు

మీద, తొడలమీద ఉంచుకొని యంత్రాలు గీయడం నిషేధము.ఎందుకంటే నాభి క్రింది భాగాలన్నీ ఇలాంటి పనులకు పనికిరావు.

4. యంత్రలేఖనసమయంలో ధూపదీపాలు విధిగా ఉండాలి.
5. యంత్రలేఖనాన్ని ప్రారంభించడానికి ముందే సంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానాలన్నీ పూర్తిచేసుకోవాలి.
6. దిశ, జాము, తిథివార నక్షత్రాలు యోగం, చంద్రబలం, మంచిరోజు అన్నీ గమనించి యంత్రేఖనం ఆరంభించాలి.
7. మంచివస్త్రాలు ధరించాలి. చాకలిచేత ఉతికించినవి చిరిగినవి, పాతవి నలిగిపోయిన బట్టలు వాడరాదు. కుదిరినంతవరకు పట్టుబట్టలు, ఉన్నిపంచెలు, ఉత్తరీయాలు ధరించాలి.
8. యంత్రలేఖన వేళలో మంచి ఆలోచన చేయాలి తప్ప చెడు ఆలోచనలు చేయరాదు. తను చేపట్టిన ఈ పని విజయవంతమవ్వాలని, దైవకృప కలగాలని భావనచేస్తూ-లేఖనాన్ని కొనసాగించాలి.
9. అనుచిత కార్యసిద్ధికి ప్రయత్నించరాదు.
10. మరణసంబంధమైన, ఉచ్చాటన సంబంధమైన కర్మలనుండి ఎల్లప్పుడూ దూరంగా ఉండాలి. అలాంటి కర్మలను చేపట్టే ప్రక్రియల పరిణామాన్ని కర్తలు కూడా అనుభవించాల్సి ఉంటుంది.
11. ఈవిధంగా ఆసనాన్ని, ప్రదేశాన్ని అన్యసాధకోపయోగమైన నిర్దేశాలను తప్పక పాటించాలి.
12. యంత్రాన్ని భూమిమీద ఉంచాలి. అలాగే పరిశుద్ధంగా తయారుచేయాలి. దానిని సదా దైవస్వరూపంగా భావించి గౌరవించాలి.
13. యంత్రధారణలో పూజాదులలో లోకాచారపరంగా సూతకం వంటివి సంభవించి నప్పుడు యంత్రానికి పునః ధూపజపాదులు నిర్వర్తించి మంత్రజపంతో శుద్ధిచేయాలి.

సుధాసింధుమధ్యే మణిద్వీపరమ్యే,
సుకల్ప ద్రుమా కల్ప కాందబసత్రే.
స్ఫురత్స్వర్ణసింహాసనే రత్నపీఠే,
భవాంకే నిషణ్ణాం భజామ్యన్నపూర్ణామ్.

- శ్రీశంకరభగవత్పాదులు

# శ్రీ యంత్రం

## అనంత ఐశ్వర్యసిద్ధికి అమోఘమైన ఉపాయం

అనంతైశ్వర్యసిద్ధికి, లక్ష్మీప్రాప్తికి 'శ్రీవిద్య' లేదా శ్రీ యంత్రమహిమ సర్వశ్రేష్ఠంగా మోన్నతగింది శ్రీవిద్య 'శతాక్షరీ పరమావిద్యా' అనే పేరుతో ప్రసిద్ధమైనది. శ్రీవిద్యయే లలిత రాజరాజేశ్వరి, మహాత్రిపురసుందరి, బాల, పంచదశి, షోడశి ఇత్యాదిపేర్లతో విఖ్యాతమైనది ప్రసిద్ధమైన దశమహావిద్యలలో "షోడశీవిద్య", శ్రీ విద్య యొక్క పరిణతస్వరూపమే! దీనియొక్క మూలమంత్రం కేవలం వంద అక్షరాలే ఉంటాయి దీని నిరంతర అవృత్తిలో "శ్రీ కామః శతతం జపేత్" అని పేర్కొన్నట్లుగా తక్షణసిద్ధి లభిస్తుంది శ్రీమాలి బ్రాహ్మణులలో ఈ విద్య వంశపారంపర్యంగా వస్తోంది. శ్రీమాలి బ్రాహ్మణుల ఇళ్ళలో కులదేవతారూపంలో ఆదిశక్తియైన శ్రీస్వరూప భగవతి మహాలక్ష్మినే ఉపాసించ బడుతూ ఉంటుంది

ఈ కారణంగానే శ్రీ విద్యలో నిష్ణాతులైన ఉపాసకులు, పండితులు కాలక్రమేణా 'శ్రీమాలి బ్రాహ్మణులు' గా విఖ్యాతమవుతూ వచ్చారు (అనగా శ్రీ విద్యోపాసకులైన బ్రాహ్మణులు).

సౌరాష్ట్రదేశంలోని ప్రసిద్ధ సోమనాథ మందిరంలోని భూగర్భంలో స్వర్ణశిలలమీద శ్రీయంత్రాలు చెక్కబడి ఉన్నాయి. వీటికి శ్రీమాలి బ్రాహ్మణులు రహస్యంగా నిత్య రాజోపచార పూజలు చేసేవారు ఈ కారణంగానే అక్కడ నిత్యమూ అనంత ఐశ్వర్యవృష్టి జరుగుతూండేది. కోటానుకోట్ల రత్నరాశులు కేవలం ఆ దేవాలయ స్తంభాలమీదనే పొదగబడి ఉన్నాయి. ఈ మందిర కీర్తిప్రతిష్ఠలకు వైభవానికి ఆకర్షితుడై గజనీమహమ్మదు దీనిని కొల్లగొట్టుకుపోయాడు. అప్పుడే బంగారంమీది పేరాశతో అక్కడ ఉన్న శ్రీయంత్రాలను కూడా ముక్కలుచేసి (ఖండఖండాలుచేసి) తన వెంట తీసుకొనిపోయాడు. నాటినుండి సోమనాథదేవాలయం 'శ్రీయంత్ర' విహీనమైంది. తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరుని ప్రధాన విగ్రహంయొక్క పీఠంలో కూడా శ్రీయంత్రం చెక్కబడి ఉన్నట్లు చెబుతారు. ఆ మంత్రానికి నేటికీ విధివిధానంగా నిత్యపూజలు జరుగుతున్నాయి.

ఈ దేవస్థానం నేడు ప్రభుత్వాధీనంలో ఉన్నప్పటికి నెలసరి ఆదాయం లక్షల్లో కోట్లలో లభిస్తోంది

సాధారణంగా 'శ్రీ' శబ్దం శ్రేష్ఠతను, పూజనీయతను చెబుతుంది మహాత్ములు మహాపురుషుల పేర్లముందు 'శ్రీ' శబ్దాన్ని ప్రయోగిస్తారు వారి శ్రేష్ఠత్వాన్ని బట్టి 3, 4, 5,6 సార్లు 'శ్రీ' శబ్దాన్ని పేర్ల ముందు ప్రయోగించవచ్చునని శాస్త్రప్రమాణం ఉన్నది ప్రధాన పీఠాధిపతుల, జగద్గురువుల పేర్లముందుగాని, వెనుకగాని 108 సార్లు 'శ్రీ' శబ్దాన్ని ప్రయోగించటం కూడా ఉంది వ్యవహారంలో గమనించినట్లయితే 'శ్రీ' శబ్దానికి ప్రసిద్ధమైన అర్థం 'లక్ష్మి' అనిగదా! కాని 'హరితాయనసంహిత', బ్రహ్మాండపురాణంలోని ఉత్తర ఖండం మొదలైన పురాణేతిహాసాల్లో వర్ణితమైన గాథలనుబట్టి చూసినట్లయితే 'శ్రీ' శబ్దానికి అర్థం ముఖ్యంగా 'మహాత్రిపురసుందరి' అని మాత్రమే ఉన్నది. లక్ష్మీదేవి మహాత్రిపురసుందరిని, చిరకాలం ఆరాధన చేసింది తత్ఫలితంగా అనేక వరాలను ఆమె ఆదేవీ కటాక్షం వల్లపొందింది. ఆ వరాలలో 'శ్రీ' శబ్దంతో ప్రఖ్యాతిపొందటం అనే వరం కూడా ఆమె పొందింది. ఆనాటినుండి 'శ్రీ' శబ్దానికి అర్థం 'లక్ష్మి' గా స్థిరపడింది

## 1. శ్రీవిద్యా వైశిష్ట్యం

సాత్త్వికమైన ఉపాసనల్లో సర్వశ్రేష్ఠమైన ఉపాసన శ్రీవిద్యోపాసన. శ్రుతులు కీర్తించిన ఉత్తమసాధన. ఆయా దేవతలను ఆరాధించడం ద్వారా మనం ధనధాన్య పశుసమృద్ధిని, సంతానప్రాప్తిని లౌకికంగా సిద్ధింపజేసుకోవచ్చు.

శ్రీ విద్యోపాసకులకు లౌకిక ఫలాలేకాక వాటితోపాటుగా ఆత్మజ్ఞానం కూడా లభించి భోగాలతోపాటు చివరకు మోక్షసిద్ధి కూడా కలుగుతుంది.

"అజ్ఞానాన్ని జ్ఞానంలో ఐక్యం చెయ్యడం లేక ప్రకృతిని పరమాత్మలో లీనం చెయ్యడం లేక మాయను సత్యంలో కైవల్యం పొందించడం లేక ద్వైతాన్ని అద్వైతంలో లీనం చెయ్యడం లేక అనేకత్వాన్ని ఏకత్వంలో చూడటం అనేదే! అనగా "అహం బ్రహ్మాస్మి" సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే రెండు సాధనలతో కూడిన పూర్ణయోగమే శ్రీవిద్య అనబడుతుంది. ఈ శ్రీవిద్య మహావిద్య, మహామంత్రరూపిణి, మహాశక్తిరూపిణి అనేక విధాలుగా కీర్తించబడింది. లోకంలోని అన్నివిద్యలు, అన్నిమంత్రాలు, అన్ని సాధనలు శ్రీవిద్యోపాసనకు ఉపాంగాలే. త్రిపురసుందరి, త్రిభువనేశ్వరి, త్రిలోకేశ్వరి అనేవి త్రిపుటిలో సంచరించే త్రిగుణరూప మహాశక్తికి పేర్లు. త్రిపుటి అంటే – పుటం అంటే దొప్ప అని అర్థం. ఒకదొప్పలో మరొక దొప్పను ఇమిడ్చినప్పుడు ఒకే దొప్పరూపంలో ఉండే మూడు దొప్పల దొంతర అని అర్థం. అల్లాగే అకారోకార, మకారాల యొక్క (అ, ఉ, మ్)

అర్థాన్ని ఒకదానిలో ఒకటి ఇమిడ్చి మూడింటిని ఐక్యస్థితిలో చూడటమే త్రిపుటి విద్యాసాధన అంటే" అని డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారు తను 'అంతరార్థ' శ్రీదేవీ భాగవతము, అంతరార్థ మహావిష్ణుపురాణము" - అనే గ్రంథంలో పేర్కొన్నారు.

యత్రనాస్తి భోగో న చ తత్ర మోక్షో, యాత్రాస్తి మోక్షో న చ తత్రభోగః ।
శ్రీ సుందరీ సేవన తత్పరణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థయేవ ॥

సుఖం (భోగం) ఉన్నచోట మోక్షం ఉండకపోవచ్చు, మోక్షం ఉన్నచోట సుఖం లేకపోవచ్చు కాని శ్రీమహాలక్ష్మిని సేవించటంద్వారా మాత్రం సుఖాన్ని, మోక్షాన్ని రెండింటిని సులభంగా కరతలామలకం చేసుకోవచ్చు (సాధించవచ్చు). శ్రీ విద్యోపాసనకు ప్రబల మాధ్యమం శ్రీయంత్రం దీని ఉపాసనాపద్ధతి తంత్రాల ఆధారంగా యేర్పడిన పద్ధతి. త్రిపురోపనిషత్తులో 'కాది - హాది' విద్యల పేరుతో దీనిని గురించిన స్పష్టమైన చర్చ మనకు కనబడుతుంది పరమ దయాస్వరూపులు పూజ్యభగవత్పాద శ్రీమచ్ఛంకరాచార్యుల లేఖినినుండి ప్రాదుర్భూతమైన 'సౌందర్యలహరి', 'ప్రపంచసారం' మొదలైన గ్రంథాలు శ్రీవిద్యోపాసనలో పవిత్ర సాత్త్విక ఉపాసనకు సంబంధించిన అత్యుత్తమ ప్రామాణిక గ్రంథాలు.

శ్రీవిద్య గురుగమ్యమైనది. సద్గురు కృపలేనిదే శ్రీయంత్రం ఫలితాలను ప్రసాదించదు. శ్రీశంకరాచార్యులకు ఈ ఉపాసనాదీక్ష పరమ యోగీశ్వరులైన శ్రీ గోవింద పాదాచార్యుల వద్దనుండి లభించింది. శ్రీగోవింద పాదాచార్యులకు ఈ విద్య శ్రీగౌడ పాదాచార్యుల గురువు పరమాచార్యుడు అయిన సాక్షాత్తు దత్తాత్రేయ భగవానుడే స్వయంగా ప్రసాదించాడు. ఈవిధంగా శ్రీవిద్యోపాసనకు అతిప్రాచీనమైన గురుపరంపరలు సర్వ ప్రసిద్ధంగా ఉన్నాయి.

'సుందరీతాపనీయకు' అనే గ్రంథంలో - గృహం, కలశం, కుంభం అనే మూడు శబ్దాలు ఏకార్థవాచకాలు (పర్యాయపదాలుగా) ఉన్నట్లుగానే యంత్రం, దేవత, గురువు అనే ఈ మూడు శబ్దాలు ఏకార్థవాచకలే అని పేర్కొనబడింది. ఈ మూడు ఒకే అర్థాన్ని సూచిస్తాయి.

**యో వై తాం బ్రహ్మణో వేద అమృతేనావృతాం పురీ,**
**తస్మై బ్రహ్మాచ బ్రహ్మేచ ఆయుః కీర్తిం ప్రజాం దదుః.**
- శ్రీ విద్యోపాసనాఫలము

## 2. శ్రీ యంత్ర మహిమ

శ్రీ యంత్ర విశేషాలు అత్యంత గంభీరమైనవి. తాంత్రిక సాహిత్యంలో శ్రీయంత్రాన్ని గురించి వ్రాసినట్లుగా మరే ఇతర యంత్రాన్ని గురించి వ్రాయబడలేదు. 'రుద్రాయామళం' అనే గ్రంథంలో దీనికి సంబంధించిన మంత్రాన్ని ఈ విధంగా ఉటంకించారు.

**బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మం, మన్వస్రనాగదల సంయుత షోడశారమ్।**
**వృత్తత్రయం చ ధరణీసదనత్రయంచ, శ్రీ చక్రరాజముదితం పరదేవతాయాః॥**

అనగా ఆవణపూజ, నిర్మాణం ఈ రెండింటి దృష్టితో చూసినట్లయితే శ్రీ యంత్రంలోని తొమ్మిది చక్రాలు ఈవిధంగా ఉంటాయి -

1. బిందువు, 2. త్రికోణం, 3. (వసు) అష్టత్రికోణ సమూహము, 4. దశారయుగ్మం (పది త్రికోణాల సమూహం) 5. దశ త్రికోణాల సమూహం (మరొకటి), 6. (మన్వస్ర) పదునాలుగు త్రికోణాల సమూహము, 7. (నాగదళం) అష్టదళకమలం 8. షోడశదళ కమలం ( 16 రేకుల కమలం), మూడు వలయాలు (వృత్తాలు), 9. భూపురం అనగా మూడు ప్రాకారాలు ఉంటాయి.

## 3. శ్రీయంత్రం - శ్రీ చక్రం

బీజాక్షరాలతో కూడి ఉన్నదానిని శ్రీయంత్రమని బీజాక్షర రహితంగా ఉన్నదానిని 'శ్రీచక్ర' మని అంటారు. శ్రీ యంత్ర పూజల్లో దక్షిణాచారం, వామాచార పద్ధతులున్నాయి. వాటి సంబంధించిన వర్ణనంతా 'త్రిపురతాపిని' త్రిపురోపనిషత్తుల్లో మనకు లభిస్తుంది. శ్రీయంత్రాన్ని ఆర్తితో శ్రద్ధాభక్తులతో నియమ నిర్దేశానుసారంగా పూజించినా, దర్శించినా అపారధన సంపత్తి కలుగుతుంది. దీనికి అనేక ప్రత్యక్ష నిదర్శనాలున్నాయి.

ఆవరణ పూజల్ని స్వయంగా నిర్వహించగల సమర్థులు బీజమంత్రాక్షర సహితమైన శ్రీయంత్రాన్ని ఉపయోగించుకోవచ్చు. లక్ష్మినివాసస్థానం బంగారంలోను వెండిలోను ఉంటుందని శాస్త్రజ్ఞులు (శాస్త్రకారులు) పేర్కొన్నారు. కాబట్టి బంగారంతోగాని, వెండితో గాని తయారుచేసిన శ్రీయంత్రాలు ఎక్కువ మహిమాన్వితంగా ఉంటాయి. ధాతునిర్మిత శ్రీయంత్రాల్లో పునఃప్రతిష్ఠ, అభిషేకం మొదలైన సౌకర్యాలు ఉంటాయి.

## 4. శ్రీయంత్రంతో ఉంగరాలు

త్రిలోహాలతో అనగా బంగారం, వెండి, రాగి మిశ్రమంచేసిన మిశ్రధాతు ఉంగరాన్ని వెండి, రాగి మిశ్రమం చేసిన మిశ్రధాతు ఉంగరాన్ని తయారుచేసి దానిమీద శ్రీయంత్రాన్ని చెక్కినట్లయితే దాని మహిమ అపారంగా ఉంటుంది అత్యంత అద్భుతమైన ఫలితాలను మనం గమనించవచ్చు

భూర్జపత్రంమీద అష్టగంధంతో శ్రీయంత్రాన్ని గీసి 'మనీపర్సు' లో ఉంచుకొన్నట్లయితే ఆ పర్సు కరెన్సీ నోట్ల కట్టలతో నిత్యం నిండి ఉంటాయి ధనవృద్ధి విపరీతంగా ఉంటుంది ఇది ఎందరో అనుభవపూర్వకంగా చూసిన విషయం 'యామళ తంత్రం'లో శ్రీయంత్ర దర్శన మాత్రంచేతనే అనేక సత్ఫలితాలు పొందవచ్చని పేర్కొనబడింది

మహాషోడశదానాని కృత్వా యల్లభతే ఫలమ్ ।
తత్ఫలం సమవాప్నోతి కృత్వా శ్రీచక్ర దర్శనమ్ ॥

సార్ధ త్రికోటి తీర్థేషు స్నాత్వా యత్ఫల మశ్నుతే ।
లభతే తత్ఫలం భక్త్యా కృత్వా శ్రీచక్ర దర్శనమ్ ॥

మహాషోడశదానాలు చేయడంద్వారా లభించే ఫలం ఒక్క శ్రీచక్ర దర్శనంతో మనకు లభిస్తుంది భక్తిపూర్వకంగా శ్రీచక్రాన్ని దర్శించినట్లయితే మూడుకోట్ల యాభైలక్షల తీర్థాలలో పవిత్రస్నానం చేస్తే లభించే ఫలమంతా లభిస్తుంది

## 5. శ్రీయంత్ర మూలమంత్రం

- "ఓం శ్రీం హ్రీం క్లీం హ్రీం మహాలక్ష్మ్యై నమః "

24 అక్షరాల మహాలక్ష్మీ మంత్రం

- "ఓం కమలే కమలాలయే ప్రసీద, ప్రసీద శ్రీం హ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః"

సుగంధధూపంతో, పరిమళ పుష్పాలతో లేదా మల్లెపూల అత్తరు చల్లి పైన పేర్కొన్న మంత్రాలను శ్రీయంత్ర సన్నిధిలో ఏకాగ్రచిత్తంతో 18సార్లుగాని, 27 సార్లుగాని 45 సార్లుగాని, 108 సార్లుగాని జపించాలి. ఈ జపంవల్ల శీఘ్రమే అభీష్టసిద్ధి కలుగుతుంది.

## 6. మూడు ఆకృతులతో శ్రీయంత్రాలు

శ్రీ యంత్రాలు మూడు ఆకృతులలో మనకు కనిపిస్తాయి.

1. భూపృష్ఠం (నాణెం మీదగాని, పతకంమీదగాని)
2. కూర్మపృష్ఠం (మధ్యన ఉబ్బెత్తుగా)
3 మేరు పృష్ఠం (ఒక్కొక్క ఖండం ఆవరణ పూజానుసారంగా ఉబ్బెత్తుగా ఉన్నవి.)

## 7. శ్రీ యంత్రం - అద్భుత రహస్యాలు

"శ్రీ యంత్రం" భగవతి త్రిపుర సుందరీదేవికి సంబంధించినది. వైదిక వాఙ్మయంలో దీనిని సర్వోత్తమమైనదిగా, సర్వశ్రేష్ఠమైనదిగా చెప్పబడింది. పరాశక్తి తన సంకల్ప బలంతోనే విరాట్ (విశ్వ) బ్రహ్మాండ రూపాన్నంతా గ్రహిస్తూ శ్రీ యంత్రోత్పత్తి విషయాన్ని తన స్వరూపాన్ని పరకాయించి చూసినపుడు శ్రీ చక్రం ఆవిర్భవించిందని 'యోగినీ హృదయం' అనే గ్రంథం పేర్కొంది.

ఇంతకంటే కూడా 'యామళ తంత్రంలో ఈవిధంగా పేర్కొనబడింది.

"చక్రం త్రిపుర సుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ"

"ఓ ఈశ్వరీ! త్రిపురసుందరి యొక్క ఆధారచక్రము బ్రహ్మాండమే ఇందు ఆకారముగా గలది. బ్రహ్మాండము యొక్క ఉత్పత్తి, వికాసాలు ప్రదర్శితమయ్యాయి.

## శ్రీ యంత్ర నిర్వచనం

శ్రీ యంత్రంలోని 'శ్రీ' శబ్దంయొక్క అర్థాన్ని ఈవిధంగా చెప్పారు . శ్రయణము చేయబడేది అనగా ఆశ్రయింపబడునది యేదియో అది శ్రీ అనబడును - శ్రీయతే యా సాశ్రీ - అనగా శ్రయణం చేయబడేదే శ్రీ అని అర్థం. నిత్యమూ పరబ్రహ్మమును ఆశ్రయించేదే "శ్రీ". వెలుగుకు, వేడిమికి అభిన్నత ఉన్నట్లుగానే బ్రహ్మ, శక్తి ఈ రెండూ అభిన్నంగానే ఉంటాయి.

ఆగమాల్లో కూడా ఇదే సిద్ధాంతీకరించబడింది.

న శివేన వినా దేవీ న దేవ్యా చ వినా శివః ।
నానయోరన్తరం కి ఞ్చిచ్చంద్ర చంద్రిక యోరివ ॥

అనగా శివుడు లేకుండా శివాని (దేవి) లేదు. భవాని లేకుండా శివుడు లేదు. చంద్రుడికి వెన్నెలకు ఎట్టి తేడా లేనట్లే వీరిరువురికి ఏవిధమైన భేదము ఉండదు.

బ్రహ్మదేవుని సృష్టి స్థితి పాలనాసామర్థ్య విశేషానికి, కీర్తికి కారణము 'శ్రీ' యే.

శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్ ।
నచే దేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ॥

"శివుడు శక్తితో కూడిన నాడే శక్తియుక్తుడవుతాడు. సామర్థ్యవంతుడు (సమర్థుడు) అవుతాడని భావము. శక్తిహీనుడైన మహాదేవుడు చలించుటకు కూడా సమర్థుడు కాలేదు. జగత్తును నిర్మించాలంటే శివుడు శక్తితో కూడియున్నప్పుడే సమర్థుడు. అలాకానప్పుడు శివుడు కూడా కదలటానికి సమర్థుడు కాలేదు.

## 9. శ్రీకంఠం పంచ త్రికోణాల రహస్యం

ఈవిధంగా మహిమాన్వితమైన త్రిపురసుందరీ యంత్రాన్ని గురించి బాగా అధ్యయనం చేయాలి.



శ్రీ యంత్రం యొక్క చిత్రాన్ని (పటాన్ని) గమనించినట్లయితే మనకు అనేక వృత్తాలు కనిపిస్తాయి. అన్నిటికన్న వెలుపల ఉన్న వృత్తం యొక్క కేంద్రంలో బిందువు ఉంటుంది. ఈ బిందువుకు నాలుగువైపులా తొమ్మిది త్రికోణాలు యేర్పాటుచేయబడి ఉంటాయి. వీటిలో ఐదింటికి కొనలు (శీర్షాలు) ఊర్ధ్వంగా, నాల్గింటికి వాటికొనల అధోముఖంగా కనిపిస్తాయి. శీర్షాలు ఊర్ధ్వముఖంగా ఉన్న త్రికోణాలు భగవతికి ప్రాతినిధ్యం వహిస్తాయి. వాటిని శివాని సంజ్ఞలతో సూచిస్తారు. శీర్షాలు (కొనలు) అధోముఖంగా ఉన్న త్రికోణాలు శివునికి ప్రాతినిధ్యం వహిస్తాయి. వీటిని 'శ్రీకంఠం' అని పిలుస్తారు. ఊర్ధ్వముఖంగా ఉండే పంచత్రికోణాలు, పంచప్రాణాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు, పంచ (మాయా) భూతాలకు ప్రతీకలు. శరీరంలో గాలి, ప్రాణం, శుక్లం, మజ్జాధాతువులు ఉంటాయి. బ్రహ్మాండంలోని మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములకు ప్రతీకలు. ఐదు ఊర్ధ్వముఖ త్రికోణాలూ తొమ్మిది మూలప్రవృత్తులకు ప్రతీకలు. ఈవిధంగా శ్రీయంత్రంలో అష్టదళ (8) పద్మం ఒకటి షోడశ (16) దళపద్మం మరొకటి ఉంటాయి. అష్టదళపద్మం లోపలి వృత్తం వెలుపల షోడశపద్మం వెలపలి వృత్తం వెలుపల ఉంటాయి.

ఈ యంత్రంలో ఊర్ధ్వముఖ త్రికోణాలు అగ్నితత్త్వానికి అధోముఖ త్రికోణాలు ఆకాశ తత్త్వానికి భూపురం పృథివీతత్త్వానికి ప్రతీకలుగా భావిస్తారు. ఈ యంత్రం సృష్టిక్రమానికి సంబంధించినదిగా ఉంటుంది. ఈ యంత్రోపాసన సమయ మతస్థులు చేస్తారు. జగద్గురు శంకరాచార్యులవారు కూడా సమయ మతావలంబులే! వారు స్థాపించిన అన్ని మఠాలలో 'శ్రీ యంత్రం' ప్రతిష్ఠితమై ఉంటుంది

కౌళ మతస్థుల శ్రీయంత్ర నిర్మాణం వేరుగా ఉంటుంది. అంటే ఐదు శక్తికోణాలు సమయ మతస్థులకు ఊర్ధ్వముఖంగా ఉంటే కౌళ మతస్థులకు అధోముఖంగా ఉంటాయి. శివప్రతీకలుగా ఉండే నాలుగు త్రికోణాలు ఊర్ధ్వముఖంగా ఉంటాయి ఈవిధంగా శ్రీయంత్రం సంహారక్రమంలో నిర్మితమవుతుంది.

## 10. శ్రీయంత్రం యొక్క రహస్యమయ నిర్మాణం

శ్రీ యంత్రంలో తొమ్మిది చక్రాలుంటాయి. అవి ఒకే విధంగా వుండి తొమ్మిది కళారూపాలను ధరించి ఉంటాయి మేరువృష్ఠ శ్రీయంత్రంలో ఒక్కొక్క కోట ఒకదాని ప్రక్క ఒకటి ఎత్తుగా ఉంటుంది. ప్రథమ భూపురచక్రం భూమిమీద ఉంటుంది. అగ్నిబిందు చక్రం శిఖరం మీద ఉంటుంది. ఈ కోటల రంగులు ఈక్రిందివిధంగా ఉంటాయి.

నీలిరంగు, పసుపు, గులాబీరంగు, ఎఱుపు, నలుపు, పసుపు, బిందుచక్రం మొక్కరంగు ఎఱుపు.

శ్రీయంత్ర రేఖాకృతిలోని భూపురంలో మూడురేఖలుంటాయి. ఇవి మూడు ప్రాకారాలు ఒకదానికంటే ఒకటి కొంచెం ఎత్తుగా ఉంటాయి ఈ ప్రాకారాల నాలుగు దిక్కులా నాలుగు ద్వారాలుండి నాలుగు కోణాలమీద నాలుగు బురుజులుంటాయి. వెలుపలి ప్రాకారంలో 'అణిమాది' సిద్ధిదేవతలు ద్వారంమీదగాని, బురుజుమీదగాని ఉంటాయి రెండవ ప్రాకారంలో బ్రహ్మ మొదలైన మాతృకలు, మూడవ ప్రాకారంలో ముద్రాశక్తులు ఉంటాయి. 8వ స్థానంలో 10 శక్తులు ఉన్నట్లయితే అక్కడ పూర్వపశ్చిమ ద్వారాల్లో రెండేసి శక్తులుంటాయి. ద్వితీయ షోడశదళాల్లో రెండు రేఖలు ఉంటాయి. ఇవి రెండు వలయాలుగా ఉంటాయి. వీనిలో వెలుపలి ప్రాకారం కొంచెం క్రింద ఉంటుంది. వెలుపలి ప్రాకారంమీద 16 నిత్యశక్తులు ఉంటాయి. వీటిమీద కామాకర్షణి ఇత్యాది 16 కళలు, శక్తులు ఉంటాయి.

మూడవది అష్టదళపద్మాకరంలో ఉండే ప్రాకారం దీని అష్టదళాలలో అష్టదేవతలు ఉంటారు. నాలుగవ చక్రం వలయాకార ప్రాకారము. దీనిమీద కొంచెం పైన 14 త్రికోణాలు ఉంటాయి. ఒక్కొక్క త్రికోణంమీద ఒక్కొక్క శక్తి ఉంటుంది. ఐదవ బహిర్దశార చక్రం యొక్క ప్రాకారం దశత్రికోణాలతో యేర్పడి ఉంటుంది. ఆరవ అంతర్దశార చక్రం అన్నింటికంటే ఉన్నతమైనదిగా ఉంటుంది. ఇది కూడా దశ త్రికోణాలతో నిర్మితమై ఉంటుంది. ఏడవ అష్టార చక్రం యొక్క ప్రాకారం అష్టత్రికోణాలతో నిర్మితమై ఉండి దాని మూడు కోణాలలో (మూలలలో) 3 వలయాకార బురుజులుంటాయి. వీటిపై మూడు మహాశక్తులు ఉంటాయి. ఈ ప్రాకారంలో మూడు ద్వారాలుంటాయి. వీటిలోని రెండు ద్వారాలలో ఒక్కొక్క శక్తి, మూడవద్వారంలో రెండు శక్తులు ఉంటాయి. తొమ్మిదవ చక్రం లేదా బిందుచక్రం యొక్క ప్రాకారం గోళాకృతిలో ఉండి ఒక ద్వారంలో ఉంటుంది.

శ్రీ లలితాదేవి యొక్క ఆఖ్యానంలో శ్రీ లలితామాతయైన మహాత్రిపురసుందరిదేవి తనయొక్క 125 శక్తులతో కూడి ఇటువంటి మేరుపృష్ఠ శ్రీ చక్రాకార రథాన్ని అధిరోహించే యుద్ధం చేసినట్లుగా పేర్కొనబడింది.

మధ్యలో బిందువు నాలుగువైపుల ఒక ముఖ్య త్రికోణము, దాని వెలుపల నాలుగువైపుల చుట్టూ అష్టత్రికోణాలు ఉంటాయి అనగా బిందువు వెలుపల చుట్టూ తొమ్మిది త్రికోణాల కలయిక యేర్పడుతుంది. ఈ నిర్మాణం వల్ల చిన్న పెద్దమొత్తం మూడు కోణాలు స్వతసిద్ధంగా యేర్పడతాయి. ఈ తొమ్మిది త్రికోణాలలో ఊర్ధ్వముఖంగా ఉండే ఐదు త్రికోణాలను 'శక్తి త్రికోణా"లంటారు. మిగిలిన నాలుగు త్రికోణాలను 'శివ త్రికోణాలు" అంటారు.

మధ్యబిందువులో సర్వశ్రేష్ఠ మహాశక్తి స్వరూపిణి " శ్రీ మహాత్రిపురసుందరీదేవి" శోభాయమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది బిందువు నుండి బయలుదేరి ప్రధమ మహాత్రికోణం యొక్క మూడు కోణాలలో త్రికోణాత్మకమైన ద్వితీయశ్రేణి మహాశక్తులు విరాజిల్లుతూ ఉంటాయి ఈ త్రికోణంలో చుట్టూ నాలుగు ఆయుధశక్తులు ఉంటాయి. ఈవిధంగా బిందువు చుట్టూ ఒక చక్రం యేర్పడుతుంది బిందువు నాలుగువైపులా ఇంకా 42 త్రికోణాలసమూహం ఉంటుంది దీని తదుపరి ఒకటి తరువాత ఇంకో నాలుగు చక్రాలు నిర్మితమై ఉంటాయి ఒక్కొక్క చక్రం ఒక్కొక్క పేరుతో పిలువబడుతుంది. ఒక్కొక్క చక్రంలోని ఒక్కొక్క త్రికోణంలో ఒక్కొక్క దేవత ప్రతిష్ఠితమై ఉంటుంది

43 వ త్రికోణసమూహం వెలుపల 'అష్టదళపద్మం' ఉంటుంది దీనిని 'అష్టదళచక్రం' అంటారు అష్టదళపద్మం వెలుపల మరో 16 రేకుల 'షోడశ కమలం" ఉంటుంది రెండు పద్మాలలోని ప్రతిదళంలో ఒక్కొక్క దేవత విరాజమానమై ఉంటుంది అష్టదళ, షోడశదళ చక్రాలకు అవల వైపున చతురస్రాకారపు "భూపురచక్రం" ఉంటుంది. దీనికి నాలుగుదిశలా నాలుగు ద్వారాలుంటాయి నాలుగు ద్వారాల వద్ద లేక కోణాలలో కూడా దేవీశక్తులు ఉంటాయి ప్రతి ప్రదేశంలో కనిపించే దేవీశక్తులే కాక ప్రతిచక్రంలో ఆ చక్రం యొక్క అధిష్ఠాత్రీదేవి ఉంటుంది

ఈవిధంగా ఒక బిందువు తోపాటు చిన్న పెద్ద తొమ్మిది ముఖ్య త్రికోణాలు. ఈ తొమ్మిది త్రికోణాలలలో యేర్పడే 43 త్రికోణాలు, రెండు కమలాలు, భూపుర చతురస్రం, మొత్తం తొమ్మిది చక్రాలతో అద్భుత 'శ్రీ యంత్రం' యేర్పడుతుంది. ఈ చక్రం అఖిల బ్రహ్మాండం యొక్క ఆకారంగా తయారవుతుంది. ఇంతేకాకుండా మానవశరీరంలో ఉండే తొమ్మిది 'యోగచక్రాల' తో కూడా దీనిని పోల్చవచ్చు ఈ యంత్రాన్ని ధ్యానించుటవల్ల (స్మరించుటం వల్ల) అండ, పిండ, బ్రహ్మాండం యొక్క భావన జాగృతమవుతుంది

దేవీ దేవతల నుద్దేశించి అనేక స్తోత్రాలు కవచాలు చెప్పబడి ఉన్నాయి. వీటన్నింటిలో చండీ స్తోత్రంలో పేర్కొన్న కవచం శ్రేష్ఠమైనదిగా భావింపబడుతోంది చండీకవచంలో శరీరం యొక్క బాహ్య, ఆంతరిక అంగాలకు రక్ష(ణ) గురించి వర్ణింపబడుటయే దీనికి కారణం శారీరకమైన అంగాలు ఉపాంగాలకు సంబంధించిన సూక్ష్మవివేచన మరే కవచంలోనూ లేదు ఉదాహరణకు నేత్రాలు, నాలుక, వాణి, తాలువు (అంగిలి), కంఠం, మెడ, కంఠం యొక్క బాహ్యాంగభాగము, కంఠనాళిక, శిఖ, జుట్టు, చర్మము, చర్మరంధ్రాలు, భుజాలు, చేతులు, అరచేతులు, చేతివ్రేళ్ళు, గోళ్ళు, రక్తము, మజ్జ

(ఎముకలలోని గుజ్జు), కొవ్వు, మాంసము, ఎముకలు, పురీషనాళము (పేగులు), పిత్తాశయము, కఫము, వీర్యము మొదలైన అంగ ప్రత్యంగాల సూక్ష్మవివేచన మనం చూడవచ్చు. కవచంలో శరీరంలోని కీళ్ళు, హృదయం, అహంకారం, మనస్సు, బుద్ధి, ఊపిరి (ప్రాణం), ఆయువు, ధర్మము, మొదలైనటువంటి వాటి గురించి, గోత్రము, స్త్రీ, పుత్ర, పుత్రిక, పశువులను గూర్చి ఇంకా మార్గమధ్యంలో, రాజసముఖంలో (రాజసభలో) భయం కలిగించే స్థావర, జంగమ, విషజంతువులనుండి, అకాలమృత్యువు నుండి రక్షణకోసం ప్రార్థింపబడింది. ఇంకా మహారోగాలు, ప్రమాదాలు, ప్రాణాంతకాలనుండి, వశీకరణ, యంత్రమంత్ర తంత్రాలనుండి రక్ష(ణ) అర్థింపబడింది. ఇంకా ఈ కవచంలో ముందుకు సాగి అంతరశరీరంలో ఉండే పాన, అపాన, వ్యాన, ఉదాన, సమాన, వాయు చక్రాలు, సత్త్వరజస్తమోగుణాలు, స్పర్శరూప రసగంధాలు, యశస్సు, కీర్తి (కీర్తి ప్రతిష్ఠలు), లక్ష్మి, ధనం, విద్య మొదలైనవాటికి సంబంధించిన రక్ష(ణ) సమకూర్చబడింది. తదనుగుణంగా వీటన్నింటిని ప్రస్తావించి ప్రార్థించటం జరిగింది.

ఈవిధంగా కవచంలో 'చండీకవచం' శ్రేష్ఠమైనట్లుగానే దేవీ దేవతాపరమైన యంత్రాలలో శ్రీదేవీయంత్రం సర్వశ్రేష్ఠమైనది. ఈ కారణంగానే శ్రీయంత్రాన్ని 'యంత్రరాజం'గా 'యంత్రశిరోమణి' గా పేర్కొనటం జరిగింది.

ఆవు నేతితో దీపారాధన చేసి అగరువత్తి వెలిగించి ఏదేని స్తోత్రాన్ని నిత్యం పారాయణం చేసినట్లయితే వాతావరణంలోని అణువులు, పరమాణువుల్లో కదలికలు పుడతాయి. అలా పుట్టి అవి ఒక విధమైన యంత్రంగా తయారవుతాయి. మన ప్రాచీన ఋషులు తమ దివ్యదృష్టితో సంశోధన చేసి అనేక స్తోత్రాలను, యంత్రాలను నిర్మాణం చేసారు. అవన్నీ నేటికీ అన్ని ప్రదేశాలలో పూజాదులలో ఉపయోగపడుతున్నాయి. శ్రీయంత్రం త్రికోణాల సంయోగం యేర్పరచిన షట్కోణయంత్రం. దీనిలోని పంచకోణాలు కామక్రోధలోభమోహ మాత్సర్యాలు ఐదింటినీ సూచిస్తాయి. కాబట్టి ఈ యంత్ర పూజవల్ల ఈ ఐదు అవగుణాలు అంతరించి మోక్షప్రాప్తి కూడా కలుగుతుంది.

## 11. శ్రీయంత్ర నిర్మాణం ఎప్పుడు ఎలా చేయాలి?

ఇప్పుడు శ్రీయంత్రాన్ని ఎలా నిర్మించాలి? ఎప్పుడు తయారుచేయాలి? అనే విషయాలు పరిశీలిద్దాం.

పుష్యమాసంలో సంక్రాంతి రోజుల్లో అష్టమీ రవివారం శ్రీయంత్రనిర్మాణం చేబడితే అత్యంత మంగళప్రదంగా ఉంటుంది. సాధారణంగా అలాంటి మహాభాగ్యం లభించటం

కష్టం కనక మాఘమాస సంక్రమణకాలంలో ఏదేని రవివారం యంత్రనిర్మాణానికి శుభప్రదంగా భావిస్తారు. ఇదేవిధంగా ఏదేని మాఘశుక్ల అష్టమీ రవివారంగాని, నవరాత్రుల్లో, ధనత్రయోదశి నుండి దీపావళి వరకూ, రవిపుష్యదినాల్లో ఈ యంత్ర నిర్మాణం ఒక వేదపండితుని ద్వారా చేపట్టాలి

ఉదయాన్నే బ్రాహ్మీముహూర్తంలో నిద్రలేచి స్నానాదికాలు ముగించుకొని ప్రశాంత ప్రదేశంలో పూర్వాభిముఖంగా (తూర్పు ముఖంగా) కూర్చుని ధూపదీపనైవేద్యాదులతో భూర్జపత్రంమీద తులసి, దానిమ్మ చెట్టునుండి తయారుచేసిన ఘంటంతో (కలంతో) లేదా నెమలి ఈకతోగాని రక్తచందనంతో శ్రీయంత్రనిర్మాణం చేపట్టాలి నీలంరంగు ప్రదేశం మీద కుంకుమపువ్వు రంగు వాడాలి అమావాస్య మంగళవారం అర్ధరాత్రి పూట ఈ యంత్రాన్ని నిర్మించాలి ఈ యంత్రవిశేషాలు విశేషంగా తెలిసిన వ్యక్తులతో తామ్రపత్రంమీద వ్రాయించినట్లయితే అత్యుత్తమ ఫలదాయకంగా ఉంటుంది

ఈవిధంగా మహాయంత్రం తయారుకాగానే దానికి ధూప, దీప, గంధాదులు సమర్పించి షోడశోపచారపూజ గావించి సత్పాత్రుడైన వైదిక బ్రాహ్మణుని ద్వారా యంత్రానికి ప్రాణప్రతిష్ఠచేయించాలి ఆ తరువాత పూజామందిరంలో పసుపురంగు వస్త్రాన్ని పరచి దానిమీద కుంకుమపువ్వు, రంగు లేదా పసుపురంగువేసిన పసుపు పచ్చని బియ్యంతో అష్టదళ పద్మం వేసి దానిమీద యంత్రాన్ని స్థాపించాలి.

అటు తరువాత ప్రతిరోజు సాధకుడు లేదా యజమాని నిత్యకృత్యాలు ముగించుకొన్న పిదప పంచోపచార పూజచేసి నియమానుసారంగా శ్రీసూక్తపారాయణం చేయాలి నిత్యపూజలు లేని పక్షంలో కనీసం అగరవత్తినైనా వెలిగించి యంత్రాన్ని దర్శించుకొని మూలబీజమంత్రాన్ని జపించాలి రాగి, వెండి, బంగారం వంటి రేకులమీద కూడా ఈ మహాయంత్రం చెక్కబడుతుంది స్పటికంమీద చెక్కిన శ్రీయంత్రాలు కూడా అరుదుగా మనకు కనిపిస్తాయి

శ్రీ యంత్రంలో ప్రథమ భూపురం చతురస్రాకృతిలో ఉంటుంది దీనికి నాలుగువైపులా నాలుగు ద్వారాలుంటాయి ఈ చక్రంలో ఉండే మూడు రేఖలు ఒకదాని తరువాత ఒకటి ఉన్న ప్రాకారాలను సూచిస్తాయి ఈ మూడు ప్రాకారాల నాలుగు మూలల్లో అణిమాది దశసిద్ధులు, బ్రహ్మీవంటి అష్టలోకమాతలు, ముద్రాశక్తులు విరాజమానులై ఉంటాయి ఈ చక్ర కేంద్రం తీర్థరాజమైన ప్రయాగలో ఉంది. దీని అధిష్ఠాత్రీమహాదేవిగా వింధ్యవాసినీదేవి ఉన్నది.

రెండవ షోడశదళ చక్రం దీని వెలుపల కనిపించే రెండురేఖలూ రెండు ప్రాకారాలను

సూచిస్తాయి. దీనిలో చంద్రుని షోడశకళా స్వరూపమైన కామాకర్షిణీ వంటి వీర్యశక్తులు విరాజమానమై ఉంటాయి. ఈ చక్ర అధిష్ఠాత్రీదేవి 'కామాక్షీదేవి'.

మూడవది అష్టదళ చక్రం. ఈ ప్రాకారాన్ని ఆగ్నేయఖండం అని పిలుస్తారు. దీనిలో అగ్నియొక్క అష్టకళా స్వరూపమైన అనేక కృత్యాశక్తులు ఉంటాయి ఈ చక్రము యొక్క అధిష్ఠాత్రీదేవి 'జ్వాలాముఖి'.

నాలుగవది చతుర్దశార చక్రం. అష్టదళ పద్మంలోపల నాలుగువైపులా 14 త్రికోణాల సమూహం ఈ చక్రాన్ని యేర్పరుస్తుంది ఇందులో పది ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములయొక్క స్వరూపమైన 14 శక్తులు ఉంటాయి. ఇవి ఇంద్రియ విషయరూపమైనవి దీనియొక్క అధిష్ఠాత్రీదేవి 'వైష్ణవీదేవి'.

ఐదవది అంతర్దశారచక్రం కూడా పది త్రికోణాలతో యేర్పడి ఉంటుంది. ఇది శ్రద్ధవిద్యాది నాలుగు తత్త్వాలు, జీవనభావం యొక్క మాయ, కాలం, రాగం మొదలైన ఆరు తత్త్వాలతో మొత్తం పది తత్త్వాలను స్పష్టంచేస్తుంది. ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, 10 శక్తులు సర్వజ్ఞ మొదలైనవి ఇందులో ఉంటాయి ఈ చక్రానికి అధిష్ఠాత్రీదేవి 'కామాక్షీదేవి'.

ఏడవ అష్టార చక్రం ఎనిమిది త్రికోణాలతో యేర్పడి ఉంటుంది. దీనిని 'నవయోని' చక్రమనికూడా పిలుస్తారు ఈ చక్రంలో స్వప్న వాసన, అగ్నిఖండాలు ప్రదర్శితమై ఉంటాయి. శ్రీకామ కామేశ్వరుల తేజస్సుతో అష్టఆయుధాలు ఉత్పన్నమయ్యాయి. వాటి ప్రతి ఆయుధముయొక్క అధిష్ఠాత్రీదేవికి ఒక్కొక్క త్రికోణంలో ఆసనాలు ఉంటాయి అవి వాసవీ మొదలైన మాతృదేవీ శక్తులకోసం ఉంటాయి. ఈ చక్ర అధిష్ఠాత్రీదేవి 'గుహ్యేశ్వరీదేవి'

ఎనిమిదవ యోనిచక్రం, దీనిని శక్తి చక్రం యొక్క త్రికోణచక్రం అనిపిస్తాయి. ఇది జీవన త్రికోణముయొక్క వాసనను ప్రదర్శిస్తుంది. దీనిలో వాసిని వంటి నాలుగు ఆయుధ శక్తులు, పరావాఙ్మహాశక్తియొక్క 3 భిన్నభిన్న స్వరూపాలకు చెందిన మహాశక్తులు ఉంటాయి ఇవి జ్యేష్ఠ, వామ, రౌద్రీ శక్తులు ఈ చక్ర అధిష్ఠాత్రీదేవి 'దుర్గాదేవి'.

తొమ్మిదవది బిందుచక్రం. దీనిలో అగ్నిచక్రాలకు పైన అధిష్ఠాత్రీ, మహాదేవి, పరావాక్కు, పరాశక్తి, మహాత్రిపురసుందరీదేవీ శక్తులు ఉంటాయి. ఈ శక్తులను సేవిస్తూ, విమల, అరుణ, జైనీశక్తులు ఉంటాయి.



# శ్రీయంత్రంలోని త్రికోణాల రహస్యాలు

## శ్రీ చక్రం - రేఖాగణిత సిద్ధాంతాల సారూప్యత

శ్రీచక్రం రేఖాగణితాన్ని ప్రమాణంగా చేసుకొని దేవీశక్తుల ప్రతీకరూప యంత్రంగా చేయబడింది త్రికోణం త్రికోణాత్మక శక్తి యొక్క ప్రధాన ప్రవాహం 43 త్రికోణాలతో నిర్మితమై ఉన్నత శిఖర సదృశంగా ఉండే "మేరు పృష్ఠ శ్రీయంత్రం" అలౌకికశక్తులను, అద్భుతాలతో, పరిపూర్ణమైన రహస్యమయ శక్తులను ప్రాదుర్భవింపజేసే కేంద్రబిందువుగా పేర్కొనబడింది రేఖాగణిత సిద్ధాంతాలు, త్రికోణమితి, జ్యోతిశ్శాస్త్రము, భూగోళానికి సంబంధించిన రహస్యవిజ్ఞాన విశేషాలన్నీ కేవలం భారతీయ మేధావులకేగాక ఈజిప్టు జ్యోతిషవిశారదులకు సైతం తెలుసునన్నవిషయం ఇక్కడ మనం గమనించాలి

త్రికోణమితికి చెందిన గణితశాస్త్ర అద్భుతాలకు ప్రత్యక్ష సాక్ష్యాలను మునుముందుగా ఈజిప్టు శాస్త్రజ్ఞులే కనుగొన్నారు త్రికోణాకృతిలో నిర్మించిన ఈజిప్టు పిరమిడ్లు ఈ రహస్యాలను బహుస్పష్టంగా ప్రమాణీకరించాయి క్రీ పూ 2500 సం॥లో నిర్మితమైన ఈ పిరమిడ్లు శిల్పకళలో సాటిలేని ప్రపంచ వింతల్లో ఒకటిగా ఎన్నబడుతున్నాయి. అయితే వాటిలో ఉండే అద్భుత రహస్యాలు మాత్రం ఇరవైయ్యోశతాబ్దంలోనే వెల్లడయ్యాయి ఒకసారి ఫ్రాన్సుకు చెందిన "బోబిస్" అనే శాస్త్రజ్ఞుడు పిరమిడ్లను చూడటానికి షికారు బయల్దేరాడు. తినుబండారాలుండే ఒక డబ్బా దగ్గర పిల్లి, ఎలుకల శవాలు కనిపించాయి అవి శవాలుగా ఉన్న వాటినుంచి ఎటువంటి దుర్గంధమూ వెలువడకపోవడం అతడికి అమితాశ్చర్యం కలిగించింది పైగా అవి జలరహితంగా నిర్జలంగా కనిపించాయి పిరమిడ్లలోని ఆంతరికశక్తి యొక్క పరిణామ స్వరూపమే ఆ శవాలను నిర్జలం చేయడంవల్లనే అవి మమ్మీలుగా మారాయని అతడు గ్రహించాడు. ఈజిప్టునుండి తిరిగివచ్చి బోబిస్ శాస్త్రజ్ఞుడు ఫ్రాన్సుదేశంలో "ఖుఫు" పిరమిడ్ నమూనా ఆధారంగా కఱ్ఱతో ఒక చిన్న పిరమిడ్‌ను నిర్మించాడు త్రికోణాకృతిలో ఉండే పిరమిడ్లు కర్బనపదార్థాలను నిర్జలం చేస్తాయనే విషయం అతని ప్రయోగం వల్ల నిర్ధారితమైంది.

బోబిస్ చేసిన ఈ ప్రయోగాలను చెకోస్లోవేకియాకు చెందిన ప్రముఖ ఇంజనీర్ "కోరల్" విశేషంగా ప్రోత్సహించారు. అనంతరం కోరల్, బోబిస్ ఇద్దరూ కలిసి పిరమిడ్ ఆకారంలో ఉండే ఒక టోపి నొకదానిని తయారుచేశారు ఈవిధమైన టోపీలు, సర్కస్‌లో కనిపించే జోకర్లు తరచు ధరించటం మనం చూస్తుంటాం ఈ టోపీని ధరించినట్లయితే

శిరోవేదన తొలగిపోతుంది అంటే తలనొప్పి తగ్గిపోతుందన్నమాట ఇంకా ఈవిధమైన టోపీలు ధరించటం వల్ల పలువిధాలయిన మానసిక వికారాలు, రుగ్మతలు దూరమవుతాయని బోబిస్ ప్రయోగాల ద్వారా వెల్లడయినది అనేక మానసిక చికిత్సాలయాలలో బోబిస్ తయారుచేసిన టోపీలను నేటికీ వాడుతున్నారు. అంతేకాకుండా తద్వారా వెలికి వచ్చిన ఆశ్చర్యజనకమైన ప్రయోజనాలన్నింటికి సంబంధించిన సంఖ్యాపట్టికలను (Statistics) వివరాలను కూడా తయారుచేస్తున్నారు

పిరమిడ్లలో ఉండే ఈ శక్తిని గమనించి అమెరికా, ఆస్ట్రేలియాలోని ప్రజలు మిక్కిలి ప్రభావితులై వారు ఆధునిక వైద్యాలయాలను, భవనాలను త్రికోణాకృతికి మార్చి నిర్మింపసాగారు ఇంకా చెప్పాలంటే యుగోస్లావియాకు చెందిన ఉత్పత్తిదారులు పాలు, పెరుగు దబ్బాలను పిరమిడ్ ఆకారంలో తయారుచేయడం మొదలుపెట్టారు. పిరమిడ్ ఆకృతిలో నిర్మితమైన పాత్రలలో ఉంచిన పాలు, పెరుగు వగైరా పదార్థాలు తొందరగా చెడిపోకుండా ఉండటం వారు గమనించారు రష్యాకు చెందిన శాస్త్రవేత్తలు మరింత ముందడుగువేసి పిరమిడ్లపైన, త్రికోణాకృతిలో ఉండే వస్తువులపైన పరిశోధనలు జరిపారు పిరమిడ్ ఆకారంలో ఉండే పాత్రలలో ఉంచిన నీటిని పిల్లలచేత త్రాగిస్తే వారికి 'టాన్సిల్స్' సత్వరం నయమవటాన్ని రష్యాశాస్త్రవేత్తులు కనుగొన్నారు. ఇంకా ఈ పాత్రలలోని జలంతో కళ్ళను శుభ్రం చేసుకుంటే నేత్రశక్తి (కంటిచూపు) పెరగడమే కాకుండా జ్ఞాపకశక్తి కూడా వృద్ధిపొందుతుందని వెల్లడించారు

ఇప్పుడు పిరమిడ్లకు ఇంత శక్తి ఎలా వచ్చిందో గమనిద్దాం. గణితశాస్త్రజ్ఞులు, ఖగోళ శాస్త్రజ్ఞులు, పిరమిడ్లలోని ప్రతి ఏటవాలుకోణం $51^0$ $51'$ ఉన్నట్లుగా తేల్చిచెప్పారు. దీనికి ప్రతిగోడ పాదవు వెడల్పుల విస్తీర్ణంతో వాటి లంబకోణపు ఎత్తుతో సరిసమానంగా ఉంటుంది పిరమిడ్ల పతనకోణము $26^0$ $17'$ ఉంటుంది. ఇది తెలిపే ధ్రువతార నిలుపుభాగంపైన ఉంచారు పిరమిడ్ మట్టము భూగోళము యొక్క పరిధిని సూచిస్తుంది దీనిని ఎత్తు భూమియొక్క ధ్రువీయ అర్ధవ్యాసాన్ని తలపింపజేస్తుంది. వీటి పాదవు వెడల్పుల విస్తీర్ణము భూగోళం యొక్క ఉత్తరార్ధగోళాన్ని సూచిస్తుంది. పిరమిడ్లలో నిహితమైన, శక్తిమంతమైన చుంబకీయ ప్రవాహము పృథ్వి యొక్క చుంబకీయ శక్తి కంటే అత్యధిక శక్తివంతమైనది.

జ్యోతిశ్శాస్త్రపరంగా చూసినట్లయితే కుండలీదర్శనం యొక్క అంతర్గత కేంద్రం (Quadrants) కంటే కూడా త్రికోణం యొక్క శక్తి అధికతమమైనదిగా పేర్కొనబడినది పరాశర మహర్షి "సర్వే త్రికోణ నేతారగ్రహాః శుభఫలప్రదాః" అన్నాడు. అనగా త్రికోణం

(Train Aspect) లోనికి వచ్చాకనే అన్ని గ్రహాలు శుభఫలప్రదమైనవిగా అవుతాయి

పైన పేర్కొన్న విశేషాలన్నీ "సుమేరు పృష్ఠ శ్రీయంత్రంలో ప్రతిబింబితమై ఉన్నాయి దీనిలో యావత్సృష్టి వికాసము విలయము వరుసగా వివరింపబడింది మానవదేహ పరిమాణము 96 అంగుళాల ప్రమాణంలో ఉంటుంది అందుచేతనే శ్రీ చక్ర పరిమాణం కూడా 96 యూనిట్లు ఉంచబడింది మధ్య (కేంద్ర) బిందువు బీజ శక్త్యాత్మకమై ఉంటుంది ప్రధమ కేంద్రీయ త్రికోణంలో సర్వసిద్ధిప్రదమైన మంగళప్రద స్థానంగా భావించబడింది అష్టకోణాలు, అష్టవసుస్థానంగా చెప్పబడింది. అంతర్బహిర త్రికోణాలు, అనగా దశ త్రికోణాలు దశ ప్రాణాలను సూచిస్తాయి షోడశదళ పద్మం చంద్రుని 16 విశుద్ధకళలకు అష్టదళ పద్మంమీద 16 కళలకు ప్రతీకగా దర్శింపబడి ఉంటుంది వీటికి వెలుపల ఉన్న మూడు భూప్రదరేఖలూ త్రిలోకాలను వశీభూతం చేసుకొనే సాధనగా, వాటికి ఉన్న నాలుగు ద్వారాలు నలువైపులా బుద్ధి, సిద్ధులకు ప్రవేశానికి ఉపకరణాలుగా ఉంటాయి ఈ శ్రీ యంత్రం ఆకాశంలో పయనించే సమృద్ధిశాలీన కిరణాలకు చెందిన ఐశ్వర్యప్రదాయకమైన +ve ధనాత్మక ఎలక్ట్రానులను తనవైపుకు ఆకర్షింపజేసుకుని వాటిని తిరిగి వక్రీభవింపజేసి (Reflect) ఉపాసకుని ముఖమండలాన్ని ఉపాసనాస్థలాన్ని ఆశ్చర్యజనకంగా ప్రభావితం చేస్తుంది

## 2. శ్రీవిద్య - ఆదిశంకరులు

శ్రీవిద్యోపాసనా పద్ధతి, తంత్రాలమీద ఆధారభూతమైన పద్ధతి. త్రిపురోపనిషత్తులో "కాది – హాది" విద్యలపేరుతో స్పష్టంగా పేర్కొనబడింది. శ్రీవిద్యోపాసన యొక్క ప్రచారం మద్రాసు ప్రాంతంలో విశేషంగా ఉంటుంది శ్రీమచ్ఛంకర భాగవత్పాదుల లేఖిని నుండి వెలువడిని 'సౌందర్యలహరి' 'ప్రపంచం సారం" అనే రెండు గ్రంధాలు శ్రీవిద్యకు సంబంధించిన సత్త్వగుణ విషయకమైన సర్వోత్తమ ప్రమాణ గ్రంధాలు శ్రీ శంకరులకు శ్రీవిద్యాదీక్ష యోగీశ్వరులైన గోవిందపాదాచార్యులనుండి లభించింది. శ్రీ గోవిందా చార్యులకు ఈ విద్యాదీక్ష శ్రీ గౌడపాదాచార్యుల గురువు సాక్షాత్తు దత్తాత్రేయ భగవానుడే స్వయంగా ప్రసాదించాడు.

ఈవిధంగా ఈ విద్య అతిప్రాచీన కాలంనుండి ప్రాచుర్యంలో ఉంది. ఆదిశంకరుల గురించి ప్రసిద్ధమైన కథ ఒకటి ఉంది. గురుకుల నియమానుసారం ఆచార్యశంకరులు ఒకరోజున బిక్షాటన కోసం ఒక సద్బ్రాహ్మణ గృహస్థు గుమ్మం ముందు నిలబడ్డారు. ఆ గృహస్థు పరమ దారిద్ర్యాన్ని అనుభవిస్తూండడం చేత భిక్ష వేయటానికి పిడికెడు బియ్యం కూడా లేని స్థితిలో ఉన్నాడు. తుదకు ఎలాగయితేనేం ఆ గృహస్థుని భార్య ఒక ఉసిరికాయ

శంకరుని దోసిటలో ఉంచి అసహాయతకు రోదిస్తూ తన దీనావస్థను శంకరులకు విన్నవించుకుంది అమె దుర్భర దారిద్ర్యాన్ని చూచి శంకరుల కోమల హృదయం ఆర్ద్రమైంది ఆయన అక్కడే నిలిచి దయార్ద్రచిత్తంతో శ్రీవిద్యా అధిష్ఠాత్రీదేవి, ఆదిశక్తి అయిన మహాలక్ష్మిని స్తుతించటం ప్రారంభించారు కోమలమైన కరుణాపూరితమైన శ్లోకాలకు వశీభూతమై, భగవతి మహాలక్ష్మి చూస్తుండగా అక్కడ ప్రత్యక్షమైంది త్రిభువన మోహనరూపంలో ఆచార్యుల ముందట నిలచి మధురవాక్కులతో – "వత్సా! నీ అభిప్రాయాన్ని తెలుసుకొన్నాను కాని ఈ నిరుపేద కుటుంబం గత జన్మలో ధనాన్ని ప్రసాదించటానికి అనువుగా ఎట్టి పుణ్యకార్యమూ చెయ్యలేదు పూర్వజన్మ సుకృతం లేని కారణంగా ఈ కుటుంబానికి ధనాన్ని ప్రసాదించలేను" – అని పలికింది

ఆచార్యులు కడు వినయపూరిత వచనాలతో కరుణామయి అయిన ఆ మాతను – "ఈ పేదబ్రాహ్మణుడు గత జన్మలో ఎట్టి సుకృతాన్ని నిర్వర్తించలేదు! తత్ఫలితంగా ధనసంపత్తిని పొందలేకపోయాడు! సరే! నాలాంటి భిక్షకునికి స్వల్పమైన ఆమలకాన్ని (ఉసిరికాయను) దానంచేసి అపారమైన పుణ్యరాశిని సంపాదించాడుగదా! ఆ కారణంగా నైనా సాటిలేని మేటిసంపదకు ఇతడు అర్హుడయ్యాడని పలికి, మాతా! భగవతీ నీవు నాయెడల ప్రసన్నురాలవైన పక్షంలో ఈ కుటుంబాన్ని దారిద్ర్యం నుండి విముక్తుడ్ని చెయ్యి" – అని ప్రార్థించారు

యుక్తియుక్తమైన శంకరుని వాక్కులను భగవతి తృణీకరించలేకపోయింది తక్షణమే ప్రసన్నురాలై వత్సా! తథాస్తు! వీరికి అనేక సువర్ణామలకాలను (బంగారు ఉసిరికాయలను) ప్రసాదిస్తాను అని బదులు పలికింది ఈ మాటలు ఆలకించి శంకరులు ఆనంద సంభూతుడై బ్రాహ్మణుని భార్యను శీఘ్రమే ధనప్రాప్తిరస్తు అని ఆశీర్వదించి గురుగృహానికి తిరిగివెళ్ళారు. మరుసటి రోజు ప్రాతః కాలానికి బ్రాహ్మణ గృహస్థు ఇల్లంతా చెల్లాచెదురుగా సువర్ణామలకాలు దర్శనమిచ్చాయి ఈ ఘట్టానికి సంబంధించిన సంపూర్ణ వర్ణన 'శంకరవిజయం' చతుర్థస్సర్గలో ఉన్నది. ఈ విధంగా భగవతి శ్రీలక్ష్మీదేవి కృప శ్రీవిద్యోపాసకుల మీదనే గాక శ్రీవిద్యోపాసకులకు ప్రసన్నులైన వారియెడల కూడా ఆ దేవీ కృప తక్షణమే సిద్ధిస్తుందని నిస్సంశయంగా గమనించవచ్చు. శ్రీవిద్యోపాసనకు హేతుభూతమైన శ్రీయంత్ర నిర్మాణాన్ని తప్పక అధ్యయనం చెయ్యాలి. శ్రీయంత్రానికి అర్తితో, భక్తితో పూజాదులు నిర్వర్తించి అనేకమంది సకల సంపదలను పొందినట్లు మనకెన్నో ప్రత్యక్షనిదర్శనాలున్నాయి!

# 3. శ్రీ యంత్రనిర్మాణం

కౌలాచారం, సమయాచారం, సంప్రదాయం ఆచార్యభేదాలను బట్టి శ్రీయంత్రలేఖన విధానాలు అనేక విధాలుగా ఆగమశాస్త్రాల్లోను సాధకులవద్ద మనకు లభిస్తాయి శ్రీయంత్రం బిందు, త్రికోణ, అష్టార, అంతర్దశార, బహిర్దశాం, చతుర్దశార, అష్టదళపద్మ, షోడశదళపద్మ , చతురస్రం అనే తొమ్మిది చక్రాలతో నిర్మితమవుతుంది

చతుర్భిః శ్రీ కంఠైః శివయువతిభిః పంచాభి రపి ।
ప్రభిన్నాభిః శంభోర్నవభి రపి మూల ప్రకృతిభిః ।
చతుశ్చత్వారింశద్వసుదళ కళాశ్ర త్రివలయ ।
త్రిరేఖాభిః సార్ధం తవ శరణ కోణాః పరిణతాః ॥

(సౌందర్యలహరి -11)

కొందరు ఆచార్యులు షోడశదళ పద్మం తరువాత వృత్తత్రయాన్ని కూడా వేరే చక్రంగా గుర్తిస్తారు.

బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్రనాద దళ షోడశ పత్రయుక్తమ్ ।
వృత్తత్రయం చ ధరణీ సదన త్రయం చ
శ్రీచక్రరాజ ముదితమ్ పరదేవతాయా : ॥

వారి అభిప్రాయంలో బిందువు సర్వవ్యాపక చక్రం అందువలన దానిని వారు నవచక్రాలలో ఒకటిగా పరిగణించరు. చాలామంది ఆచార్యులు, ఆధునిక సాధకులు చతుర్దశార చక్రం తరువాత ఒక సరిహద్దు వృత్తం (మర్యాద వృత్తం) అష్టదళకర్ణికకు ఒక వృత్తం, అష్టదళపద్మం తరువాత కూడా షోడశదళకర్ణిక తదనంతరం మరో మర్యాద వృత్తం ఈవిధంగా వృత్తత్రయాన్ని నిర్మిస్తారు. కొందరు మర్యాద వృత్తాన్ని పరిత్యజించి కేవలం కర్ణికావృత్తాన్నే గీస్తారు (ఇస్తారు). షోడశదళ పద్మం తరువాతనే వేరే వృత్తత్రయాన్ని ఇస్తారు. మరికొందరు ఉపాసకులైతే వృత్తాలనే సూచించారు. ఇదేవిధంగా భిన్నాభిప్రాయాలు చతురస్రవిషయంలో కూడా గమనించవచ్చు కొందరు ఏకరేఖాత్మకమైన చతుర్ద్వార యుక్తమైనదానినే చతురస్రంగా భావిస్తారు. మరికొందరు ఆయా దిశలలో విభిన్న సంఖ్యలలో ద్విద్వారయుక్తమైన చతురస్రాన్ని లిఖిస్తారు. ఎక్కువమంది త్రిరేఖాత్మకమై చతుర్ద్వారయుక్తమైన చతురస్రాన్ని నిర్మిస్తారు. ఏమైనప్పటికి బిందువునుండి చతుర్దశార చక్రంవరకూ ఉన్న శ్రీయంత్రాన్ని ప్రధాన యంత్రంగా భావిస్తారు. ఎందుచేతనంటే యదార్థ శ్రీయంత్రం శివశక్తుల యొక్క సంపుటి స్వరూపం.

చతుర్భిః శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ।
నవచక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపు ॥

చతుర్దశారం వరకూ నవచక్రాల యొక్క అంతర్భావము వీటిలో త్రికోణం, అష్టకోణం, అంతర్దశారం, బహిర్దశారం చతురస్రం - ఈ ఐదు శక్తి చక్రాలు.

త్రికోణ మష్టకోణశ్చ దశకోణద్వయం తథా ।
చతుర్దశార శ్చైతాని శక్తి చక్రాణి పంచ చ ॥

మిగిలిన బిందువు, అష్టదళం, షోడశదళం, చతురస్రం ఈ నాలుగు శివచక్రాలు పైన పేర్కొన్న ఐదు శక్తి చక్రాలలో అంతర్భూతమై ఉంటాయి

బిందు శ్చాష్టదలం పద్మం పద్మం షోడశ పత్రకమ్ ।
చతురస్రంచ చత్వారి శివ చక్రాణ్యను క్రమాత్ ॥

అనగా త్రికోణంలో బిందువు, అష్టారంలో అష్టదళం రెండు దశారాల్లో షోడశార చక్రం, చతుర్దశారంలో చతురస్రం ఒదిగి (దాగి) ఉంటాయి.

త్రికోణ చెందవం శిష్టమష్టారేఽష్ట దలాంబుజమ్ ।
దశారమోః షోడశారం భూగృహ భువనాస్త్రకే ॥

ఈవిధంగా దీనిలో శివశక్తుల యొక్క పారంపరిక అవినాభావ స్వరూపం మిళితమై (సమ్మిశ్రితమై) ఉంటుంది.

శైవానా మపి శాక్తా వంచ క్రాణాంచ పరస్పరమ్ ।
అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్ ॥

ఈ శివాశక్తుల అవినాభావ సంబంధాన్ని ఎరిగినవానినే 'చక్రజ్ఞ' అంటారు. భైరవయామళంలో కూడా "న శివేన వినా శక్తిః శివోఽపి న తయా వినా" అని పేర్కొనబడింది.

దీనినిబట్టి శివశక్తులు (శివుడు, శక్తి) రెండూ విడిగా వుండటం సాధ్యంకాదని తెలుస్తోంది. కాబట్టి శివచక్రాలను చతుర్దశారం వెలుపల లిఖించటం కేవలం శిష్యులకు సుబోధకం చెయ్యడం కోసమే అందువలననే చతుర్దశారం వరకూ ప్రధానయంత్రసీమగా భావించటం సర్వసమ్మత సిద్ధాంతం. ఇప్పుడు మనం వామకేశ్వర తంత్రం ఆధారంగా ప్రచలితమైన లేఖనావిధానాన్ని వివరించటానికి వీలుగా, తొట్టతొలుతగా తదుప యోగకరమైన 'పరిభాష'ను పరికిద్దాం!




**దిశ :** "యదాశాభిముఖో మన్త్రీ" - దీనిని బట్టి సాధకుడు ఏది శాఖాభిముఖుడై యంత్రాన్ని లిఖిస్తాడో ఆ దిశను పూర్వదిక్కుగా అంటే తూర్పుగా గ్రహించాలి. మిగిలిన దిశల కల్పన కూడా దాని ఆధారంగా చేసుకోవాలి.

**శక్తి :** ఈశాన్యం నుండి ఆగ్నేయంవైపుకు ఒక సరళరేఖను గీసి దాని రెందుచివరల ఉండే కోణాలనుండీ రెండు రేఖలను పశ్చిమదిశలో కలిసేలా ఒక త్రికోణాన్ని నిర్మించాలి. ఈ త్రికోణం అధోముఖంగా యేర్పదుతుంది. దీనిని "శక్తిత్రికోణం" అంటారు. దీనిని "శక్తి " అని "పార్వతి" అని 'యోని' అని అనేక శబ్దాలతో వ్యక్తం చేస్తారు.



**శివ :** వాయవ్యంనుండి నైఋతివైపుకు ఒక సరళరేఖను గీసి దాని రెంటి చివరల ఉండే రెండు కోణాలనుండి రెండు రేఖలను ఊర్ధ్వముఖంగా తూర్పువైపున కలిసేలా త్రిభుజాన్ని గీసినట్లయితే ఊర్ధ్వముఖ త్రికోణం యేర్పడుతుంది ఈ ఊర్ధ్వముఖ త్రికోణాన్ని 'శివుడు' అని మహేశ్వరుడని, 'అగ్ని' అనే పదాలతో పిలుస్తారు




ఈవిధంగా శక్తికి సంబంధించి మూడు కోణాలు ఈశాన్యంలో, ఆగ్నేయంలో, పడమరలోను – శివుని మూడుకోణాలు వాయవ్యం, నైఋతి పూర్వకోణాలుగా విఖ్యాతమై ఉంటాయి.

**పార్శ్వరేఖలు :** త్రికోణంలో కుడి, ఎడమల ఉండే రేఖలను పార్శ్వరేఖలు అని పిలుస్తారు. కొన్నిచోట్ల వీటిని ఊర్ధ్వరేఖలని, అధోరేఖలని కూడా పిలుస్తారు.

**తిర్యక్‌రేఖలు :** ఈశాన్యం నుండి ఆగ్నేయం వరకూ అలాగే వాయవ్యం నుండి నైఋతి వరకూ గీయబడిన రేఖలను 'తిర్యక్‌రేఖలు' అంటారు. వీటిని 'తూర్పురేఖలు' అని, 'పశ్చిమరేఖలు' అని కూడా అంటారు.

**ఛేదనరేఖలు :** (ఖండనరేఖలు) ఒక రేఖ మీదుగా మరోరేఖ గీయబడినట్లయితే వాటి 'ఛేదనరేఖలు' లేదా 'ఖండనరేఖలు' అంటారు.

**సంధి :** రెండు రేఖలూ ఖండించుకొంటూ కలుసుకొనే సంయోగ బిందువులను 'సంధి' అంటారు.

**మర్మబిందువు :** మూడురేఖలూ ఒకే బిందువు దగ్గర ఖండించుకొన్నట్లయితే ఆ మూడు రేఖల సంయోగ బిందువును 'మర్మబిందువు' అంటారు.

**డమరుకము :** శక్తి యొక్క పశ్చిమకోణం మరియు అగ్ని యొక్క తూర్పుకోణం ఈ రెండింటి కలయికవల్ల 'డమరువు' యేర్పడుతుంది (డమరుకము)

**వృత్తం :** చంద్రాకారంలో గుండ్రంగా ఉండే రేఖను వృత్తం అంటారు.

**పరివేషం :** చతురస్రంగా ఉండే రేఖను 'పరివేష'మని అంటారు

**భూపురం :** త్రిరేఖాత్మకమైన వృత్తాన్ని భూపురం అని అంటారు

పైన పేర్కొన్న 'పరిభాష' లో శ్రీయంత్ర నిర్మాణాన్ని ప్రారంభిద్దాం. మొదటిగా ఒక శక్తి త్రికోణాన్ని నిర్మించి దాని మధ్యభాగంలో ఉత్తరం నుండి దక్షిణానికి ఆ త్రికోణ పార్శ్వ భుజాలను ఖండిస్తూ ఒక తిర్యక్ రేఖను గీయాలి ఈ తిర్యక్‌రేఖ రెండు శీర్షాల నుండి రెండు పార్శ్వ రేఖలను గీసి ప్రథమ శక్తిత్రికోణం పశ్చిమదిశన ఆ రెండు రేఖలు కలుసుకొనేలా మరొక త్రికోణాన్ని నిర్మించాలి




ఇప్పుడు ద్వితీయ శక్తిత్రికోణం యేర్పడింది. ఈ క్రమంలో బిందు లేఖనం చేయకపోయినప్పటికి పూజాక్రమాన్ని అనుసరించి ప్రథమ శక్తిత్రికోణం 'ఛేదనం' (ఖండించటంవల్ల)వల్ల యేర్పడే త్రికోణం మధ్యలో 'బిందువు' ను ఉంచాలి. తదనంతరం ప్రథమ శక్తిత్రికోణం యొక్క తిర్యక్‌రేఖ మధ్యభాగంనుండి కొంచెం ఊర్ధ్వముఖంగా తూర్పుదిశగా రెండు భాగాలలో సంధి, మర్మాలను యేర్పరుస్తూ రెండు పార్శ్వరేఖలను

గీయాలి. ఈవిధంగా ప్రధమ శక్తి త్రికోణం పశ్చిమకోణాన్ని పశ్చిమంవైపు స్పృశిస్తూ వాయవ్యం నుండి నైఋతి వైపుగా ఒక తిర్యక్‌రేఖనుగీసి దాని పార్శ్వరేఖలను పొడిగించి వాటి రెండు శీర్షాలలో జతచేయాలి అప్పుడు ఒక ఊర్ధ్వముఖ త్రికోణం యేర్పడుతుంది. ఇది ప్రధమ వహ్ని కోణంగా తయారవుతుంది




ఈవిధంగా ఎనిమిది దిక్కులా ఎనిమిది త్రికోణ సముదాయంతో 'అష్టారం' యేర్పడుతుంది. మధ్యలో మరొక త్రికోణం. దాని మధ్యలో బిందువు ఉండటంవల్ల బిందుకోణంతో అష్టార త్రియంత్రం తయారవుతుంది ఈవిధంగా మూడు యంత్రాలతో తయారైన ఈ చక్రాన్ని 'నవయోని చక్రం" అనే పేరుతో పిలుస్తారు

ఇందులో తొమ్మిది త్రికోణాలు, ఆరు సంధులు, రెండు మర్మాలు, రెండు దమరుకాలు ఉంటాయి.

ప్రధమ శక్తి త్రికోణం యొక్క కుడియెడమల పార్శ్వరేఖలు వహ్నికోణం పార్శ్వరేఖలతో రెండుదిక్కులూ కలియటంవల్లను ద్వితీయ శక్తి త్రికోణం తిర్యక్‌రేఖ ద్వారా ఖండితమవటం (ఛేదనం) వల్ల ఉత్తర దక్షిణాలలో మర్మాలు యేర్పడ్డాయి. అలాగే ద్వితీయ శక్తికోణం పార్శ్వరేఖలను ఊర్ధ్వత్రికోణం (వహ్నికోణం) పార్శ్వతిర్యక్ రేఖలు ఖండించటంవల్ల సంధులు, దమరుకాలు యేర్పడటం గమనించవచ్చు.

ఇప్పుడు అంతర్దశార చక్ర నిర్మాణాన్ని పరిశీలిద్దాం. పైన పేర్కొన 'నవయోన్యాత్మక చక్రం' లోని ప్రధమ శక్తిత్రికోణం యొక్క తిర్యక్‌రేఖను ఇరువైపులా పొడిగించి, ఆ పొడిగించిన శీర్షాలనుండి ఇరువైపులా రెండు పార్శ్వరేఖలను ద్వితీయ శక్తిత్రికోణం

పశ్చిమ కోణానికి కొంచెం పశ్చిమంగా కలపాలి ఇలా కలపటంవల్ల తృతీయ శక్తికోణం యేర్పడుతుంది ఈ తృతీయ త్రికోణంలోపలి భాగంలో (పూర్వ త్రికోణాన్ని మినహాయించి) పరిపూర్ణయంత్రరూపంగా యేర్పడుతుంది ఈ చిత్రాన్ని గమనించండి.




ఇప్పుడు ప్రథమ వహ్నికోణం యొక్క తిర్యక్‌రేఖను ఇరువైపులా పొడిగించి – పొడిగించిన రేఖల శీర్షాలనుండి ఊర్ధ్వముఖంగా రెండు పార్శ్వరేఖలను గీసి ప్రథమ వహ్ని కోణం యొక్క పూర్వకోణానికి కొంచెం పూర్వ (తూర్పు) దిశగా ఆ రెండు రేఖల్ని కలపాలి. అలా కలపటంవల్ల ద్వితీయ 'వహ్నిత్రికోణం' యేర్పడుతుంది




ఈ చక్రంలో ఆరు చక్రాలు అదనంగా పెరిగాయి. తృతీయ శక్తిత్రికోణం, ద్వితీయ వహ్నికోణము రెండూ కలియటంవల్ల ఇరుపార్శ్వాలలో రెండు 'డమరుకాలు' యేర్పడ్డాయి. అలాగే సంధి, మర్మాలు యేర్పడటం కూడా మనం గ్రహించవచ్చు తరువాత మరల ప్రథమ శక్తికోణం పార్శ్వరేఖలను క్రమంగా ఈశాన్య, ఆగ్నేయ మూలాల్లో ఊర్ధ్వముఖంగా

ప్రథమ వహ్నికోణం తూర్పుకోణం వరకూ పొడిగించి ప్రథమవహ్నికోణం తూర్పుకోణాన్ని స్పృశించేలాగా ఆరెండు పార్శ్వరేఖల్ని కలుపుతూ ఒక తిర్యక్‌రేఖను నిర్మించాలి ఇదేవిధంగా ప్రథమ వహ్నిత్రికోణం యొక్క రెండు పార్శ్వరేఖల్ని అధోముఖంగా వాయువ్య నైఋతి కోణాలవైపుకు పొడిగించి ద్వితీయ శక్తికోణం పశ్చిమకోణాన్ని స్పృశించేలాగా ఆ రెండు (పొడిగించిన) పార్శ్వరేఖల్ని కలపాలి ఈవిధంగా మరో నాలుగు కోణాలు పెరగటం వల్ల అంతర్దశార చక్రం యేర్పడుతుంది.




## అంతర్దశార చక్రం

ఇప్పుడు బహిర్దశార చక్ర నిర్మాణం పరిశీలిద్దాం. ప్రథమ, ద్వితీయ వహ్నికోణాల్లో మధ్యన ఉండే ఆద్య శక్తికోణం (ప్రథమశక్తి త్రికోణం యొక్క తూర్పున ఉండే) తిర్యక్‌రేఖ రెండుకోణాలను అంతర్దశారం యొక్క ద్వితీయ దశమకోణాలవైపు క్రమంగా ఈశాన్య ఆగ్నేయదిశల్లో పొడిగించి ఈశాన్య, ఆగ్నేయ కోణాలు యేర్పరుస్తూ రెండు పార్శ్వరేఖలను అధోముఖంగా గీసి తృతీయశక్తికోణం పశ్చిమకోణం నుండి కొంచెం పశ్చిమం వైపు వరకు పొడిగించి వాటిరెండింటిని కలపాలి. అలా కలిపిన రేఖల ద్వారా చతుర్థశక్తికోణం యేర్పడి బహిర్దశారాన్ని నిర్మిస్తుంది.




అంతర్దశార చక్రం

తదనంతరం ప్రధమవహ్నికోణంయొక్క పశ్చిమరేఖలయొక్క (పార్శ్వరేఖలు) రెండు కోణాలను (అనగా అంతర్దశారంయొక్క ఐదవ, ఏడవ కోణాలు) ఉత్తర దక్షిణదిశలవైపు పొడిగించి ఉత్తర దక్షిణకోణాలు యేర్పరుస్తూ వాటి శీర్షాలనుండి పార్శ్వరేఖలను చతుర్థ శక్తికోణం యొక్క రెండు పార్శ్వరేఖలను ఖండించేలాగా ద్వితీయ వహ్నికోణం యొక్క తూర్పుకోణం తూర్పుదిశగా పొడిగించి రెండింటిని జతచేయాలి. ఇప్పుడు తృతీయ వహ్నికోణం యేర్పడి బహిర్దశారాన్ని నిర్మిస్తుంది ఈవిధంగా అంతర్దశారం వెలుపల అష్టకోణాలు యేర్పడతాయి.

తదనంతరం ప్రధమశక్తికోణం కుడియెడమ రేఖలను ఈశాన్య, ఆగ్నేయ, కోణాలవైపు ద్వితీయ వహ్నికోణం తూర్పుదిశకోణంతో సమానంగా పొడిగించి వాటి శీర్షాలను ద్వితీయ వహ్నికోణం పూర్వకోణాన్ని (శీర్షాన్ని) స్పృశించేలాగా ఒక తిర్యక్‌రేఖతో జతచెయ్యాలి (కలపాలి). అలాగే ఆద్యవహ్నికోణం యొక్క రెండు పార్శ్వరేఖలను క్రమంగా వాయవ్య నైఋతి కోణాలవైపు అధోముఖంగా తృతీయ శక్తికోణం పశ్చిమదిశగా పొడిగించి తృతీయశక్తికోణం పశ్చిమకోణాన్ని స్పృశించేలా తిర్యక్‌రేఖతో వాటిని కలపాలి ఈవిధంగా బహిర్దశారం యేర్పడుతుంది.



చతుర్దశార చక్రం

ఇప్పుడు చతుర్దశార చక్ర నిర్మాణాన్ని పరిశీలిద్దాం.

చతుర్థ శక్తికోణం పూర్వ (తూర్పు) దిశలో ఉన్న తిర్యక్‌రేఖను (అనగా బహిర్దశారం 3,9 కోణాలను) క్రమంగా ఉత్తర దక్షిణాలకు పొడిగించి - పొడిగించిన రేఖ యొక్క రెండు శీర్షాలను రెండు (పార్శ్వరేఖలుగా అధోముఖంగా పొడిగించి చతుర్థశక్తి) పశ్చిమకోణానికి పశ్చిమంగా జతచేయాలి ఇప్పుడు చతుర్దశార చక్రాన్ని ఏర్పరచే 'పంచమ శక్తికోణం' యేర్పడుతుంది

ఇదేవిధంగా తృతీయవహ్నికోణం పశ్చిమదిశలో ఉండే తిర్యక్‌రేఖ యొక్క రెండు కోణాలను (అనగా బహిర్దశారం యొక్క 4,8 కోణాలు) క్రమంగా వాయవ్య నైఋతి దిశలకు పొడిగించి-పొడవైన ఆ తిర్యక్‌రేఖ రెండు అగ్రకోణాలనుండి రెండు పార్శ్వరేఖలను పంచమశక్తి కోణం పార్శ్వరేఖలను ఖండించేట్లుగా తృతీయ వహ్నికోణం యొక్క తూర్పు దిశాకోణం వరకు కొనసాగించి ఒక త్రికోణాన్ని యేర్పరచాలి ఇప్పుడు చతుర్థ 'వహ్నికోణం' ఏర్పడుతుంది. ఈవిధంగా పంచమ శక్తికోణం, చతుర్థి వహ్నికోణాల సంయోగంవల్ల చతుర్ధశారాన్ని యేర్పరచే షష్టకోణం యేర్పడుతుంది తదనంతరం చతుర్ధశక్తికోణం పార్శ్వరేఖలను క్రమంగా ఈశాన్య, ఆగ్నేయ దిశలవైపు పొడిగించాలి

ఇదేవిధంగా ఆద్యశక్తి కోణం, పూర్వాదిశారేఖ (తిర్యక్‌రేఖ) రెండు శీర్షాలను క్రమంగా ఈశాన్య, ఆగ్నేయ ముఖంగా పొడిగించి చతుర్ధశక్తికోణం పార్శ్వరేఖల శీర్షాలతో కలపాలి మరల ఆద్యశక్తికోణం రెండు పార్శ్వరేఖలను చతుర్థి వహ్నికోణం పార్శ్వరేఖలను ఖండిస్తూ తృతీయవహ్నికోణం పూర్వాదిశాకోణంతో సమంగా ఉండేలా పొడిగించాలి తరువాత పైన చెప్పిన కోణాన్ని స్పృశించేలా ఒక పూర్వాదిశారేఖను గీసి దానితో ఈ పార్శ్వరేఖల శీర్షాలను కలపాలి

ఈవిధంగా చక్రం యొక్క పూర్వభాగంలో నాలుగుకోణాలు పెరుగుతాయి తదనంతరం తృతీయ వహ్నికోణం పార్శ్వరేఖలసు క్రమంగా వాయవ్య నైఋతి దిశలకు పొడిగించాలి తరువాత ఆద్యవహ్నికోణం పశ్చిమరేఖ యొక్క రెండు కోణాలను క్రమంగా వాయవ్య నైఋతి దిశలకు పొడిగించి పైన చెప్పిన పార్శ్వరేఖలను ఈ రేఖతో జత చెయ్యాలి

ఇదేవిధంగా ప్రథమవహ్నికోణం యొక్క పార్శ్వరేఖలను క్రమంగా వాయవ్యనైఋతి దిశలకు చతుర్థశక్తికోణం పశ్చిమకోణం వరకూ పొడిగించి ఈ కోణాన్ని స్పృశించేలా ఒక పశ్చిమరేఖను గీసి, దానితో పై పార్శ్వరేఖల శీర్షాలతో కలపాలి. ఈవిధంగా 'చతుర్దశారచక్రం' యేర్పడుతుంది.



చతుర్దశార చక్రం

ఇప్పుడు చతుర్దశారచక్రం వెలుపల వైపున శివచక్రాలను లిఖించే పద్ధతిని పరిశీలిద్దాం. పూర్వం ప్రస్తావించినట్లుగా మర్యాదావృత్తం, కర్ణికావృత్తం నిర్మించాలి లేదా వీటిని నిర్మించకుండానే సంపూర్ణచక్రాన్ని 16 భాగాలుగా విభజించాలి తరువాత ఏకాంతరంగా "అష్టదళకమలాన్ని" నిర్మించాలి ఆ తరువాత మతాంతర విధానంలో

కర్ణికావృత్తం నిర్మించి దానిని 32 భాగాలుగా విభజించి ఒక భాగం విడిచి ఒక భాగంలో (ఏకాంతరంగా) "షోడశదళకమలాన్ని" నిర్మించాలి దీని తరువాత మతాంతరవిధానంలో మర్యాదావృత్తంగాని వృత్తత్రయాన్ని గాని గీసి 'భూపురం' కోసం నాలుగు ద్వారాలతోగాని మతభేదానుసారం ద్వారాలు లేకండా ఒక రేఖగాని, మూడు రేఖలు లేదా నాలుగు రేఖలు గీయాలి ఈవిధంగా 'పరిపూర్ణ శ్రీయంత్రం' తయారవుతుంది

పైన పేర్కొన్న లేఖన విధానాన్ని కొంతమంది ఆచార్యులు సృష్టిక్రమ లేఖనంగా చెబుతారు సమయాచార మతావలంబకులు సృష్టిక్రమంలో విభజించబడిన శ్రీయంత్రాన్ని పూజనీయమైన దానినిగా భావిస్తారు. కులాచారం ప్రకారం విభజించబడే విధానం సంహారక్రమం నుండే ఉన్నదని తెలుస్తోంది శ్రీశంకర భగవత్పాద ప్రణీతమైన సౌందర్యలహరి 11వ శ్లోకం వ్యాఖ్యానంలో శ్రీలక్ష్మీధరుడు దీనిని ప్రస్తావించాడు సంహారక్రమానుసారంగా అయితే వృత్తం నుండి ప్రారంభించి బిందువుతో సమాప్తం చేయబడుతుంది కాని శ్రీలక్ష్మీధరుడు సంకేతించిన క్రమం ఈ వ్యాసంలో వామకేశ్వర తంత్రం అనుగుణంగా చూపిచబడిన క్రమం – ఈ రెండింటిలో ప్రధమ త్రికోణం యొక్క నియత పరిమాణం తెలియనందున మర్మసంధుల నిర్మాణం సరిగా జరగదు. అయితే వీటి యథోచిత సమావేశం అత్యంతావశ్యకం దీనిలో వ్యతిక్రమం జరిగినట్లయితే ప్రాయశ్చిత్తం అవసరమని చెప్పబడింది. కాబట్టి 'రా' ప్రాకారం అనగా సంహారచక్రం సప్రమాణ సాధకుల సౌకర్యార్థం లిఖించబడుతుంది సమయాచారవిధానంలోని సృష్టిక్రమం మరియు కులాచారవిధానంలోని సంహారక్రమం రెండింటిలో లిఖితమైనదానినే పూజించాలి

ఉపాసకుడు తన పూజాసనం (పూజావేదిక) సమ్ముఖంలో తూర్పుముఖంగా అవసరమైన పూజాసామగ్రి, పత్రికోసం కొంచెం చోటు వదిలి హస్తప్రమాణంలో లేదా యథేచ్ఛవేదికను ఏర్పాటు చేసికోవాలి లేదా స్వర్ణాదులలో నిర్మితమైన పీట (లేదా సింహాసనము) మీద శ్రీయంత్రరచన చేయాలి వేదిక మధ్యభాగం సమతలంగా ఉంచి సరిగ్గా మధ్యలో తూర్పునుండి పడమరకు అడ్డంగా ఒక సరళరేఖను (బ్రహ్మసూత్రం) నిర్మించాలి. తరువాత ఈ సూత్రాన్ని (రేఖను) 72 భాగాలుగా విభజించాలి. తూర్పు, పడమర దిక్కులలో ఒక్కొక్క అంచున క్రమంగా 12 1/2 భాగాలు చొప్పున వదిలి ఒక వృత్తాన్ని నిర్మించాలి దానిని మధ్యలో తూర్పునుండి పడమరల రెండింటివైపున 22 1/2 భాగాలు అయ్యేటట్లుగా చేయాలి. అనగా మధ్యభాగం మొత్తం కలిసి 45 భాగాలవుతుంది

ఈ వృత్తం వెలుపలిభాగంలో రెండువైపులా 41/2 భాగాలు చొప్పున కర్ణికా సహితమైన అష్టదళం, 5 భాగాలు చొప్పున కర్ణికాసహిత షోడశదళం నిర్మించి మిగిలిన నాలుగేసి భాగాల్లో మర్యాదావృత్తంతోపాటు చతురస్రం (భూపురం) నిర్మించాలి.

ఇప్పుడు వృత్తం మధ్యభాగంలో బిందువునుండి చతుర్దశారం వరకూ యంత్రనిర్మాణానికి వృత్తమధ్యభాగంలో కూడా ఒక బ్రహ్మసూత్రాన్ని అనగా అడ్డంగా ఒక సరళరేఖను గీసి దానిని 48 భాగాలుగా విభజించాలి ఈ బ్రహ్మసూత్రం యొక్క భాగాలు అధారంగా తూర్పునుండి పడమరకు క్రమంగా 6, 5, 3, 6 భాగాల అంతరాలతో (వ్యవధిలో) తొమ్మిది "తిర్యక్‌రేఖలు" గీయాలి దీనినుండి ఆరవభాగంలో మర్యాదావృత్తం ఉంటుంది ఈ రేఖలన్నీ ఒకే పొడవులో ఉండాలని లేదు గనుక విభిన్న పరిమాణాలతో (కొలతలతో) విభిన్నరేఖల యొక్క శీర్షాలను సమానతను తగ్గించాలి అది ఎలాగంటే ప్రథమ, నవమ సూత్రాలకు రెండింటివైపు ఐదేసిభాగాలు తగ్గించాలి అలాగే తృతీయ, సప్తమరేఖలను వృత్తంవరకూ ఉంచాలి ఇంకా చతుర్థ, షష్ఠరేఖలు రెండింటిని 16 భాగాలుగా తగ్గించాలి. అలాగే పంచమరేఖను రెండువైపులా 18 భాగాలు తొలగించాలి

ఇప్పుడు పైన పేర్కొన్న రేఖలను పరస్పరం కలపడం ద్వారా త్రికోణనిర్మాణక్రమాన్ని పరిశీలిద్దాం.

ఈ క్రమంలో రేఖలను పశ్చిమదిశవైపుగా గణించాలి. అనగా త్రికోణ నిర్మాణంలో నవమంగా ఉన్న రేఖను త్రికోణవిధిలో మార్జనవిధిలో (పద్ధతిలో) ప్రథమంగా, ప్రథమరేఖను నవమరేఖగా గ్రహించాలి. తృతీయరేఖయొక్క వృత్తాన్ని అనుకొనియున్న రెండుకోణాలునుండి పూర్వదిశగా పార్శ్వరేఖలను గీసి వృత్తం వరకూ చేరి ఉన్న బ్రహ్మ సూత్రంతో వాటిని త్రికోణం యేర్పడేవిధంగా కలపాలి అలాగే సప్తమ సూత్రం యొక్క వృత్తంతో కలసి ఉన్న రెండుకోణాలనుండి రెండు పార్శ్వరేఖలను పశ్చిమదిశగా నిర్మించి బ్రహ్మసూత్రంతో కలపాలి. ఈ విధంగా చేయడంవల్ల 'షట్కోణం' నిర్మింపబడుతుంది.

తరువాత ప్రథమ పశ్చిమరేఖ మధ్యనుండి రెండు పార్శ్వ రేఖలను గీసి అష్టమరేఖ యొక్క రెండు అగ్రకోణాలతో జతచేయాలి. ఈవిధంగా ఈ రెండు రేఖలనుండి పూర్వం పేర్కొన్న షట్కోణం యొక్క పశ్చిమభాగంలో పూర్వదిశగా రెండు మర్మస్థానాలు ఏర్పడతాయి. తదనంతరం నవమరేఖ మధ్యనుండి రెండు పార్శ్వరేఖలను పశ్చిమదిశగా గీసి ద్వితీయరేఖ యొక్క రెండు కోణాలతో జతచేయాలి ఇలా చేయడం వల్ల షట్కోణం యొక్క పశ్చిమభాగంలో మరి రెండు 'మర్మాలు' యేర్పడతాయి

అటు తరువాత మళ్ళీ నవమరేఖ యొక్క రెండు అగ్రకోణాలనుండి రెండు పార్శ్వరేఖల్ని పశ్చిమంవైపుకు పొడిగించి చతుర్ధరేఖ మధ్యలో కలిసేలా చేయాలి ఈ రెండు రేఖల్ని పొడిగించే సమయంలో వీటిద్వారా సప్తమ, అష్టమ తిర్యక్‌రేఖల సంధి స్థానాలను ఖండించటంవలన నాలుగు 'మర్మాలు' యేర్పడేలా జాగ్రత్త వహించాలి మళ్ళీ సప్తమ సూత్రం మధ్యనుండి పశ్చిమంవైపుకు రెండు పార్శ్వాలలో రెండేసి మర్మస్థానాలను యేర్పరుస్తూ రెండు అడ్డరేఖలను పొడిగించి ప్రథమ పశ్చిమరేఖ రెండు కోణాలతో జతచేయాలి దీనివల్ల మరో నాలుగు మర్మస్థానాలు యేర్పడతాయి ఆ తరువాత అష్టమ తిర్యక్‌రేఖ మధ్యనుండి రెండు పార్శ్వరేఖల్ని పశ్చిమదిశగా పొడిగించి చతుర్థ తిర్యక్‌రేఖ రెండుకోణాలతో జతచేయాలి. ఆ తరువాత ఆరవ తిర్యక్‌రేఖ రెండు అగ్రభాగాలనుండి రెండు పార్శ్వరేఖలు, పశ్చిమ తిర్యక్‌రేఖ రెండు అగ్రకోణాలనుండి రెండు పార్శ్వరేఖలు పశ్చిమదిశగా గీసి సప్తమ తిర్యక్‌రేఖ మధ్యలో త్రికోణరూపంలో కలపాలి. ఆఖర్న బ్రహ్మసూత్రాన్ని చెరిపివేయాలి. అప్పుడు చతుర్దశార పర్యంతమైన శ్రీయంత్రం యేర్పడుతుంది అటు తరువాత అష్టదళాది మూడు చక్రాలను పూర్వం మాదిరిగా నిర్మించాలి

## శ్రీ విద్యాయంత్రమే శ్రీ యంత్రం

శ్రీవిద్యయొక్క యంత్రాన్ని 'శ్రీ యంత్రం' అంటారు. 'శ్రీ యంత్రం' లో ఉన్న 'శ్రీ' శబ్దం శ్రీవిద్యావాచకం కాగా, "చక్ర" శబ్దం మంత్రసమన్విత చక్రస్వరూపమైన యంత్రాన్ని సూచిస్తుంది. ఇది సమస్త బ్రహ్మాండానికి ప్రతీకగా నిలిచే ఏకైక యంత్రం ఇది ప్రణవ స్వరూప శబ్దం బ్రహ్మను కూడా సూచిస్తుంది. ఇది పరబ్రహ్మ స్వరూపిణి, ఆది ప్రకృతిమయి అయిన శ్రీవిద్యారూపమైన మహాత్రిపురసుందరీ దేవియొక్క ఆరాధనాస్థలము. అది ఒక దివ్యధామం. ఒక దివ్యరథం కూడా దీని (సన్నివేశము) సాన్నిధ్యము మనోహరము. దీనిలో సమస్తదేవతల ఆరాధనతోపాటు సర్వవిధాలయిన ఉపాసనలు కూడా ఉంటాయి. దీనిలో సమస్త ఆమ్నాయములు, సమస్త క్రమములు సకలమైన ఆచారములు, సర్వవిధ విద్యలయొక్క సర్వతత్త్వములు సమావేశమై ఉంటాయి. అన్ని వర్ణాలు, అన్ని ఆశ్రమాలు, అన్ని మతాలకు సంబంధించిన యోగ్యులైన వారలు ఉపాసకులుగా పాల్గొనవచ్చును.

# 6. శ్రీయంత్రం యొక్క మనోహరదృశ్యం

శ్రీయంత్ర నిర్మాణ స్వరూపం మనోహరంగా ఉంటుంది దాని విన్యాసం విచిత్రంగా ఉంటుంది దీనిమధ్యలో బిందువు, అన్నిటికంటె వెలుపల భూపురం ఉంటాయి. భూపురానికి నాలుగువైపులా నాలుగు ద్వారాలుంటాయి బిందువునుంచి ప్రారంభించి భూపురం వరకూ పది విధాలయిన అవయవాలుంటాయి. అవి వరుసగా 1. బిందువు , 2. త్రికోణం, 3 అష్టకోణం, 4. అంతర్దశారం, 5. బహిర్దశారం, 6. చతుర్దశారం, 7. అష్టదళం, 8 షోడశదళం, 9. త్రివృత్తాలు, 10. త్రిభూపురాలు

పూజా సందర్భంలో బిందువును మూడుగా పరిగణిస్తారు అప్పుడు మొత్తం పదహారు అవయవాలు అవుతాయి. అవి ఒకటి తరువాత ఒకటి అనుస్యూతమవుతాయి. దానివల్ల అనేక అన్య అవాంతరకోణాలు రేఖలు యేర్పడతాయి. ఇంకా చతుర్దాశారం యొక్క కోణాలు యొక్క శీర్షాలు (కొనలు) కూడా వెలుపల ఉన్న అష్టదళంలో కలుస్తాయి అలాగే అష్టదళం యొక్క శీర్షాలు షోడశదళంలో, షోడశదళం శీర్షాలు ప్రథమ వృత్తంలో కలసిపోతాయి. అందువల్ల మరిన్ని కోష్టాలు కోణాలు ఏర్పడతాయి. అప్పుడు దీనిని "స్పందీచక్రం" అని కూడా పిలుస్తారు. దీనిలో బిందువు, అష్టదళం, త్రివృత్తాలు, చతురస్రాలు శివాంశలుగా, త్రికోణం, అష్టకోణం రెండు దశకోణాలు, చతుర్దశారం శక్త్యంశాలుగా భావిస్తారు.

ఈవిధంగా పంచశివ త్రికోణాలు, నాలుగు శక్తి త్రికోణాల కలయిక ద్వారా పరస్పరం ఖండించాలి. మొత్తం 43 కోణాలు ఏర్పడతాయి. వెలుపల ఉన్న 'భూపురం' ఒక విధమైన ప్రాకారంగా లేదా దుర్గంగా కనిపిస్తుంది. ఈవిధంగా శ్రీయంత్ర విన్యాసం అతి మనోహరంగా ఉంటుంది. అంతేకాదు అది మనోహరంగా ఉంటూనే జటిలంగా కూడా ఉంటుంది. కాబట్టి ఈ శ్రీపురం అనగా శ్రీవిద్యాపురం అని కూడా దీనిని పిలుస్తారు

ఆగమాలలో ఈ చక్రం ఒక దివ్య ద్వీపరూపంగా వర్ణించబడింది. ఒక దివ్యనగరంగా కూడా నిరూపించబడింది. ఎందుచేతనంటే నిఘంటుకారులు చక్రశబ్దానికి అర్థం "నగరం" అనికూడా పేర్కొన్నారు. ఈ ద్వీపం రక్తవర్ణ సుధాసముద్రంతో చుట్టి ఉన్నది – ఈ ద్వీపంలో కల్పవృక్షమైన పారిజాత వృక్షంతో సహా అనేక ఫలపుష్పాల తరువులు, లతలతో కూడిన దివ్యనందనోద్యానవనాలతో అనంతయోజన విస్తీర్ణమైన ఈ పురం మధ్యన రత్నాప్రాకారంలోపల సువర్ణ రత్నసింహాసనంపై అనంతకోటి బ్రహ్మాండనాయిక అయిన శ్రీ మహాత్రిపురసుందరీదేవి విరాజమానమై విరాజిల్లుతూ ఉంటుంది. ఈపురం ఆకారం

చక్రాకారంలో ఉంటుంది. ఇది శ్రీయంత్రానికి ప్రతీకగా నిలిచి ఉంటుంది. ఈదేవి చక్రాకార రథారూఢయై సమస్త దేవదేవీ సహితమై, యోగినులు తమ విభూతి వలయాలతో అనగా సమూహాలతో పరివేష్టించిరాగా త్రిపురసుందరీదేవి భస్మాసుర సంహారం చేసింది ఈ వర్ణనను బట్టి శ్రీయంత్రం చక్రాకార ద్వీపంగా, పురంగా సర్వత్ర స్వవిభూతులతో పరివృత్తమైన శక్తికి ప్రతీకగా మనకు కనబడుతుంది ఈ చక్రం మధ్యబిందువు శివస్థానంగాను, త్రికోణం శక్తిస్థానంగాను స్వరూపంగాను ఉంటాయి ఇంకా ఈ రెండింటి (శివశక్తుల) సమన్వయంవల్ల సమరసభావస్థితమైన శివశక్తిస్వరూపం సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపం, దానియొక్క చిద్రూప శక్తుల ఏకైక భావాన్ని సూచించేదే (ప్రతీకగా నిలిచే) శ్రీచక్ర మధ్యబిందువు. ఈవిధంగా ఈ బిందువు శ్రీమహా త్రిపురసుందరీ దేవి యొక్క కేంద్రబిందువు అవుతుంది. శ్రీయంత్రరూపమైన పురము సకలదేవతలకు నివాసస్థానమౌతుంది. తాత్పర్యమేమిటంటే – ఆ త్రిపురసుందరీదేవియే విభిన్నదేవతా రూపమైన విభూతులతో ఈ పురమంతా వ్యాపించింది ఆ పుర మధ్యంలో అధిష్ఠితమై ఉంటుంది కాబట్టి శ్రీయంత్రం ఆమెకు ప్రతీకగా నిల్చి ఉంటుంది. ఇంకా మేరుపృష్ఠాకారంలో ఈ చక్రం పైకి పెరుగుతూ ఉన్నతాకారంగా ఉన్నప్పుడు ఆ చక్రం సమస్త బ్రహ్మాండాన్ని నియంత్రించే సుమేరు పర్వతానికి ప్రతీకగా నిలిచి ఉంటుంది దీనికి సాక్షిగా సుమేరు పర్వతము మీదన పురాణాలలో వర్ణితమైన అన్ని లోకాల సమన్వయం ఈ చక్రంలో మనకు కనిపిస్తుంది శాస్త్రాలు 'మేరువు'ను నిశ్చలరూపంగాను, శ్రీచక్రాన్ని 'మేరువు'గాను గ్రహించాయి

శ్రీచక్రమపి దేవేశి మేరు రూపం న సంశయః ।
లాకారాత్ పృథివీ దేవీ సశైల వన కాననమ్ ।
సకారాచ్చంద్రతారాది గ్రహరాశి స్వరూపిణీ ॥ (జ్ఞానార్ణవం)

శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం,
వరత్రాసత్రాణ స్ఫటికఘుటికా పుస్తకకరామ్.
సకృన్నత్వా న త్వా కథమివ సతాం సన్నిదధతే,
మధుక్షీరద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః.
- సౌందర్యలహరి

# 7. శ్రీ విద్యా సంప్రదాయం

శ్రీ విద్యోపాసకులలో పన్నెందు మంది మనకు ప్రసిద్ధంగా కనిపిస్తారు 1 మనువు 2 చంద్రుడు 3 కుబేరుడు 4 లోపాముద్ర 5 కామదేవుడు, (మన్మధుడు) 6 అగస్త్యుడు 7 అగ్ని 8 సూర్యుడు 9 ఇంద్రుడు 10. కార్తికేయుడు 11 శివుడు 12 దుర్వాసమహర్షి వీరంతా ప్రసిద్ధులైన శ్రీవిద్యోపాసకులు

శ్రీయంత్రానికి సంబంధించి మూడు విధాలయిన సంప్రదాయాలు ఉన్నాయి అవి 1 హయగ్రీవ సంప్రదాయం 2 ఆనందభైరవ సంప్రదాయం 3. దక్షిణామూర్తి సంప్రదాయం

వీటిలో హయగ్రీవ సంప్రదాయంలో త్రివృత్తాలు ఉండవు. ఆనందభైరవ సంప్రదాయంలో త్రివృత్తాలు ఉంటాయిగాని వాటి పూజాదులుండవు. దక్షిణామూర్తి సంప్రదాయంలో త్రివృత్తాలు ఉండి వాటికి పూజదులు కూడా ఉంటాయి.

# 8. శ్రీయంత్రం త్రిలోకాలకు ప్రతీక

శ్రీయంత్రం బిందువునుండి మొదలిడి భూపురం వరకూ మూడు రూపాలుగా విభజింపబడింది. వీటిలో భూపురం నుండి అష్టదళం వరకూ 'సృష్టి' చక్రంగాను, చతుర్దశారం నుండి అంతర్దశారం వరకూ 'స్థితి' చక్రంగాను, అష్టారం నుండి బిందువు వరకూ 'సంహార' చక్రంగాను పరిగణిస్తారు ఈ మూడు చక్రాలను 'త్రిపురా'లని కూడా పిలుస్తారు. ఈ త్రిపురసహితమైన శ్రీ చక్రంయొక్క అధిష్ఠాత్రి ఆదిశక్తి త్రిపురసుందరీ నామంతో ప్రసిద్ధమై ఉంది ఈమె యొక్క ప్రధాన అవాస స్థానం శ్రీయంత్ర స్థితమైన బిందువే! ఈ బిందువు శ్రీమాతకు ప్రతీకగా నిలిచి ఆదేవిని ప్రకాశింపజేస్తూ ఉంటుంది ఈ చక్రంలో భూపురం, వృత్తం, త్రికోణాలు ఇవన్నీ మూడు మూడు సమూహాలుగా ఉన్నాయి ఇవన్నీ యధాయోగ్యంగా త్రిగుణాలను, త్రికాలాలను, త్ర్యవస్థలను, త్రిలోకాలను త్రిమూర్తులను సూచిస్తాయి. త్రికోణాలు జాగృత్ స్వప్న సుషుప్త్యావస్థలను సూచిస్తుంటే కేంద్రబిందువు తురీయావస్థా స్వరూపాన్ని సూచిస్తుంది ఈ బిందువే తురీయాతీతమై ఏకరూపంగా ఏర్పడుతుంది ఈవిధంగా ఇది వాస్తవిక తత్త్వస్వరూపం. ఈ తాత్త్విక దృష్టితో సమస్త బ్రహ్మాండం యొక్క సృష్టి స్థితి సంహారాలు జరుగుతాయి. (ఉంటాయి )

# 9. గురువు, మంత్రం, దేవత

ఆత్మ శక్తి యొక్క దేవతాస్వరూపమైన శ్రీవిద్య, దీనియొక్క మంత్రం, మంత్రాన్ని ప్రసాదించే గురువు ఈ త్రయాన్ని (మూడింటిని) సమభావంతో చూడటమే శ్రీవిద్య యొక్క ప్రధాన ఉపాసనా పద్ధతి సమభావం యొక్క పరిపూర్ణత్వమే పరమసిద్ధికి సోపానం ఘటము, కలశము, కుంభము ఈ మూడు శబ్దాలు ఏకార్థవాచకాలైనట్లుగానే (ఒకే అర్థాన్ని బోధించినట్లుగానే) మంత్రము, దేవత, గురువు అనే మూడు శబ్దాలు కూడా ఒకే అర్థాన్ని సూచిస్తాయి

## శ్రీయంత్రంలోని తొమ్మిది చక్రాలు - వాటి రంగులు

| | | |
|---|---|---|
| 1 | సర్వానందమయ చక్రం | (కేంద్రంలో రక్తబిందువు) |
| 2 | సర్వసిద్ధిప్రద చక్రం | (పసుపురంగు త్రికోణం) |
| 3 | సర్వరక్షాకర చక్రం | ( ఆకుపచ్చ రంగులో అష్ట త్రికోణాలు) |
| 4 | సర్వరోగహర చక్రం | (నలుపురంగులో దశత్రికోణాలు) |
| 5 | సర్వార్థసాధక చక్రం | (ఎఱుపురంగులో దశత్రికోణాలు) |
| 6 | సర్వసౌభాగ్యదాయక చక్రం | (నీలంరంగులో చతుర్దశ త్రికోణాలు) |
| 7. | సర్వసంక్షోభణ చక్రం | (గులాబీరంగులో అష్టదళకమలం) |
| 8. | సర్వాశా పరిపూరకచక్రం | (పసుపురంగులో షోడశదళ కమలం) |
| 9. | త్రైలోక్యమోహన చక్రం | (ఆకుపచ్చరంగులో బాహ్యావరణం) |

# 11. శ్రీయంత్రం 'బ్రహ్మాం'డానికి ప్రతీక

ఈ బ్రహ్మాండానికి సృష్టిస్థితిసంహారాలు ఉన్నట్లుగానే మన మానవదేహానికి కూడా మూడు అవస్థలు యేర్పడి ఉన్నాయి కాబట్టి ఇదేవిధంగా శ్రీయంత్రం కూడా సృష్టి, స్థితి, సంహారాలనే త్రిచక్రయుక్తమై ఉండటంవల్ల అది బ్రహ్మాండానికి ప్రతీకగా ఉన్నది బ్రహ్మాండంలో త్రిలోకాలు, సకల తత్త్వాలు, సమస్తమైన అవస్థలు ఉన్నాయి పిండాకార బ్రహ్మాండంలో మూలాధారంనుండి బ్రహ్మరంధ్రం వరకూ ఉన్న సకలలోకాలు, తత్త్వాలు అవస్థలు ఉన్నాయి ఇదేవిధంగా శ్రీయంత్రంలో కూడా భూపురం నుండి బిందువు వరకూ అన్నిలోకాలు, అన్ని తత్త్వాలు, అవస్థలు ఉన్నాయి. అలాగే శరీరంలో ఉండే అన్ని చక్రాలతోను (మూలాధారాది చక్రాలు) సమన్వయం కనిపించటంవల్ల శ్రీయంత్రం బ్రహ్మాండానికి ప్రతీకగా భావించబడుతోంది.

శ్రీయంత్రం ప్రణవస్వరూపశబ్దం బ్రహ్మకు కూడా ప్రతీకగా నిలుస్తుంది ప్రణవ మంత్రంలో ప్రధానంగా పంచ అవయవాలు ఉన్నాయి - అ, ఉ, మ, నాదం మరియు బిందువు అలాగే నాలుగు అవస్థలు లేదా రూపాలు ఉన్నాయి. - వైఖరి, మధ్యమ, పశ్యంతి, పర రూపాలు. ఇవన్నీ శ్రీయంత్రంలోని సృష్టి, స్థితి, సంహార అవస్థలతో, పంచక్రమాలతో సమన్వయమౌతాయి శరీరంలోని స్వాదిష్ఠాన, మణిపుర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞ, మూలాధార చక్రాలతో కూడా ఇదేవిధమైన సమన్వయం ఉంటుంది. ప్రణవగతమైన బిందువు అవ్యక్త అవస్థ మూలాధారంతో, అవ్యక్త వ్యవస్థ ఆజ్ఞాచక్రంతో సమన్వయమౌతోంది ఇదేవిధంగా ప్రణవంలో **36** కళలు లేదా మంత్రాలు ఉన్నాయి వాటిలో **29** కళలు త్రివృత్తాలలో ఉన్నాయి వాటినే త్రివృత్తాలలో ఉండే కాలరాత్రీదేవి నుండి హంసవతి వరకూ గల మంత్రాలుగా చెప్పవచ్చు అవే పిండశరీరం యొక్క గర్భావస్థ, బాల్యావస్థాదులతో ప్రారంభించి నిర్యాణం వరకూ గల జాగృత్, స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీత అవస్థలు అవుతాయి. ఈ ప్రకారంగా శ్రీయంత్రం బ్రహాండానికి, బ్రహ్మాండ పిండానికి, ప్రణవానికి ప్రతీకగా భావించబడింది దీనికి సంబంధించిన విస్తారమైన వివేచన ఆగమశాస్త్రగ్రంథాల్లో ఉపనిషత్తుల్లో మనకు కనబడుతుంది

మానవ శరీరంలో షట్చక్రాలతో సమన్వయంకోసం శ్రీ విద్యోపాసనాపరంగా దీనిలో మొత్తం పంచక్రమాలను కల్పించటం జరిగింది. సృష్టిచక్రం, స్థితిచక్రం, సంహారచక్రం, అనాఖ్యాచక్రం భాషాచక్రంగా కల్పించబడింది. ఈవిధంగా సృష్టి, స్థితి, సంహార, అనాఖ్యా భాషాచక్రాలు ఐదూ క్రమంగా స్వాధిష్ఠాన, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రాలతో అంతర్భూతంగా గ్రహిస్తారు. ఈ ప్రక్రియను "శ్రీకల్పం" అంటారు. కాని కాళీకల్పంలో సృష్టిచక్రాన్ని మూలాధారంగా భావిస్తారు. ఆవిధంగా శ్రీయంత్రంలో ప్రధానంగా మూడు కల్పాలు ఉన్నప్పటికి తారాకల్పాన్ని దక్షిణామ్నాయంలో కాళీక్రమంలో సంలీనం చేస్తారు. అందువల్ల రెండే క్రమాలు లేదా కల్పాలే కనిపిస్తాయి. వాటిని 'శ్రీక్రమం' 'కాళీక్రమం' అంటారు. ఇందులో కూడా కాళిని ప్రధానంగా పూజించేవాళ్ళు శ్రీ (సుందరి)ని క్రింది భాగంలో ఉంచుతారు. శ్రీని (సుందరి) ప్రధానంగా భావించేవాళ్ళు కాళిని క్రిందిభాగంలో ఉంచుతారు. ఈవిధంగా శ్రీని పైన ఉంచినట్లయితే సాధారణంగా మూలాధారం నుండి విశుద్ధచక్రం వరకూ ఉండే క్రమం 'కాళీకల్పం' అవుతుంది అలాగే ఆజ్ఞాచక్రం నుండి బ్రహ్మరంధ్రం వరకూ సాగే క్రమం 'శ్రీకల్పం' అవుతుంది. స్వాధిష్ఠానంలో సృష్టిని, మూలాధారంలో విశ్రాంతిని భావిస్తారు. అప్పుడప్పుడు మూలాధారంనుండి విశుద్ధచక్రం వరకూ సృష్ట్యాది పంచక్రమాలుగా ఆజ్ఞాచక్రం నుండి బ్రహ్మరంధ్రం వరకూ కేవలం

భాషాచక్రంగా భావింపబడుతోంది ఈవిధంగా ఇక్కడ అధోస్థానీయమైన మూలాధారంనుండి స్వాధిష్ఠానం నుండి సృష్ట్యాదిగా భావించి ఊర్ధ్వస్థానీయమైన బ్రహ్మరంధ్ర స్థానీయమైన బిందువు దగ్గర సంహారంగా గ్రహిస్తారు ఇక్కడ మరో విషయం గమనించాలి. ఇక్కడ వాడే 'సంహార' శబ్దం లయార్థంలో ప్రయుక్తమై ఉన్నదే తప్ప 'ధ్వంసం', 'వినాశనం' అనే అర్థాల్లో కాదు ఒక సంప్రదాయంలో సృష్టి అయిన ప్రదేశంలోనే తిరిగి "సంహారం" అనగా "లయం" జరుగుతుంది మరొక మతానుసారం బిందువుతోనే సృష్టిగా భావించి మూలాధారం వరకూ ప్రయాణించి మరలా తిరిగి 'బిందువు' కే చేరి అక్కడ లయం అవుతుంది.

## శ్రీ యంత్రం శక్తి త్రిపురాదేవి స్వరూపానికి ప్రతీక

శ్రీవిద్య యొక్క లీలావిగ్రహ రూపాలు అనంతంగా ఉన్నప్పటికి పదిరూపాలు ప్రధానంగా చెప్పుకోవచ్చు. అవి - 1. కుమారి 2 త్రిరూప 3 గౌరి 4. రమ 5 భారతి 6. కాళి 7. కాత్యాయని 8. చండిక 9 దుర్గ 10 లలిత.

" త్రిపురారహస్యం" మహాత్మ్యఖండంలో విస్తృతంగా ఈ విషయం చర్చింపబడినది.

"వరివస్యారహస్యం"లో శ్రీయంత్రం యొక్క సూక్ష్మ రహస్యాలను వివరించటానికి విశేష కృషి చేయబడింది. వైదిక సాహిత్యాంతర్గత సూక్తాలను అనంతకాలంలో స్వతంత్రంగా ప్రస్తావించి కొంతమంది ఆచార్యులు వాటికి టీకలు సిద్ధంచేసి వాటి యంత్రాత్మకతను సిద్ధాంతీకరించారు (సిద్ధపరచారు) శ్రీ సూక్తం యొక్క ప్రతి ఋచా యంత్రం, దానితోపాటు దానికి సంబంధించిన మీమాంస "లక్ష్మీబీజ తంత్రకోశం" లో వర్ణించబడింది. ఈ సూక్తాలను ఆధారంగా చేసుకొని మరికొందరు ఆచార్యులు అలాంటి స్తోత్రసాహిత్యాన్ని సృష్టించారు. తత్ఫలితంగా యంత్రమంత్రాది ప్రక్రియలను నిర్దేశించే అనేక స్తోత్రాలు ఆవిర్భవించాయి

తాంత్రిక గ్రంథాలలో పటలం, హృదయం, కవచం, స్తోత్రం. సహస్రనామాలు, శతనామాలు మొదలైన సాధనకు సంబంధించిన అంగాలను అత్యంత అవశ్యకాంగాలుగా గుర్తించారు. వాటిని పూరించటానికి తయారైన స్తోత్రాదులలో యంత్రమీమాంస కూడా చేయబడటం దీనికి కారణం. "శారదాతిలకం" అనే గ్రంథంలో ఆయాదేవతలయొక్క సాధన విధానాలను వివరిస్తూ వాటితోపాటే ఆయా యంత్రాలకు సంబంధించి విశిష్టవర్ణన చేయబడింది.

తాంత్రిక ప్రక్రియలను సంకేతాత్మకంగా సూచించే పద్ధతి తంత్రశాస్త్ర పరంపరగా ఉన్నది దీనివలన వాటి గోపనీయత యధావిధిగా కాపాడబడింది చాలా గ్రంథాలలో స్పష్టంగా ఈ తాంత్రిక విషయాలకు సంబంధించిన ప్రచురణ నిషేధించబడింది అయినప్పటికి ఆ విద్యలు లుప్తం కాకుండా ఏదో ఒక అంశాన్ని గురు సంప్రదాయంలో నేర్చుకోడానికి అదేశింపబడింది.

ఆదిశంకరులు తమ 'ప్రపంచసారతంత్రం" అనే గ్రంథంలో మంత్రాది వర్ణనలతోపాటు యంత్రాలను కూడా నిర్దేశించి చూపారు "మేరు తంత్రం", "పరాతంత్రం", "కాళికాపురాణం', 'దేవీపురాణం', 'యామళగ్రంథం', 'కల్పగ్రంథం', 'వడవాపనలతంత్రం', 'శాక్తప్రమోదం', 'కుబ్జికాతంత్రం', 'కులాలికామ్నాయతంత్రం', 'గుహ్యాతంత్రం', 'భైరవీ తంత్రం', 'చిదంబర తంత్రం', 'ఫేల్కారిణీతంత్రం', 'వామదేవ సంహిత', 'వశిష్ఠ సంహిత', 'విశ్వామిత్రసంహిత', 'శక్తి సంగమ తంత్రం', "శ్రీ విద్యార్ణవం", ఇత్యాది తాంత్రిక గ్రంథాలలో విభిన్న దేవీదేవతా స్వరూపాలను లక్ష్యంగా చేసుకొని ఆయాదేవతల సాధనా విధానాలను వివరిస్తూ యంత్రోద్ధారము, ఆయా యంత్రాల ఆవరణపూజలు విస్తారంగా వర్ణింపబడ్డాయి యంత్రశాస్త్రం బహు విస్తారమైనది దీనికి సంబంధించిన ఏ కొద్దిపాటి జ్ఞానమైనా పైన పేర్కొన్న గ్రంథాల ద్వారానే కలుగుతోంది. ఇదేవిధంగా శైవ, వైష్ణవ, గాణపత్య, సౌర, శక్త్యాది యంత్రాలకు సంబంధించిన విజ్ఞానం ఆచార భేదంవల్ల కూడా అనేక విధానాలతో మనకు లభిస్తోంది

## 13. శ్రీ విద్యోపాసనా క్రమాలు

శ్రీవిద్యోపాసన మూడు క్రమాలలో ఉంటుంది. అవి 1 కాళీక్రమం 2. సుందరీక్రమం 3 తారా క్రమం

వీటిలో కాళీక్రమాన్ని "కుండలినీక్రమం", "కాళీవిద్య", అని కూడా పిలుస్తారు. ఇది సత్త్వగుణ ప్రధానమైనది. సుందరీక్రమాన్ని "హంసక్రమం" అని "సాది విద్య" అని కూడా అంటారు. ఇది రజోగుణ ప్రధానమైనది. అలాగే తారాక్రమాన్ని కూడా "సమవరోధినీ క్రమం" అని "సాదివిద్య" అని నామాంతరంతో పేర్కొంటారు. ఇది తమోగుణ ప్రధానంగా ఉంటుంది. ఈ మూడు క్రమాలలనే "దీక్ష" అనే పేరుతో ప్రసిద్ధంగా పేర్కొంటారు. ఈ దీక్ష పరిపూర్ణమైనప్పుడు సాధకుడు శివ స్వరూపుడవుతాడు.

సుందరీ తారిణీ కాలీ క్రమదీక్షాభిగామినీ ।
క్రమపూర్ణో మహేశాని క్రమాచ్ఛంభు ర్భవిష్యతి ॥

ఈ క్రమాలు అన్ని ఆమ్నాయాలలోను ఉన్నాయి వీటిలో ప్రతి క్రమానికి పంచక్రమ ఉపాసన ఉంటుంది ఈ ఉపాసన ప్రాతః కాలంలో ప్రారంభమై అర్ధరాత్రి వరకూ క్రమంగా పంచసంధ్యారూపంగా ఉంటుంది. ఈ క్రమాలలో ప్రతిక్రమంలో విద్య భిన్నభిన్న సమయాలలో భిన్నభిన్న రూపాలలో ఉపాసింపబడుతుంది (ఉపాస్య అవుతుంది) కాది విద్యారూపంగా ఉండే కాళి ఆ క్రమంలో ప్రాతఃకాలంలో "కామకళాకాళి"గా మధ్యాహ్నవేళ "భువనేశ్వరి"గా, సాయం సమయంలో 'చాముండ"గా రాత్రివేళలో "సమయకుబ్జిక"గా, అర్ధరాత్రి 'కాది - పంచదశి" గా ఉపాసింపబడుతుంది " హాది విద్యా" స్వరూపమైన మహాత్రిపురసుందరి ప్రాతర్వేళ "ఆద్యాకాళి"గా మధ్యాహ్నం 'తార' గా సాయంకాలం "ఛిన్నమస్త"గా రాత్రివేళ "బగళాదేవి"గా, అర్ధరాత్రి "హాది పంచదశి'గా ఉపాసింప బడుతుంది. ఇదేవిధంగా "సాదివిద్యా" స్వరూపమైన "తార" ప్రాతఃకాలంలో అనిరుద్ధసరస్వతీ రూపంలో 'దక్షిణకాళి'గా ఉపాసింపబడుతుంది. ఆమె మధ్యాహ్నం 'తార'గా సాయంకాలం 'బాల'గా, రాత్రివేళ జ్ఞాన సరస్వతిగా, నిశిరాత్రి 'సాది పంచదశి'గా ఉపాసింపబడుతుంది. ఇవే కాకుండా శ్రీవిద్యోపాసనలో మరిన్ని క్రమభేదాలున్నాయి. ఇవి కొన్ని లఘుక్రమాలుగా మహాక్రమాలుగా, పూర్ణ మహాక్రమాలుగా ఉండి వీటి ఉపాసన సాగుతుంది ఈవిధంగా ఒక క్రమదీక్షలో అనుష్ఠానం కొనసాగిస్తూ ముందుకు సాగనట్లయితే ఉపాసన యొక్క యథార్థఫలం శాస్త్రాలలో పేర్కొన్నట్లుగా చేతికి అందదు విలోమ పద్ధతిలో ఉపాసన నడిచినట్లయితే అది సద్యః ఫలదాయకమవుతుంది దీనిని గురించి ఇంకా ఎన్నెన్నో ధార్మిక వైజ్ఞానిక రహస్యాలు పరిశీలించిన కొద్దీ, పరిశోధించిన కొద్దీ మనకు లభిస్తాయి.

శ్రీవిద్యకు ప్రధానంగా ఆరు ఆమ్నాయాలున్నాయి అవి తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం మొదలైన దిశలతోపాటు (ఊర్ధ్వ అధోదిశలు రెండింటి పేరున అవి ప్రసిద్ధమై ఉన్నాయి.) ఇవిగాక ఈశాన్యాది నాలుగు ఉపదిశల పేరుమీద కూడా ప్రసిద్ధమైన ఆమ్నాయాలున్నాయి వీటి చతుర్థామ్నాయాలు అంటారు ఈ నాలుగు పూర్వాదిదిశలతో తమ ముఖ్య ఆమ్నాయాలతో యథాయోగ్యంగా సంలీనమవుతాయి. అందువల్ల ఆమ్నా యాలు ముఖ్యంగా పైన పేర్కొన్న ఆరింటినే ప్రధానమైనవిగా పరిగణిస్తారు. అనగా 1. పూర్వామ్నాయం 2 దక్షిణామ్నాయం 3. పశ్చిమామ్నాయం 4. ఉత్తరామ్నాయం 5. ఊర్ధ్వామ్నాయం 6. అధోమ్నాయం అనే ఆరు ఆమ్నాయాలే ముఖ్యమైన ఆమ్నాయాలు. గణనక్రమంలో అధరామ్నాయం అన్నిటికన్నా ఆఖర్న వచ్చినప్పటికి ఉపాసనాక్రమంలో దీనిని మనం సర్వప్రథమంగా ఉంచుతాము. ఈ ఆరు ఆమ్నాయాలకు ప్రతిదానికి సృష్టి,

స్థితి, సంహార, అనాఖ్య, భాష అనే ఐదుక్రమాలుంటాయి ఇవి మూలాధారం నుండి ఆజ్ఞాచక్రం వరకూ (మరో అభిప్రాయంలో బ్రహ్మరంధ్రం వరకూ) సమన్వయం అవుతాయి వీటికి అనగా ప్రతి ఆమ్నాయానికి ఒక 'ఆమ్నాయ నాయిక' ఉంటుంది

| ఆమ్నాయం | నాయిక |
|---|---|
| 1 అధోమ్నాయం | తార |
| 2 పూర్వామ్నాయం | భువనేశ్వరి |
| 3 దక్షిణామ్నాయం | బాల మహాత్రిపుర సుందరి |
| 4 ఊర్ధ్వామ్నాయం | |

ఈ ఆమ్నాయ నాయికలు ఉపామ్నాయలకు కూడా ఉంటాయి వీటిలో సప్తశతిలో వర్ణించినట్లుగా మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి చాముండ్యాది నాయికలు వరుసగా ఈశాన్య, ఆగ్నేయ, వాయవ్య, నైఋతి ఆమ్నాయాలకు నాయికలుగా ఉంటాయి. ఇంకా ఈ ఆరు ఆమ్నాయాలలో పూర్వామ్నాయం, దక్షిణామ్నాయం, పశ్చిమామ్నాయాల యొక్క పంచక్రమాలతో అంతర్గతంగా సృష్టి, స్థితి, సంహార క్రమాలలో కూడా భిన్న భిన్న చక్రాలు, ముద్రలు, దర్శనాలు, యోగినులు, సిద్ధులు, చక్రనాయికలు ఉంటారు. తమతమ ఆమ్నాయక్రమాల సమిష్టి చక్రంలో పూజాదులుంటాయి గనుక వీటికి వేరుగా చక్రాలు, ముద్రాదులుండవు. ఇదేవిధంగా అధోమ్నాయం, ఉత్తరామ్నాయం, ఊర్ధ్వామ్నాయాలకు కూడా సమిష్టిగా (బిందువునుండి భూపుర పర్యంతం) పూజాదులుంటాయి. ఆ కారణంగా ఈ ఆమ్నాయాలకు వేరువేరు ముద్రాదులండవు. కాని నిర్వాణవిద్య, శాంభవ, పాశుపతాదులు, షడామ్నయాలకు విడివిడిగా ఉంటాయి. ఆపైన అన్నిటికన్న ఆఖర్న బిందువునుండి బ్రహ్మరంధ్రం వరకూ పంచదశి, షోడశి, (సప్తదశి, అష్టదశి, మొదలైనవి – నిర్వాణసుందరి, సర్వాధికారశాంభవి, మహాపాదుక, అనుత్తరవాదిని, సర్వామ్నాయన సర్వాధికారిణి, సమయావిద్య షోడశచక్రేశ్వరి, సమయానిత్య, దశమహావిద్య, పంచ సింహాసన, పంచపంచక, షడామ్నాయ సమయ, నవరత్నకుబ్జిక, నవరత్నసుందరి, ఆలేఖని ఇత్యాది దేవతలన్నీ వచ్చి చేరతాయి.

ఇదే విధంగా సర్వామ్నాయాల్లోను ప్రత్యేక దేవతకు మూలమంత్రం, న్యాసం, ధ్యానం పంచాంగాలు (స్తోత్రాలు) మొదలైనవన్నీ ఉంటాయి వీటిలో పేర్కొన్న అలేఖినీవిద్య కాళీ రెండూ ఒకటే. ఆచార్యులు సుబోధకం చేయదానికి ఒకదానిని (అనులోమఃంగా, రెండవదానిని విలోమంగా) గ్రహించి విడివిడిగా పేర్కొన్నారు. అనగా శ్రీక్రమంలోని

అలేఖిని విలోమంగా కాళీక్రమంలో జపించబడుతుంది ఇదేవిధంగా పంచదశాది విద్యలలో పంచదశి (లఘుషోడశి) మూలదేవత అయినప్పుడు షోడశి చక్రనాయిక అవుతుంది అష్టాదశిమూల విద్య అయినప్పుడు సప్తదశి చక్రనాయిక అవుతుంది.

అటు తరువాత ఆమ్నాయక్రమాన్ని సమిష్టిగా సమన్వయించి ఆయా దీక్షానుగుణంగా పూర్ణాభిషేకం నుండి దివ్య సామ్రాజ్యమేధ వరకూ క్రమంగా పుష్పాంజలితో ప్రారంభించి పంచదశి, షోడశాది సర్వవిద్యాపూజలు బిందువులోనే జరుపబడతాయి

ఇంకా పైన పేర్కొన్న సమయావిద్య, సమయానిత్యాధి విద్యలన్నీ నిర్వాణోపాసనలో చేరి నిర్వాణవిద్యగా పరిణతమవుతాయి. అవి యథాక్రమంలో ఒకదానితో ఒకటి సమ్మిళితమై చివరకు ఒకానొక నిర్వహణవిద్య యేర్పడుతుంది ఇదంతా క్రమోపాసనగానే జరుగుతుంది.

ఉపాసనాక్రమం బ్రాహ్మీ ముహూర్తంలో మొదలై అర్ధరాత్రి వరకూ అనేక క్రియా కలాపాలతో కొనసాగుతుంది. ఈ క్రియాకలాపాల్లో మొట్టమొదటగా ప్రాతఃకృత్యం నిర్వర్తించబడుతుంది. అయితే ఈ ప్రాతఃకృత్యం కూడా ఆమ్నాయ భేదాన్నిబట్టి భిన్నపద్ధతులలో ఉంటుంది. సర్వామ్నాయాత్మక ప్రాతఃకృత్యం అనేది కూడా మరొకటి ఉంది. దీని తరువాత యథాక్రమంగా చక్ర, దేవతాది ధ్యానం నిర్వర్తించబడుతుంది. సర్వోత్తమ క్రమంలో ప్రాతఃకృత్యంలో చక్రధ్యానంతోపాటు ఆమ్నాయనాయికలకు కూడా ధ్యానం ఉంటుంది. అయితే దీనిలో ఆశ్రమభేదాన్నిబట్టి తేడాలుంటాయి. ప్రస్తుతక్రమంలో మూలవిద్యాధ్యాన సమయంలో మూలాధారంలో వాగ్భవకూటం, వాగధీశ్వరుల యొక్క చింతన ఉంటుంది. హృదయంలో కామరాజకూట కామేశిలను, ఆజ్ఞాచక్రంలో శక్తికూట ఆదిశక్తుల ధ్యానం ఉంటుంది. ఆ తరువాత బ్రహ్మరంధ్రంలోని మూలవిద్య శ్రీ మహాత్రిపుర సుందరీదేవిని ధ్యానించటం జరుగుతుంది. దానితోపాటుగా శరీరంలోని షట్చక్రాలలోని షడామ్నాయాలను కూడా ధ్యానించటం జరుగుతుంది అభేదచింతనలో మూలాధారం నుండి బ్రహ్మరంధ్రపర్యంతమూ బ్రహ్మవిద్యాభావన చేయబడుతుంది.

ఇదేవిధంగా ఈ ఉపాసనలో మాతృక, మాలిని, లఘుషోఢ, మహాషోఢాది అనేక న్యాసాలు చెప్పబడ్డాయి. వీటి ప్రయోగం (అనుష్ఠానం) వల్ల సాధకుడు దేవతాస్వరూపుడవుతాడు. అతడి శరీరం మంత్రమయమవుతుంది. అయితే వీటిలో మూలాన్యాసం, షోఢాన్యాసం వేరువేరు ఆమ్నాయనోపాసనలలో వేరువేరుగా ఉంటుంది.

# 14. రెండు రూపాలలో ఉపాసన

ఉపాసనా రూపాలు రెండువిధాలుగా ఉంటాయి ఒకటి "బాహ్య" మైనది కాగా రెండవది "అభ్యంతర"మైనది వీటినే వరుసగా 1 బహిర్యాగము, 2 అంతర్యాగము అనికూడా అంటారు.

ఆధ్యాత్మిక తత్త్వాలనే ఉపకరణాలుగా భావించి మానస పూజారూపంలో ధ్యానధారణాదికాలతో జరిపే ఆరాధన (పూజ) 'అంతర్యాగం' అనబడుతోంది ఇది భావనాత్మకంగా ఉంటుంది ఇది సాధారం, నిరాధారం అని రెండు విధాలుగా ఉంటుంది

బాహ్యంగా ఉండే భౌతిక ఉపకరణాదులతో పూజాదికాలు జరిపినట్లయితే దానిని 'బహిర్యాగం" అంటారు ఇది క్రియాత్మకంగా ఉంటుంది దీనిలో కూడా వైదికమని, తాంత్రికమని రెండు ముఖ్య భేదాలుంటాయి. సూత సంహితాది గ్రంథాలు ఈ విషయాలను విశేషంగా చర్చించాయి.

ఈవిధంగా శ్రీయంత్రంలో నిత్యనైమిత్తిక కామ్య, బహిర్యాగ, అంతర్యాగాది రూపాలలో అనేకవిధాలుగా శ్రీవిద్యోపాసన చేయబడుతుంది ఇంకా ఇందులో ధ్యానము యోగాత్మకంగా ఆభ్యంతరోపాసనగా జరిగినప్పుడు శరీరంలోనే శ్రీయంత్రాన్ని (ఉన్నట్లు) భావించి శ్రీయంత్రం యొక్క సంపూర్ణక్రమాన్ని శరీరగత (శారీరక) చక్రాలతో సమన్వయం చేసుకొని ఏకాత్మభావనతో శ్రీవిద్యోపాసన చేయబడుతుంది. ఇందులో మూలాధారం నుండి బ్రహ్మరంధ్ర పర్యంతరమూ, అధరాది ఆమ్నాయాలకు చెందిన తార, భువనేశ్వర్యాదులను యధాక్రమంగా ఒకదానితో ఒకటి త్రిపురసుందరీదేవిలో సంలీనం చేసినట్లయితే ఒకే ఒకరూపం యేర్పడుతుంది ఈ దశకు చేరిన తరువాత అంతంలో మండల దీక్షాక్రమం పరిసమాప్తమవుతుంది

ఈవిధంగా శ్రీవిద్యోపాసనాక్రమంలో అధోమ్నాయం నుండి ఊర్ధ్వామ్నాయం వరకూ ఉన్న క్రమోపాసనలలో ఉత్తరోత్తర శబ్దయోగం, మంత్రయోగం, భక్తియోగం, కర్మయోగం, జ్ఞానయోగం సిద్ధించి చిట్టచివరికి కేవల మోక్షరూపమైన పరమపురుషార్థప్రాప్తి కలుగుతుంది వీటిలో మంత్రయోగాదులు సిద్ధించగానే అంతరాయనివృత్తి, ఐహిక సుఖాలు అనాయాసంగా లభించటం ప్రారంభమౌతాయి. సాధన నిరాఘాటంగా ముందుకు సాగుతూంటుంది. క్రమంగా సాధన మునుముందుకు సాగి పరమపురుషార్థాన్ని సిద్ధింపజేస్తుంది. ఇదే ఈ ఉపాసన యొక్క ప్రధానఫలం. కాగా అన్యత్ర ఈ ఉపాసనా క్రమంలో లభించే ఏ సిద్ధులైనా అవి గౌణఫలాలే! అవి కేవలం నిర్వాణసాధనామార్గంలో

సహాయకారులుగా ఉండే సిద్ధులే! అలాకాకుండా ఏ సాధకుడైనా మధ్యలో అనుభూతమయ్యే స్వతఃసిద్ధులను ముఖ్య ఫలితాలుగా భావించడం ప్రారంభించినట్లయితే అతడు సాధనమార్గంలో దారితప్పుతాడు సాధకుడు చరమలక్ష్య సిద్ధికి దూరమైపోతాడు ఇది గ్రహించి తగు జాగరూకత వహించాలి

## 15. శ్రీ యంత్ర వివరణం

అతి ప్రాచీనకాలం నుండి భారతదేశంలో శ్రీవిద్యోపాసన ప్రచారంలో ఉంది శ్రీమచ్ఛంకరాచార్యులు, పరమగురువులు గౌడపాదస్వామి, వీరిలో స్వయంగా శంకరులు, సురేశ్వరాచార్యులు, పద్మపాదుడు, విద్యారణ్యస్వామి, ప్రభృత వేదాంతా చార్యులు శ్రీవిద్యోపాసకులుగా ప్రసిద్ధులు.

పది మహావిద్యలున్నట్లుగా మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి అవి 1 కాళి 2 తార 3. షోడశి 4. భువనేశ్వరి 5. ధూమావతి 6. ఛిన్నమస్త 7. త్రిపురభైరవి 8 బగళా 9. మాతంగీ 10. కమల.

ఈ మహావిద్యలు రెండు కులాలు (సముదాయం) గా విభజింపబడ్డాయి 1. కాళి కులం 2. శ్రీకులం.

కాళీకులంలో పదిమహావిద్యలలోని కాళి, తార, భువనేశ్వరి, ఛిన్నమస్త అనే నాలుగు విద్యలు ఉన్నాయి. ఇవే కాకుండా రక్తకాళి, మహిషాసురమర్దిని, త్రిపుర, దుర్గ, ప్రత్యంగిర అనే ఐదు విద్యలు కూడా కాళీ కులానికి చెందిన విద్యలుగా పరిగణింపబడుతున్నాయి



శ్రీకులంలో త్రిపురసుందరి (షోడశి), త్రిపురభైరవి, బగళ, కమల, ధూమావతి, మాతంగి, పదిమహావిద్యలలోనివి ఉన్నాయి ఇవిగాక బాల, స్వప్నావతి, మధుమతి అనే మరో మూడు విద్యలు కూడా శ్రీ కులానికి చెందిన విద్యలుగా పరిగణింపబడుతున్నాయి ఈవిధంగా 18 సిద్ధివిద్యలు ఉన్నాయి

పైన పేర్కొన్న దశమహావిద్యలలో మూడవదైన "షోడశి" మహావిద్యే శ్రీవిద్యా స్వరూపం సుందరి, లలిత, త్రిపురసుందరి అనే నామాలు శ్రీవిద్యకు పర్యాయనామాలుగా ప్రసిద్ధమై ఉన్నాయి

శ్రీయంత్రం అనగా శ్రీ యొక్క యంత్రము అని అర్థం అనగా గృహం లేదా ఇల్లు నియమపూర్వకమైన ధాతువు (లోహం)తో నిర్మించిన "యంత్ర" శబ్దం "నివాసం" అనే అర్థాన్ని ప్రకటిస్తోంది ఎందుకంటే "నివాసం"లోనే అన్ని వస్తువుల నియంత్రణ ఉంటుంది శ్రీయంత్రం యొక్క అవగాహనకు లేదా శోధనకు శ్రీయంత్రాన్నే ఆశ్రయించాల్సి ఉంటుంది శ్రీయంత్రోపయోగానికి, ఉపాసనకు యోగ్యమైనవి రెండే ఉన్నాయి. ఉపయోగకర వస్తువులను దాని అనుకూల స్థానంలోనే పరిశోధించడంవల్ల (వెదకటంవల్ల) సిద్ధి కలుగుతుంది

వాల్మీకి మహర్షి సీతాన్వేషణాతత్పరుడైన హనుమంతుడితో ఇలా చెప్పించాడు

"యస్య సత్వస్య యా యోనిస్తస్యాం తత్పరిమార్గ్యతే"

శంకరభాగవత్పాదులు కూడా యంత్రాన్ని ఉటంకిస్తూ – "తవ శరణకోణాః పరిణతాః" – ఈ వాక్యంలో యంత్రార్థంలో "శరణ" శబ్దమే ప్రయోగింపబడింది. ఈ వాక్యంవల్ల ఉత్తర దక్షిణ భారతంలో ఉన్న 'శ్రీనగరం' పేరుతో ఉన్న ప్రదేశాలకు సార్థకత యేర్పడింది అలాంటప్పుడు యావద్విశ్వమూ శ్రీవిద్యా నివాసమవుతుంది

భైరవ యామళతంత్రంలో "చక్రత్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరి" అని వ్రాయబడి ఉంది. అనగా ఓ ఈశ్వరీ! త్రిపురసుందరి యొక్క ఆధార చక్రము బ్రహ్మాండమే! (త్రిపురసుందరీదేవి యొక్క ఆధారచక్రము బ్రహ్మాండాకారములో ఉన్నది). "శ్రయతే యా సాశ్రీః" – అనగా శ్రయణం చేయబడేదే "శ్రీ" అని అర్థం. (ఆశ్రయింపబడేది యేదో అది శ్రీ అనబడునని భావం) ఉదాహరణగా చెప్పాలంటే – ప్రకాశము, ఉష్ణత (వేడిమి) అగ్నినుండి భిన్నం కానట్లుగానే అది లేకుండా నిలిచి ఉండనట్లే బ్రహ్మనుండి దాని శక్తి "శ్రీ" కూడా భిన్నంగా కాదు అలాగే దానినుండి ఎన్నటికి వేరు కాలేదు.

శ్రీ శంకరులిలా పేర్కొన్నారు

శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం ।
న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ॥

ఈ మహాశక్తి ప్రళయకాలంలో బ్రహ్మరూపం దాల్చి ఉంటుంది ఈ శక్తులన్నీ సమక్షాన లేని పక్షంలో ఆయనలో దానికి శక్తి వచ్చి చేరదు ఎందుకంటే ఆయన స్వయంగా నిర్గుణుడు, నిష్కలుడు, నిరంజనుడు

కాబట్టి ఈ విధమైన శ్రీసుందరీ యంత్రం (గృహం లేదా నివాసం) గురించి తెలుసుకోవడం అత్యావశ్యకం ఈ శ్రీయంత్రరూపం శ్రీత్రిపురసుందరి గృహంగాను, జాగ్రత్, స్వప్న, సుషుప్తి, ప్రమత, ప్రమేయ, ప్రమాణరూపంలో త్రిపురాత్మకంగాను, సూర్యచంద్రాగ్ని భేదంతో త్రిఖండాత్మకంగాను పేర్కొనబడింది

శ్రీచక్రం విశ్వమయమైనట్లుగానే శబ్దశక్తిలో మాతృకా మయంగా ఉంటుంది దీనినిబట్టి శ్రీయంత్రం బ్రహ్మాండ, పిండాండ స్వరూపంగా రూఢమైంది. శ్రీయంత్రంలో త్రికోణం, అష్టార, అంతర్దశార, బహిర్దశార, చతుర్దశార చక్రాలు అధోముఖ త్రికోణాలు, శక్తి చక్రాలు. అలాగే బిందు, అష్టదళ, షోడశదళ, భూపుర, చతురస్రాది చతుర్థ ఊర్ధ్వముఖ త్రికోణాలు శివచక్రాలు శ్రీ యంత్రం ఈ పంచశక్తి కోణాలు, నాలుగు శివకోణాలతో నిర్మితమైన తేజస్త్రయాత్మకమవటంవల్ల ((ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయరూపంలో పురత్రయాత్మకమై ఉంటుంది.) వీటిలో బిందు త్రికోణ, అష్టార అష్టదళరూపమైన ఆగ్నేయఖండం ప్రమాతృపురం దశారద్వయ, చతురస్ర రూపమైన సౌరఖండం ప్రమాణపురం అలాగే చతుర్దశార, షోడశదళరూపమైన చంద్రఖండం ప్రమేయపురం. ఈవిధంగా శ్రీయంత్రం పురత్రయాత్మకం ఇదేవిధంగా వామ, జ్యేష్ఠ, రౌద్రీ, (ఇచ్ఛ, జ్ఞాన, క్రియ) రూపంగా కూడా త్రితయాత్మకం నాద, బిందు, కళారూపంగా కూడా త్రిరూపాత్మకమైనది శ్రీయంత్రం. ఈ శ్రీయంత్ర శరీరస్థితమైన నవచక్రాలతో తాంత్రిక ఏకాత్మభావన ఈవిధంగా చేస్తారు

శరీరంలో సుషుమ్నానాడిని ఆశ్రయించి 32 పద్మాలున్నట్లుగానే శ్రీయంత్రంలో నవచక్రాలరూపంలో నవపద్మాలు ఉల్లేఖింపబడ్డాయి. సుషుమ్నానాడి యొక్క రెండు భాగాలలో ఊర్ధ్వ, అధోముఖంగా రెండు సహస్రాధారాలున్నాయి మధ్య ఈ క్రిందివిధంగా నవచక్రాలున్నాయి

| శరీరస్థానం | చక్రంపేరు | దళసంఖ్య | శ్రీచక్రనామం |
|---|---|---|---|
| 1 భ్రూమధ్యం | ఆజ్ఞాచక్రం | ద్విదళాలు | బిందువు |
| 2 లంబిక | ఇంద్రయోని | అష్టదళాలు | త్రికోణం |
| 3 కంఠం | విశుద్ధిచక్రం | షోడశదళాలు | అష్టకోణం |
| 4 హృదయం | అనాహతచక్రం | ద్వాదశదళాలు | అంతర్దశారం |
| 5 నాభి | మణిపురచక్రం | దశదళాలు | బహిర్దశారం |
| 6 యస్తి | స్వాధిష్ఠానచక్రం | షడ్దళాలు | చతుర్దశారం |
| 7 మూలాధారం | మూలాధారచక్రం | చతుర్దళాలు | అష్టదళపద్మం |
| 8 తద్ధోదేశం | కుళ | షడ్దరాలు | షోడశదళచక్రం |
| 9 తద్ధోదేశం | అకుళ | సహస్రదళాలు | భూపురచక్రం |

బ్రహ్మరంధ్రంలో ఉన్న మహాబిందువు సహస్రారం ఈవిధంగా శ్రీచక్రానికి, శరీర చక్రాలకి సమానత్వం (సారూప్యత) పరిపూర్ణంగా ఉంటుంది ఇదేవిధంగా మాతృకాచక్రానికి కూడా ఈ రెండు చక్రాలతో ఉన్న సారూప్యతను నిరూపించవచ్చు (సాధించవచ్చు). షోడశదళం, చతుర్దశారం ఈ రెండు స్వరమయాలు, దశారద్వయం 'క' నుండి 'న' వరకూ వింశతి వర్ణమయం. అష్టారం అంతస్థం, ఊష్మరూపమైనది చతురస్రం 'ప' నుండి 'మ' వరకూగల వర్ణమయము అష్టదళం అకచటతపాది వర్గాష్టకరూపమైనది. బిందువు సాకారరూపమైనది, త్రికోణం మకారరూపమైనది (మహాబిందువు క్షకార, మకార సమిష్టిరూపమైనది.) శరీరచక్రంలో కంఠంలో స్వరం హృదయంలో క నుండి 'ఠ' వరకూ,నాభిలో 'డ' నుండి 'ఫ' వరకూ, స్వాధిష్ఠానంలో 'బ' నుండి 'ల' వరకూ మూలాధారంలో 'వ' నుండి 'స' వరకూ ఆజ్ఞాచక్రంలో 'హ' నుండి 'క్ష' వరకూ వర్ణాలుంటాయి

శ్రీ యంత్రరచన రెండేసి త్రికోణాల పరస్పర సంయోగంతో జరుగుతుంది ఈవిధంగా ఇందులో తొమ్మిది త్రికోణాలుంటాయి ఇట్టి రచననుబట్టి శరీరంలో బ్రహ్మాండం, బ్రహ్మాండంలో శరీరంయొక్క పోలికను సూచితమవుతుంది. శ్రీయంత్రం సృష్టి, స్థితి ప్రళయాత్మకమైనదిగా భావింపబడింది ప్రకృతిస్వరూపంగా కూడా పరిగణింప బడుతుంది.

## 16. 'కుండలిని' అంటే ఏమిటి ?

మన శరీరం ప్రకృతి అంశ మాత్రంగా ఉన్న పంచతత్త్వాల కలయికతో యేర్పడింది మృత్యువు తరువాత శరీరం నశించినా ఈ తత్త్వాలు మాత్రం నశించవు అగ్ని అగ్నిలో జలం జలంలో, వాయువు వాయువులో, ఆకాశం ఆకాశంలో, మట్టి మట్టిలో కలిసిపోతుంది కేవలం నశించనిది, మరణించనిది, దహించబడనిది ఒక వస్తువు ఉన్నది అది ఈ శరీరాన్ని విడిచి వెళ్ళిపోతుంది, దానిపేరే "ఆత్మ".

## 17. ఆత్మ అంటే ఏమిటి?

ఈ విషయం ఆయా మతాలలో సంప్రదాయాలలో భిన్నభిన్న అభిప్రాయాలున్నాయి. వేదమతానుసారంగా ఆర్యుల ఆలోచన ప్రకారం దీనిని అజామరమైనదిగా భావిస్తారు వైదికధర్మానుసారం అది పరమాత్మలాగా ప్రకృతిలాగా అనాదియైనది. వేదాంతదర్శనం ఈ ఆత్మనే పరమాత్మగా, బ్రహ్మయొక్క అంశంగానే పేర్కొంటుంది వైదిక ధర్మావలంబులైన ఆర్యసమాజీయులు మాత్రం దీనిని బ్రహ్మ నుండి వేరైన అల్పజ్ఞ జీవిగా (జీవాత్మగా) భావిస్తారు. ఆ జీవి కర్మానుసారంగా జన్మించి, సుఖదుఃఖాలు అనుభవిస్తాడు.

ఇదే ఆత్మ తన వాస్తవికరూపాన్ని గుర్తుపట్టినప్పుడు (తెలుసుకొన్నప్పుడు) ఎంతటి శక్తిని పొందుతుంది? అనే విషయాన్ని యోగదృష్టితో విచారించాలి.

యోగంద్వారా, సాధన ద్వారా సాధకుడు అలౌకికశక్తుల్ని సంప్రాప్తించుకొంటాడు అలాంటి శక్తుల్ని చూడగానే సామాన్యజనులు ఆ సాధకుణ్ణి అవతారమూర్తిగా అందలం యెక్కించి కూర్చోబెడతారు ఇంకా కొంతమంది అతగాడిని మహానుభావునిగా, మహాపురుషుడిగా సిద్ధపురుషునిగా భావించి పూజించటం మొదలుపెడతారు

ఈ శక్తే "కుండలినీశక్తి". కుండలిని జాగృతమైనప్పుడే ఈ శక్తులన్నీ లభిస్తాయి

ఈ కుండలినిలో అద్భుతమైన శక్తి ఉంటుంది కుండలినీ శక్తి జాగృతమైన తరువాత శాంతంగా ఉండదు నిష్క్రియంగా అసలుండదు సరికదా సాధకుణ్ణి అపరిమిత శక్తులకు అధిపతిని చేస్తుంది.

యోగవిద్యకు సంబంధించిన గొప్ప గొప్ప ఆచార్యులు కుండలినియొక్క ఆకృతిని వివరించి చెప్పారు. కుండలిని సర్పాకారంలో చచ్చిపడున్న ఒక నాడిలాగా ఉంటుంది ఇదే శక్తి ప్రవాహానికి కారణభూతమై ఉంటుంది.

ఈ కుండలిని మేరుదండానికి (వెన్నెముక) చివరన క్రిందిభాగంలో నిద్రావస్థలో నిలిచి ఉంటుంది ఇది సర్పంలో మూడున్నరభాగాలు చుట్టచుట్టుకొని ఉన్నట్లు పడి ఉంటుంది సర్పాకారంలో దీనిని భావించటంవల్ల యోగులు దీనిని "కుండలిని" అని పేర్కొంటారు.

దీని క్రింద కొన సన్నగా ఉండి పై భాగం లావుగా వ్యాపించి ఉంటుంది అనగా సర్పం పడగ వెడల్పుగా తోక సన్నగా ఉన్నట్లుగా "కుండలిని" యొక్క ఆకృతి ఉంటుందని కొందరు యోగులు ఊహించి చెప్పారు

సర్పం చుట్టుబెట్టుకొని పడి ఉన్నప్పుడు శాంతంగా, జడంగా ఉంటుంది మేలుకోగానే చలనాన్ని పొందుతుంది ఇదేవిధంగా కుండలిని కూడా జాగృతమైనప్పుడు క్రియాశీలమైనదిగా అంటే చలనాన్ని పొందుతుంది పర్యవసానంగా సాధకునికి కొత్తకొత్త అనుభూతులు కలుగుతాయి విచిత్రమైన శక్తి, ఉత్సాహం పుట్టుకొస్తాయి

సర్పం చుట్టవిప్పుకోవడం మొదలుపెడితే కదలటానికి సిద్ధమవుతుందన్న మాట అప్పుడు దాని తోక దాని పడగకి దగ్గరవుతుంది నెమ్మది నెమ్మదిగా లేస్తుంది చుట్టలు విప్పుకుంటూ కదలడం ప్రారంభిస్తుంది సర్పం కదులుతూ చుట్టలన్నీ విప్పుకుంటుంది. ఈవిధంగానే సర్పాకారంలో ఉండే కుండలిని కూడా విప్పుకొని (తెఱచుకొని) ఊర్ధ్వముఖంగా చలనం ప్రారంభిస్తుంది మధ్యన ఉండే చక్రాలలో చిక్కుకొని వాటిని దాటుకొంటూ సుషుమ్నానాడికి సమాంతరంగా మస్తిష్కాభిముఖంగా ముందుకుసాగుతుంది ఇలా సాగి అది "సహస్రారాన్ని" చేరగానే పాము పడగలాగా విచ్చుకుంటుంది. తన ఉత్సాహశక్తితో తోకమీది బలంతో నిటారుగా నిలబడుతుంది. ఈవిధంగా కుండలినీ శక్తి తన గమ్యాన్ని (సహస్రార చక్రాన్ని) చేరడమే (యోగ) సాధన యొక్క లక్ష్యం

యోగం, సాధన అనేవి కుండలినిని జాగృతం చేయడానికి నిర్వర్తింపబడతాయి కుండలిని జాగృతం కాగానే దాని ఫలితం అవశ్యం లభిస్తుంది. దానియొక్క జాగరణం వృథాకాదు. మంచిదో, చెడ్డదో ఏదో ఒక ఫలితం (పరిణామం) తప్పక లభిస్తుంది

మౌనంగా పడివున్న ఈ కుండలినీశక్తి అనుచిత పద్ధతిలో సాధనచేసి వదిలిపెట్టినట్లయితే పరిణామం హానికరంగా ఉంటుంది. కాబట్టి కుండలినీ జాగరణం నియమానుసారంగా చేయాలి. అప్రమత్తంగా ఉండి యథోక్తవిధిని కుండలినిని జాగృతం చేసినట్లయితే సత్ఫలితాలు సిద్ధిస్తాయి.

ఈ కుండలిని బుద్ధి జ్ఞానాలకు నిధి ఇది జాగృతమైనప్పుడు యోగులకు అద్భుతశక్తులు సిద్ధిస్తాయి.

స్వామి వివేకానంద పేర్కొన్నట్లుగా - 'ఇద', 'పింగళ' అనే పేరుగల రెండు శక్తి ప్రవాహాలు వెన్నుపూస మజ్జకు మధ్య సుషుమ్న నాడి ఉన్నది దీనిమధ్య నుండి ఈ కుండలిని జాగృతమై ఊర్ధ్వముఖంగా ముందుకు సాగుతుంది ఈ 'సుషుమ్న' అనే శూన్యనాళం యొక్క క్రిందన 'కుండలిని'కి ఆధారభూతమైన పద్మం ఉంటుంది వివేకానంద స్వామి అనుభవజ్ఞులైన యోగి పుంగవులు దీనిని గురించి వివరణ ఇచ్చారని పేర్కొన్నారు యోగిపుంగవులు వివరణానుసారం కుండలినీశక్తి ఆ స్థానంలో కుండలాకారంలో (విరాజమానమై) ఉంటుంది ఈ కుండలిని జాగృతంకాగానే సుషుమ్న శూన్యనాళం గుండా మార్గాన్ని యేర్పరచుకొని ఊర్ధ్వముఖంగా ప్రయాణించదానికి ప్రయత్నిస్తుంది ఈ ప్రయాణంలో ఒక్కొక్క మెట్టు అధిరోహిస్తున్న కొద్దీ మనస్సు యొక్క పొరలు విప్పుకుంటూ పోతుంది. ఈ దశలో యోగులకు (సాధకులకు) అనేక విధాలయిన అలౌకిక దర్శనాలు (సాక్షాత్కారాలు) కలగడం ప్రారంభమౌతాయి. అద్భుతశక్తులు అందుబాటులోకి రావడం ఆరంభమౌతుంది. అప్పుడు సాధకుడు సంపూర్ణంగా శరీరంనుండి, మనస్సునుండి విడివడి ఆతడి ఆత్మ తన స్వేచ్ఛా స్వభావంయొక్క ప్రయోజనాన్ని పొందుతుంది

ఆంగ్లసంఖ్య '8' ని ఒకదానిమీద ఒకటి ఉంచుతూ పోయినట్లయితే ఎలా ఉంటుందో వెన్నుపూస మజ్జ కూడా అదేవిధమైన ఆకృతిలో మనకు కనిపిస్తుంది. వెన్నుపూస మజ్జకు ఎడమవైపున ఇడానాడి కుడివైపున పింగళనాడి ఉన్నాయి. మేరు మజ్జ మధ్యనుండి సాగే శూన్యనాళమే సుషుమ్ననాడి. కటి ప్రదేశంలోని వెన్నుపూసలోని కొన్ని ఎముకల తరువాతనే మేరుమజ్జ అంతమై ( సమాప్తమై) ఉంటుంది. కాని అక్కడనుండి దారం వంటి అతి సూక్ష్మమైన పదార్థాలు సమాంతరంగా అధోముఖంగా వెలువడి ఉంటాయి. సుషుమ్ననాడి అక్కడ కూడా ఉంటుంది. అయితే అక్కడ బహుసూక్ష్మ రూపందాల్చి ఉంటుంది క్రిందివైపున దాని నాళికారంధ్రం మూయబడి ఉంటుంది. దాని సమీపంలోనే కటి ప్రదేశంలోని నాడీ (నాళ) సముదాయం ఉంటుంది ఆధునిక శరీరధర్మశాస్త్ర ప్రకారం అది త్రికోణాకృతిలో ఉంటుంది. ఈ విధమైన విభిన్ననాడీ (నాళికా) సముదాయాలకు కేంద్రస్థానం మేరుమజ్జ యొక్క లోపలి భాగంలో ఉంటుంది. ఈ నాడీ సముదాయం యోగులను భిన్నభిన్న పద్మాలు లేదా చక్రాలకు కొనిపోతుంది.

అన్నిటికన్నా శరీరం యొక్క క్రిందిభాగంలో ఉండే మూలాధారం నుండి మస్తిష్కంలో ఉండే సహస్రారం లేదా సహస్రదళ పద్మంవరకూ కొన్ని కేంద్రాలు ఉంటాయని యోగిపుంగవులు వివరించి చెప్పారు మనం ఈ పద్మాలను పైన పేర్కొన్న నాడీసముదాయాలుగా గ్రహించినట్లయితే నేటి మన శరీరం ద్వారా సహజంగానే యోగి జనుల వచనాలు అవగతమవుతాయి

మన శరీరనాడుల లోపల రెండు విధాలయిన శక్తిప్రవాహాలుంటాయి అందులో ఒకదానిని "అంతర్ముఖి"అని రెండవదానిని "బహిర్ముఖి"గా చెప్పవచ్చు ఇందులో అంతర్ముఖీయమైన ప్రవాహము జ్ఞానాత్మకమైనది కాగా రెండవదైన బహిర్ముఖీయ ప్రవాహం గత్యాత్మకమైనది. ఇవి వరుసగా ఒకటి కేంద్రం వైపు ప్రయాణించేదిగా రెండవది కేంద్రం నుండి దూరంగా ప్రయాణించేదిగా పేర్కొనవచ్చు వీటిలో ఒకటి మెదడువైపు సమాచారాన్ని కొనిపోతుంది రెండవది మస్తిష్కం యొక్క వెలుపలి ప్రక్కన ఉన్న అంగసముదాయాలకు సమాచారాన్ని కొనిపోతుంది. అయితే ఆఖరికి ఈ రెండు ప్రవాహాలు మస్తిష్కంలో కలుసుకుంటాయి.

ఈ వెన్నుపూస మజ్జ మస్తిష్కాన్ని చేరి ఒకవిధమైన "వాల్వు"లో ఒక గోళాకార పదార్థంలో అంతమవుతుంది. మస్తిష్కంలో తేలియాడుతూ కలిసివుండకుండా మస్తిష్కంలో తేలుతూ ఉండే చలన పదార్థం ఒకటుంటుంది కనుకనే తలమీద తగిలే గాయం ఈ తరళ పదార్థంలో చెల్లాచెదరవుతుంది దీనివల్ల వాల్వువంటి అండాకార పదార్థానికి దెబ్బతగలదు. ఈ మహిమాన్విత విషయాన్ని అవగతం చేసుకోవాలి ఈ చక్రాలన్నింటిలో అన్నిటికంటె క్రిందిభాగాన ఉన్న మూలాధారచక్రం, మస్తిష్కంలో ఉన్న సహస్రార చక్రం, నాభి వద్ద ఉన్న మణిపురచక్రం ఈ మూడు చక్రాలకు సంబంధించిన విశేషమైన ధ్యాస ఉంచాలి

ఉచ్ఛ్వాస నిశ్వాస యంత్రాలను నియంత్రించే నాడీకేంద్రం, వాటి నాడీ ప్రవాహాలన్నింటిమీద ఎంతోకొంత అధిపత్యం కలిగిఉంటుంది. ఈ కేంద్రం ఛాతీకి సరిగ్గా వెనుకభాగంలో వెన్నుపూసలో ఉంటుంది. ఇది శ్వాస పీల్చుకొని వదిలిపెట్టే యంత్రాలను నియంత్రిస్తూ ఇతరమైన నాడీచక్రాలపై కూడా తన ప్రభావాన్ని చూపుతుంది. ఆవిధంగా ప్రాణాయామం ద్వారా శ్వాస నిశ్వాస యంత్రాలమీద, కేంద్రాలమీద ఆధిపత్యం వహించి సాధకులు కుండలాకార మూలాధారంలో ఉన్న కుండలిని జాగృతం చేస్తారు.

వైర్‌లెస్ ద్వారా సమాచారం ఒకచోటునుండి మరియొక చోటుకు చేరుతూ ఉన్నట్లుగానే ప్రకృతిలో కూడా అలాంటి చర్యలు జరుగుతుంటాయి. తంతులవంటి

ద్వారా మెదడు సమాచారాన్ని పంపుతూ, స్వీకరిస్తూన్నట్లుగానే అటువంటి పదార్థాలు సహాయం లేకుండానే శక్తి ప్రవాహాలను నడిపించవచ్చునని యోగులు పేర్కొన్నారు వెన్నుపూసలో ఉండే సుషుమ్ననాడి లోపల నాడీ ప్రవాహాన్ని గనక నడిపించినట్లయితే (ప్రవహింపజేసినట్లయితే) పైన చెప్పినది సాధ్యమవుతుంది మామూలు మనుషులలో సుషుమ్న క్రిందివైపున మూయబడి ఉంటుంది దానివల్ల ఏ పని జరగదు.

యోగులు ఈ విషయంలో చెప్పిన విషయాలను గమనిద్దాం ఈ సుషుమ్న నాడీ ద్వారాన్ని తెరిచి దానినుండి శక్తి ప్రవాహం లేదా నాడీ ప్రవాహాన్ని ప్రవహింపజేయడానికి (కదిలించడానికి) ఒక నిర్దిష్టమైన ప్రణాళిక ఉంది ఆ సాధనలో సఫలమైనట్లయితే నాడీప్రవాహాన్ని దానిలోపలనుండి కదిలించగలుగుతాయి బాహ్యావిషయ స్పర్శవల్ల ఉత్పన్నమైన ప్రవాహం ఏదైనా కేంద్రాన్ని సమీపించినప్పుడు ఆ కేంద్రంనుండి ఒక ప్రతిక్రియ ఉంటుంది స్వయంచాలిత కేంద్రాలలో ఆ ప్రతిక్రియలు పరిణామగతిలో ఉంటాయి కాని చైతన్యకేంద్రాలలో మొదట అనుభవం (అనుభూతి) తదుపరి కదలిక ఉంటుంది బాహ్యంగా ఎటువంటి క్రియ లేనప్పుడు అనుభూతులన్నీ స్వప్నంలోనే ఉంటాయి. విషయాభిఘాతాలద్వారా ఉత్పన్నమైన నాడీచలనాలు శరీరంలోని ఏదో ఒక ప్రదేశంలో అవశ్యం అవ్యక్తభావంలో ఉంటాయి ఎక్కడయితే విషయాభిఘాతంతో ఉత్పన్నమైన శక్తులు లేదా స్పందనలు చలత్ర్పవాహాలలోని అంశాలు లేదా సంస్కార సముదాయాలు కలిసిపోయి ఉంటాయో ఆ చోటు మూలాధారము ఆ "కుండలీకృత క్రియాశక్తి" నే "కుండలిని" అంటారు

గతిశక్తుల అవశిష్టాంశాలు కూడా ఇక్కడే కుండలీకృతమై ఉంటాయి. ఈ ప్రదేశంలోనే సంచితమై (గుమికూడి) ఉంటాయి

బాహ్యావిషయాలమీద సుదీర్ఘకాలం చింతన మననాలవల్ల మూలాధారంలో వేడిమి గలగటం చూడవచ్చు.

ఈ కుండలినీ శక్తి జాగృతంచేసి సుషుమ్ననాడిద్వారా ప్రవహింపచేస్తూ ఒక కేంద్రం నుండి మరొక కేంద్రం పైకి తీసుకొని వచ్చినట్లయితే, ఆ శక్తి భిన్నభిన్న కేంద్రాలమీద చూపించే క్రియలకనుగుణంగా బలీయమైన ప్రతిక్రియలు మనకు కనిపిస్తాయి.

కుండలినిశక్తి యొక్క సాధారణరూపమైన అంశం ఏదేని నాడీ తంత్రిలోపల ప్రవహిస్తూ విభిన్న కేంద్రాలనుండి ప్రతిక్రియలను ఉత్పన్నంచేసినట్లయితే, అది "స్వప్నం" లేదా "కల్పన" అనే పేరుతో అభివ్యక్తం అవుతుంది. కాని మూలాధారంలో కేంద్రీకృతమైన అపారశక్తి భాండారం అద్భుతమై సుషుమ్ననాడిలో పయనిస్తూ విభిన్న కేంద్రాలను

ఢీకొన్నప్పుడు కలిగే ప్రతిక్రియలు అత్యంత బలీయంగా ఉంటాయి (శక్తిమంతంగా ఉంటాయి) అప్పుడు ఆ స్వప్నం లేదా కల్పనాకాలీనశక్తితో ఆనంతమైన ప్రతిభ శ్రేష్ఠగా ఉంటుంది ఇదే అతీంద్రియానుభూతి

ఇదే శక్తి మెదడు వరకూ వచ్చి చేరితే పూర్తిగా మెదడులోను, మెదడులోని ప్రతి పరమాణువులోను ప్రతిస్పందన మొదలవుతుంది దీని పరిణామమే 'జ్ఞానోదయం' అది జ్ఞానంయొక్క పరిపూర్ణ ప్రకాశం. అదే ఆత్మానుభూతి కుండలినీశక్తి ఒక కేంద్రంనుండి మరొక కేంద్రం వరకూ చేరినప్పుడు ఒక్కొక్క తెర తొలగుతూ పోతుంది అప్పుడు యోగి ఈ జగత్తు యొక్క సూక్ష్మ లేదా కారణావస్థయొక్క ఉప ప్రయోజనం పొందుతాడు. సర్వవిషయాల యొక్క పరిపూర్ణజ్ఞానం కలుగుతుంది

ఈవిధంగా కుండలినిని జాగృతంచేయడమే తత్త్వజ్ఞానం, జ్ఞానాతీతమైన అనుభూతికి ఏకైక ఉపాయం

కుండలినీ జాగరణానికి అనేక ఉపాయాలున్నాయి. ఒక వ్యక్తిలోని కుండలిని భగవంతుని యందు ఉండే అపారమైన ప్రేమవల్ల జాగృతమవుతుంది ఒక సిద్ధపురుషుని కృపవల్ల కూడా అది జాగృతమవుతుంది. ఒక్కోసారి సూక్ష్మజ్ఞాన విచారం ద్వారా కూడా కుండలిని జాగృతమవుతుంది ప్రజలు పేర్కొనే అలౌకికశక్తి లేదా జ్ఞానము ఎక్కడయినా గోచరించినట్లయితే అక్కడ పరిణామ క్రమంలో కుండలినీశక్తి సుషుమ్నానాడి లోపల ఏదో విధంగా ప్రవేశించిందని గ్రహించాలి.

ప్రతి మనిషిలోపల ఈ ప్రకృతి సజీవశక్తిగా ఉంటుంది. ఇది అనంతజ్ఞానానికి, సుఖశాంతులకు జనని. ఇదే నిద్రించి ఉన్న బిందువు ఇదే కుండలిని. ఇది జాగృతమైనప్పుడు మనిషిని దేవతాస్వరూపునిగా, సిద్ధపురుషునిగా, మహాపురుషునిగా తయారుచేస్తుంది.

**సాలోక్యం తవపూజనే; శివమహాదేవేతి సంకీర్తనే,**
**సామీప్యం, శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే.**
**సారూప్యం; చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతేః,**
**సాయుజ్యం మమ చిత్రమత్ర భవతి స్వామిన్ కృతార్థో ౾స్మ్యహమ్.**

**- శివానందలహరి**

# శ్రీ యంత్రం లోని చక్రాలతో శరీరంలోని చక్రాలకు సమన్వయం

మానవశరీర రూపంలో ఉన్న పిండాండం విశాలబ్రహ్మాండానికి ప్రతిరూపం అలాగే శ్రీయంత్రం బ్రహ్మాండానికి ప్రతీకగా నిలుస్తుంది ఈ విశ్వాన్ని నడిపించే శక్తులన్నీ మానవశరీరంలో కూడా ఉన్నాయి మనుష్యశరీరంలో రాశులస్థితి జన్మకాలాన్ని బట్టి ఉంటుంది శ్రీమద్భాగవతంలో (ద్వితీయస్కంధం ఐదవ అధ్యాయంలో) బ్రహ్మాండ రూపంలో ఉండే శరీరాన్ని గురించిన వర్ణన ఉన్నది నడుము పైభాగంలో ఏడులోకాలు, నడుముకు దిగువభాగంలో ఏడులోకాలు ఉన్నట్లుగా వర్ణింపబడింది ఇవే సుప్రసిద్ధమైన పదునాల్గులోకాలు

ఊర్ధ్వంగా ఉండే సప్తలోకాలే గాయత్రీ సప్తకంగా వ్యవహృతమై ఉన్నాయి వీటినే మరోరూపంగా మూలాధారాది షట్చక్రాలుగా సహస్రార చక్రంగా పిలుస్తారు శ్రీయంత్రంలోని చక్రాలతో ఈ చక్రాలకు ఎలాంటి సంబంధం ఉన్నదో వరుసగా స్పష్టంగా తెలుసుకోవచ్చు వీటి సమన్వయాన్ని వివరణ ద్వారా వివరంగా పరిశీలిద్దాం. దీనిని "కుండలినీయోగం" అని 'లయయోగం' అని కూడా అంటారు.

భూమండలానికి ఆధారం మేరుపర్వతంగా వర్ణించబడింది అదేవిధంగా మానవశరీరానికి ఆధారం మేరుదండం అనగా వెన్నెముక. మేరుదండం 33 అస్థిఖండాల కలయితకతో ఏర్పడి ఉంది. (బహుశ: ఈ సంఖ్య ముప్పయి మూడు కోట్ల దేవతల యొక్క సంఖ్య కావచ్చు.) దీనిలోపలంతా బోలుగా ఉంటుంది. దీని కింది భాగము మొనదేలి చిన్నదిగా ఉంటుంది ఈ మొనభాగం సమీపంలోని భాగాన్ని 'కంద' అంటారు ఈ కందంలోనే జగదాధారభూతమైన మహాశక్తికి ప్రతిరూపమైన కుండలినీ నివాసం ఉంటుందని భావిస్తారు

ఈ శరీరంలో 76 వేల నాడులున్నట్లుగా చెప్పబడింది వీటిలో ముఖ్యమైన నాడులు పదునాలుగు ఉన్నట్లు చెబుతారు. ఇంకా వీటిలో కూడా మూడు అతి ప్రధాన నాడులున్నాయి. అవి 1. ఇడ 2. పింగళ 3. సుషుమ్ననాడులు. ఇడానాడి వెన్నెముకకు ఎడమవైపున పింగళనాడి కుడివైపున అంటుకొని ఉంటాయి సుషుమ్ననాడి వెన్నెముక లోపలి కందభాగంనుండి ప్రారంభమై కపాలలో ఉండే సహస్రదళ పద్మంవరకూ వ్యాపించి ఉంటుంది అరటిస్తంభంలో ఒకటి తరువాత ఒకటి దొప్పలున్నట్లుగా ఈ సుషుమ్ననాడి

లోపలిభాగంలో కూడా వరుసగా వజ్రం, చిత్రిణి, బ్రహ్మనాడి అనేవి ఉంటాయి. యోగక్రియలద్వారా జాగృతమైన కుండలినీశక్తి ఈ బ్రహ్మనాడి ద్వారా కపాలంలోని బ్రహ్మరంధ్రం వరకూ (ఈ ప్రదేశంలో కపాలంయొక్క అన్ని ఎముకలు ఒకేచోట కలుసుకొని ఉంటాయి. దీనిమీద శిఖ ఉంటుంది ) ప్రయాణించి తిరిగి వస్తుంది

వెన్నెముకలోని బ్రహ్మనాడిలో ఆరు పద్మాలు దండ గుచ్చినట్లుగా ఊహించబడింది. ఇవే షట్చక్ర పద్మాలు ప్రతి పద్మంలో భిన్న సంఖ్యల్లో దళాలుండి అవి భిన్నవర్ణాలలో ఉంటాయి. ఈ ఆరుచక్రాలు ఏ అవయవానికి ముందు వెన్నెముక లోపలిభాగంలో ఉంటాయో ఆ అవయవం పేరుతో ఇవి పిలువబడతాయి. ఈ చక్రాలన్నీ శ్రీయంత్ర సాధనలో (శ్రీ విద్యోపాసనలో) ప్రముఖపాత్ర వహిస్తాయి.



మూలాధార చక్రం

**1. మూలాధారచక్రం :** శ్రీయంత్రంలో దీని స్థితిని (ఉనికిని) అష్టదళంగా చెప్పబడింది. మానవశరీరంలో దీని ఉనికి వెన్నెముక (చిట్టచివరి) క్రిందిభాగంలో గుదానికి లింగానికి మధ్యభాగంలో ఉంటుంది. ఈ చక్రం యొక్క పద్మం రక్తవర్ణంలో ఉండి నాలుగు దళాలు కలిగి ఉంటుంది. ఈ దళాలమీద "వం"; "శం", "షం", "సం" అనే వర్ణాలు ఉన్నట్లుగా భావించబడింది. ఈ యంత్రం చతుష్కోణాలతో ఉండి పృథ్వీతత్త్వాన్ని సూచిస్తుంది. ఈ యంత్రం యొక్క రంగు పసుపురంగు "లం" బీజం. ఈ బీజం యొక్క వాహనం ఐరావతం. ఈ యంత్రం యొక్క దేవత (దేవుడు) బ్రహ్మ, శక్తి, దాకిని. ఈ యంత్రం నడుమభాగంలో స్వయంభూలింగం ఉంటుంది.

దీనికి నాలుగు వైపులా మూడున్నర చుట్టలతో చుట్టుకొని సర్పాకారంలో తోకను తన పడగలో దాచుకొని ఉన్న సుప్త కుండలినీ శక్తి ఉంటుంది. ప్రాణాయామంలో జాగృతమై ఈ కుండలినీ శక్తి విద్యుల్లతారూపంలో వెన్నెముక లోపలిభాగంలోని బ్రహ్మనాడిలో ప్రవేశించి ఊర్ధ్వంగా పయనిస్తుంది.

**2. స్వాదిష్ఠాన చక్రం :**



స్వాధిష్ఠాన చక్రం

శ్రీయంత్రంలో ఇది చతుర్దశార చక్రంలో చెప్పబడింది. శరీరంలో ఈ చక్రం ఉనికి లింగప్రదేశానికి ముందు ఉంటుంది దీని పద్మం సిందూరవర్ణంలో ఉండి షడ్దళాలతో ఉంటుంది ఈ పద్మదళాలమీద 'వం', 'భం', 'మం', 'యం', 'రం', 'లం' వర్ణాలు ఉన్నట్లుగా భావింపబడింది ఈ చక్రం యొక్క యంత్రం జలతత్త్వాన్ని సూచిస్తూ అర్థచంద్రాకారంగా ఉంటుంది చంద్రునిలా శుభ్రవర్ణంలో ఉంటుంది ఈ యంత్రబీజం "వం" – దీని వాహనం మకరం ఈ యంత్రబీజం దేవ దేవీశక్తులు విష్ణువు, శాకిని

**3. మణిపురచక్రం :** శ్రీయంత్రంలో దీని ఉనికి బహిర్దశారచక్రంగా చెప్పబడింది శరీరంలో ఈ చక్రం యొక్క ఉనికి నాభికి ముందు వెన్నెముక లోపల ఉంటుంది. ఈ చక్ర కమలం నీలివర్ణంలో ఉండి దశ దళాలతో ఉంటుంది ఈ దళాలపై డం, ఢం, ణం, తం, థం, దం, ధం, నం, పం, ఫం – అనే అక్షరాలు భావింపబడి ఉన్నాయి. ఈ చక్ర యంత్రం త్రికోణాత్మకమై అగ్నితత్త్వాన్ని సూచిస్తూ ఉంటుంది దీని మూడు పార్శ్వాలలో ద్వారాలలాగా శుభచిహ్నాలుంటాయి యంత్రం యొక్క రంగు బాల రవిబింబ సదృశంగా ఉంటుంది ఈ యంత్రబీజాక్షరం "రం" దీని వాహనం మేషం యంత్రం దేవత వృద్ధరుద్రుడు కాగా శక్తి లాకిని



మణిపుర చక్రం

**4. అనాహతచక్రం :** శ్రీయంత్రంలో ఈ చక్రం ఉనికి అంతర్దశారచక్రంలో చెప్పబడింది శరీరంలో ఈ చక్రం హృదయా నికి ముందు ఉంటుంది. ఈ చక్రం అరుణ వర్ణంలో ద్వాదశదళయుత కమలంతో యేర్పడి ఉంటుంది దళాలపైన



అనాహత చక్రం

కం, ఖం, గం, ఘం, ఙం, చం, ఛం, జం, ఝం, ఞం, టం, ఠం అనే అక్షరాలు భావింపబడి ఉన్నాయి ఈ చక్ర యంత్రం ధూమ్రవర్ణంలో షట్కోణంగా ఉంటుంది ఇది వాయుతత్త్వాన్ని సూచిస్తుంది యంత్రబీజం "యం" కాగా దాని వాహనం మృగం (జింక). యంత్ర దేవదేవీశక్తులు ఈశానరుద్రుడు, కాకిని

ఈ చక్రం మధ్యలో శక్తి త్రికోణం ఉంటుంది విద్యుత్తులాంటి కాంతి దీనిలో వ్యాప్తమై ఉంటుంది ఈ త్రికోణానికి కట్టబడి స్వర్ణకాంతులీనే శివలింగం ఉటుంది దీని పేరు 'బాణం' దీనిపైన ఒక ఛిద్రం (రంధ్రం) కూడా ఉంటుంది ఈ ఛిద్రం నుండి (ప్రాదుర్భవించి) అష్టదళ పద్మం ఉంటుంది దీనిని "హృత్పుండరీక పద్మం" అంటారు ఈ హృత్పుండరీకంలో (హృదయపద్మంలో) ఉపాస్యదైవం ధ్యానింపబడతాడు



విశుద్ధ చక్రం

**5. విశుద్ధ చక్రం :** శ్రీయంత్రంలో అష్టకోణంలో దీని ఉనికి పేర్కొనబడింది శరీరంలో దీని స్థానం కంఠంలో ఉంటుంది. ఈ చక్ర పద్మం ధూమ్రవర్ణంలో ఉంటుంది. షోడశ దళాలతో ఉండి, ఈ దళాలపై అ నుండి అః వరకూ 16 వర్ణాల స్థితి భావింపబడుతుంది. ఈ చక్ర యంత్రం పూర్ణచంద్రాకారంగా ఉండి పూర్ణచంద్ర ప్రభలతో వెలుగొందుతూ ఉంటుంది ఈ యంత్రం శూన్యాన్ని లేదా అకాశతత్త్వాన్ని సూచిస్తుంది యంత్ర బీజాక్షరం 'హం' కాగా దాని వాహనం ఏనుగు. యంత్ర దేవీదేవతలు పంచవక్త్ర సదాశివుడు, శాకిని



ఆజ్ఞా చక్రం

**6. ఆజ్ఞాచక్రం :** శ్రీయంత్రంలో ఈ చక్రం యొక్క ఉనికి బిందువులో చెప్పబడింది. శరీరంలో దీని స్థానం వెన్నెముకలోని బ్రహ్మనాడిలో ఉంటుంది ఈ చక్ర కమలం శ్వేతవర్ణంలో ద్విదళయుక్తమై ఉంటుంది ఈ రెండు దళాలపైన 'హం' 'క్షం' అనే అక్షరాలు భావింపబడి ఉంటాయి ఈ చక్ర యంత్రం విద్యుత్ప్రభాభరితమై 'ఇతర' అనే అర్ధనారీశ్వర లింగాన్ని కలిగి ఉంటుంది. ఈ యంత్రం మహత్తత్త్వానికి నెలవుగా ఉంటుంది. ఈ యంత్రబీజం ప్రణవం (ఓంకారం) బీజవాహనం నాదం దానిపైన బిందువు కూడా ఉంటుంది. యంత్రదేవత పైన పేర్కొన్న మహత్తర లింగం శక్తి హాకిని.


సహస్రార పద్మదళం

ఈ షట్చక్రాల అనంతరం వెన్నెముక ఊర్ధ్వశిఖరంమీద సహస్ర దళయుక్తమైన "సహస్రార చక్రం" ఉన్నది ఇక్కడ పరమశివుడు వసించి ఉంటాడు దీని వెయ్యిరేకులమీద ఇరవైయేసి ప్రత్యేక స్వరాలు, వ్యంజనాలు ఉన్నట్లుగా భావించబడింది సహస్రారంలోని పరమశివునితో కుండలినీశక్తి సంయోగం చెందటమే లయయోగం యొక్క లక్ష్యం ఇది అత్యంత గహనమైన విషయం అయినప్పటికి సారాంశమేమంటే - కుండలినీ యోగాన్ని సద్గురువు సన్నిధిలో ఆయన పర్యవేక్షణలోనే అభ్యసించాలి తప్ప కేవలం గ్రంధాలమీద ఆధారపడి అభ్యాసం చేయరాదు. అలా చేసినట్లయితే కీడుకొని తెచ్చుకొన్నట్లవుతుంది. జీవనం మంటగలిసిపోతుంది ఏ కొద్దిపాటి పొరపాటు జరిగినా అపరిపక్వ సాధకుడు పిచ్చివాడైపోయే ప్రమాదం ఉంది. లేదా మృత్యు ముఖానికిచేరే పరిస్థితి కూడా సంభవించవచ్చు గౌతమబుద్ధుని అనేక విగ్రహాలలో తలపైన ఉంగరాల జుట్టును మీరు గమనించే ఉంటారు. నిజానికి అవి కేశాలు కాదు సహస్రార కమలంలో ఉండే సహస్రదళాలు (వెయ్యిరేకులు)


మూలాధారం నుండి
సహస్రారం వరకు చక్రదర్శనం

జర్మనీదేశంలో 'గిఖతేల్' అనే పేరుగల దార్శనికుడైన క్రైస్తవుడు 17వ శతాబ్దిలో పాశ్చాత్యయోగి మండలిలో (Rosicrucian Society) లో ప్రసిద్ధుడుగా ఉండేవాడు. అతడికి అతని దేహంలో ఈ షట్చక్రాల దర్శనం అయ్యింది. దాని ఆధారంగా అతడు ఈ చిత్రాన్ని తయారుచేశాడు.

ఈ విద్వాంసుడు ఈ చక్రాలకు క్రమంగా (మూలాధారం నుండి సహస్రారం వరకూ) చంద్ర, బుధ, శుక్ర, సూర్య, అంగారక, బృహస్పతి శనిలతో సంబంధం ఉన్నట్లుగా పేర్కొన్నాడు

# శ్రీ యంత్ర స్వరూపం

తాంత్రిక ఉపాసనలో యంత్రాలు, మంత్రాల యొక్క ప్రాచుర్యంతో విశేష ప్రయోజనాన్ని పొందవచ్చు యంత్రాన్ని దేవతా శరీరంగా భావిస్తే మంత్రం దాని ఆత్మగా భాసిస్తుంది యంత్రనిర్మాణంలో బిందువు, రేఖలు, త్రికోణాలు, వృత్తాలు మొదలైనవాటి వాడకం ఉంటుంది ఈ కారణంగానే రేఖాగణితంలోని రహస్య విషయాలకు అంతటి మహిమ ఉన్నది యునానీ శాస్త్రజ్ఞుడైన ప్లేటో తన పారశాల భవనద్వారంమీద 'రేఖా గణితం తెలియని విద్యార్థికి ఈ పారశాలలో ప్రవేశం లేదు' అని రాసిన బోర్డు తగిలించాడు ఒక విశిష్టమైనక్రమంలో, విశిష్టమంత్రయుక్తంగా ఏ దేవతనైనా ధ్యానించటంవల్ల ఆ దేవతయొక్క విశిష్టయంత్రం సాధకునికి స్థూలరూపంలో అంతరిక్షంలో దృగ్గోచరమవుతుందని కొందరు విద్వాంసులు పేర్కొన్నారు ఈ జడమైన యంత్రమే మంత్రసహితంగా చైతన్యవంతమై సిద్ధిపొందినప్పుడే మంత్రయంత్రాధిదేవత సాకార రూపంలో పరిణతమవుతుంది ఆ సాకార దేవతాస్వరూపం ధ్యానస్థితిలో మనం గమనించినట్లుగానే మనకు దర్శనమిస్తుంది ఈ విషయం అత్యంత గహనమైనది. అధ్యయనం లేకుండా అనుభవవిహీనంగా అవగతమవటం చాలాకష్టం. కాబట్టి ఇలాంటి గ్రంథాలను చదివి అర్థంచేసుకొని తదనంతరం సద్గురువు సన్నిధిలో దీక్షను గైకొని శ్రీయంత్రసాధన లేదా శ్రీవిద్యోపాసన చేయాలి ఆవిధంగా ప్రారంభించినట్లయితే బహుస్వల్ప కాలంలోనే సిద్ధి పొందవచ్చుననటంలో ఎలాంటి ఆశ్చర్యం ఉండదు.అయితే ఈ సిద్ధి పొందటానికి మానసికంగా దృఢనిశ్చయం శ్రద్ధ అత్యంతావశ్యకం.

ఒక సాధకుడు ఏదేని సాధనలో ఒక ఇరవై సంవత్సరాలపాటు ఉన్నాడనుకొందాం. 21వ సంవత్సరంలో ఆ సాధనలో ఇంకా శంకలు కలిగితే ఆ క్షణాన ఆ ఇరవై సంత్సరాల సాధనయొక్క ప్రభావం అతడికి శూన్యమనే మనం భావించవచ్చు. కాబట్టి ప్రప్రథమంగా సంపూర్ణశ్రద్ధతో సాధన ఆరంభించాలి దేశవిదేశాలలో శ్రీయంత్రమహిమ విస్తృత ప్రచారంలో ఉండి దానియొక్క అద్భుత ప్రచారాన్ని ఎందరో ప్రత్యక్షంగా అనుభవంలోకి తెచ్చుకొంటున్నారు. కొన్ని పారిశ్రామిక కుటుంబాలలో శ్రీయంత్రానికి ప్రాణప్రతిష్ఠ చేయించుకొని దానిని తమ యింట భక్తిశ్రద్ధలతో ప్రతిష్ఠ చేయించుకొంటున్నారు కూడా. వారంతా బహుస్వల్పకాలంలోనే మంచి ఫలితాలను పొందుతున్నారు వర్తమానకాలంలో శ్రీయంత్రాన్ని సేవించడం అనివార్య కార్యంగా భావిస్తున్నారు

మానవశరీరం ఈ విశాల బ్రహ్మాండ స్వరూపం అనగా ఈ విశాలవిశ్వంలో ఎన్నెన్ని శక్తులు, విభూతులు సంచలనం చేస్తున్నాయో అవన్నీ (పిండాండంలో) మానవ శరీరంలోనూ ఉన్నాయి తాంత్రిక ఉపాసనకు అసలైన ధ్యేయం అద్వైత సిద్ధియే తాంత్రికోపాసకుడికి సమస్తవిశ్వం ఇష్టదేవతామూర్తిగా ఉంటుంది ఈ కారణంగానే ఈ విశ్వమంతా ఉపాస్యదేవతా స్వరూపంగా తదుపాసకుడికి గోచరిస్తుంది. ఈ తాదాత్మ్య యంత్రాలద్వారా జరుగుతుంది ఈ అనుభవాన్ని ఉద్దేశించే - 'దేవోభూత్వా దేవాన్ యజేత్' అని చెప్పబడింది దేవుడయ్యి దేవతలను ఆరాధించాలి

ఇదివరకు మనం చూసిన సువిఖ్యాత శ్రీయంత్రం భగవతి త్రిపురసుందరీదేవి యొక్క యంత్రం దీనిని యంత్రరాజమని, సర్వశ్రేష్ఠ యంత్రమని అంటారు. ఈ యంత్రంలో సమగ్ర బ్రహ్మాండం యొక్క ఉత్పత్తి వికాసాలు విశదీకరింపబడ్డాయి. దానితోపాటే ఈ యంత్రం సాధకుని శరీరానికి ప్రతీకగా ఉంటుందని కూడా తెలుసుకొన్నాం ఈ యంత్ర క్రమాలను, మహిమను వివరిస్తూ అనేక గ్రంథాలు వ్రాయబడినా, కొన్ని ముద్రింపబడినా ఇప్పుడవి దొరకడం లేదు.

శ్రీయంత్రంలో ఉండే అన్నిటికన్నా లోపలి వృత్తంలోని వృత్తకేంద్రం నలువైపులా తొమ్మిది త్రికోణాలున్నాయి. వీటిలో ఐదు త్రికోణాలు ఊర్ధ్వముఖంగాను, నాలుగు అధోముఖంగాను ఉంటాయి ఊర్ధ్వముఖమైన ఐదు త్రికోణాలు, 'దేవి'కి ప్రతీకలు. వీటిని 'శివయువతులు' అంటారు అధోముఖమైన నాలుగు త్రికోణాలు 'శివుణ్ణి' సూచిస్తాయి వీటిని 'శ్రీకంఠాలు' గా పిలుస్తారు. ఐదు శక్తి త్రికోణాలు బ్రహ్మాండపరంగా పంచ మహాభూతాలు, పంచతన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ ప్రాణాలు మొదలైన వాటిని సూచిస్తాయి. మానవశరీరంలో ఈ పంచ త్రికోణాలు త్వక్కు, అసృక్కు, మాంసము, మేధ అస్థిరూపంలో ఉంటాయి మిగిలిన నాలుగు శివ (పురుషవాచి) త్రికోణాలు బ్రహ్మాండంలో చిత్, బుద్ధి, అహంకారం, మనోరూపాలలో ఉన్నాయి. పిండాండంలో ఇవి మజ్జ, శుక్రం, ప్రాణం, జీవరూపంలో ఉంటాయి.

దీని ప్రథమ చిత్రం సృష్టిక్రమానికి సంబంధించినది సమయ మతస్థులు దీనిని పూజిస్తారు ఆది శంకరులు ఈ మతావలంబకులు. అందుచేతనే వారి ప్రతి మఠంలో ఈ యంత్రం ఈవిధంగానే ప్రతిష్ఠితమై కనిపిస్తుంది. రెండవ క్రమమైన సంహార క్రమానుసారం - తయారుచేయబడిన శ్రీయంత్రాలలో పంచశక్తి కోణాలు అధోముఖంగా గీయబడి

ఉంటాయి చతుర్ధశివకోణాలు ఊర్ధ్వముఖంగా ఉంటాయి సంహారక్రమాను సారం నిర్మించిన శ్రీయంత్రం రెండవది ( ) సంహారక్రమానుసారమైన శ్రీయంత్రాన్ని కాశ్మీరీ సంప్రదాయానికి చెందిన కౌళ మతస్థులు పూజిస్తారు

పైన పేర్కొన్న నవ త్రికోణాలు శివుని నవ మూలప్రకృతులను సూచిస్తాయి. ఈ తొమ్మిది త్రికోణాల సమ్మిశ్రణంవల్ల నలభైమూడు చిన్నచిన్న త్రికోణాలు యేర్పడతాయి అంతర్వృత్తం వెలుపల అష్టదళకమలం ఉంటుంది దాని వెలుపల షోడశదళ పద్మం వీటన్నిటికి ఆవల భూపురం ఉంటాయి వీటిని గురించి శంకరకృత సౌందర్యలహరి ఇలాపేర్కొంది –

చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పంచభిరపి ।
ప్రభిన్నాభిః శంభుర్నవభి రపి మూలప్రకృతిభిః ॥
త్రయ చతురశ్చత్వారిం శ ద్వసుదళ కళాబ్జ త్రివలయ త్రిరేఖః ।
త్రిరేఖభిః సార్ధం తవ భవనకోణాః పరిణతాః ॥

యంత్రగతమైన నవచక్రాల గురించి 'రుద్రయామళ తంత్రం' అనే గ్రంథంలోని ఈ శ్లోకం ఇతోధికంగా ఉల్లేఖించింది –

బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మం
మన్వస్త్ర నాగదలసంయుత షోడశారమ్ ।
వృత్తత్రయం చ ధరణీసదనత్రయం చ
శ్రీచక్రరాజముదితమ్ పరదేవతాయాః ॥

అనగా ఈ శ్రీయంత్రంలోని నవచక్రాలు ఈక్రింది క్రమానుసారం ఉన్నాయి.

1. **బిందువు లేదా మహాబిందువు :** మూలకారణ, మహాత్రిపురసుందరి, కామేశ్వర కామేశ్వరీ సామరస్యం (సమ్మేళనం) జగత్తు యొక్క మూలయోని మరియు శివభావము
2. **త్రికోణాలు :** ఆద్యవిమర్శశక్తి, జీవం, భావం శబా&దర్థరూపమైన సృష్టికి కారణభూతమైన పరాశక్తి, అహంభావము మరియు శివతత్త్వము
3. **అష్టారం (అష్టత్రికోణ సమూహం) :** పుర్యష్టకము, కారణశరీరము, లింగ శరీరానికి కారణభూతము.
4. **అంతర్దశారం (దశ త్రికోణసమూహం):** ఇంద్రియవాసనలు (లింగశరీరం)

5. **బహిర్దశారం ( దశత్రికోణ సమూహం ) :** తన్మాత్రలు పంచభూతాలు

6. **చతుర్దశారం (చతుర్దశత్రికోణ సమూహం ) :** జాగ్రత్, స్థూలశరీరం (ఇంద్రియ విషయాలు)

7. **అష్టదళం (అష్టదళ పద్మం ) :** అష్టవాసనలు

8. **షోడశదళం (షోడశదళపద్మం):** దశారద్వయవాసనలు.

9. **భూపురం :** బిందువు, త్రికోణం, అష్టదళ, షోడశదళాలు, నాల్గింటి సమిష్టిరూపం, ప్రమాతృపురం, ప్రమాణపురం యొక్క ప్రకృతి, మనస్సు, బుద్ధి, అహంకారం ఇంకా శివపదీయమైన శుద్ధ విద్యాధి తత్వచతుష్టయ సమ్మేళనం

పైన పేర్కొన్న తొమ్మిది చక్రాలలో భిన్నభిన్న వర్ణాల సమయోజన ఈక్రిందివిధంగా ఉంటుంది

1. నీలివర్ణం 2. పసుపు 3. గులాబి 4. బూడిదరంగు 5. ఎఱుపు 6. నలుపు 7.నీలం 8 పసుపు 9 ఆఖరి బిందు చక్రం రంగు ఎరుపు. పద్మాల లోపల ఉన్న 2, 3, 4, 5, 6 చక్రాలలో మొత్తం 43 చిన్న త్రికోణాలు సౌందర్యలహరిలో స్పష్టంగా వర్ణించబడింది

ఈ తొమ్మిది చక్రాల పేర్లు ఈక్రింది విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1 | సర్వానందమయ చక్రం | (కేంద్రంలో రక్త ఎఱుపు బిందువు) |
| 2. | సర్వసిద్ధిప్రద చక్రం | (పసుపురంగు త్రికోణం) |
| 3 | సర్వరక్షాకర చక్రం | (హరితవర్ణంలో అష్టత్రికోణాలు) |
| 4. | సర్వరోగహర చక్రం | (నలుపురంగులో దశత్రికోణాలు) |
| 5 | సర్వార్థసాధక చక్రం | (ఎఱుపురంగులో దశ త్రికోణాలు) |
| 6 | సర్వసౌభాగ్యదాయక చక్రం | (నీలివర్ణంలో చతుర్దశ (14) త్రికోణాలు) |
| 7 | సర్వసంక్షోభణ చక్రం | (గులాబీరంగులో అష్టదళపద్మం) |
| 8 | సర్వశాపరిపూరక చక్రం | (పసుపురంగులో షోడశదళ (16) పద్మం) |
| 9. | త్రైలోక్యమోహన చక్రం | (హరితవర్ణంలో వెలుపలి ప్రదేశం) |

## శ్రీయంత్రంలోని నవచక్రాలు - వాటి అధిష్ఠాత్రీ దేవతలు

| | | |
|---|---|---|
| 1. | సర్వానందమయచక్రం | మహాత్రిపురసుందరి |
| 2. | సర్వసిద్ధిప్రద చక్రం | త్రిపురాంబ |
| 3. | సర్వరక్షాకర చక్రం | త్రిపుర సిద్ధాదేవి |

4 సర్వరోగహర చక్రం త్రిపురమాలిని

5 సర్వార్థసాధక త్రిపురాశ్రీ

6 సర్వసౌభాగ్యదాయక చక్రం త్రిపురవాసిని

7. సర్వసంక్షోభణ చక్రం త్రిపురసుందరి

8 సర్వాశాపరిపూరక చక్రం త్రిపురేశ్వరి

9 త్రైలోక్యమోహనచక్రం త్రిపుర

ఈ దేవతలే నవారణపూజలోని తొమ్మిదిమంది దేవతలు మరో సంప్రదాయంలో ఈ దేవతలనే 1. ప్రకట 2 గుప్త 3 గుప్తతర 4 పర 5 సంప్రదాయ 6. కుళకేళా, 7 నిగర్భ 8. అతిరహస్య 9 పరాపర రహస్య 10 పరాపతి రహస్య ఇత్యాది పేర్లతో పిలుస్తారు

ఉపర్యుక్తమైన (శ్రీయంత్ర) చక్రాలను విడివిడిగా పరిశీలిద్దాం

1 మొదటి చక్రంలోని కేంద్రీయబిందువు భగవతి త్రిపురసుందరిదేవి లేదా లలితాదేవి యొక్క రూపం ఇది బిందువు, వాదము, బిందువు, అనే మూడు బిందువుల సంయోగంలో ఏర్పడింది ఈ మూడు బిందువులు రహస్యం శాక్త తంత్రాలలో వివరించబడింది త్రిపురాదేవీ ధ్యానం ఈవిధంగా ఉంటుంది . -

బాలార్కమండలాభాసాం చతుర్బాహాం త్రిలోచనామ్ ।
పాశాంకుశ ధనుర్బాణాన్ధారయంతీం శివాం భజే ॥

భగవతి త్రిపురాదేవి యొక్క నాలుగు అస్త్రశస్త్రాలు -రాగ ద్వేషాల్ని మనస్సును, పంచన్మాత్ర సూచిస్తాయి. వీటిని బంధించడం ద్వారా (ధరించడం ద్వారా) దేవి నిరాకార సదాశివుని సాకారలీలలో లీనమౌతుంది (నిమగ్నమౌతుంది )

తంత్రాలలో సుధాసింధువు దానిలో ఉన్న మణిద్వీపాన్ని గురించి పదేపదే వర్ణింపబడుతూ ఉంటుంది ఈ మణి ద్వీపంలోనే సంయుక్తంగా శివశక్తులు రెండూ నివాసం ఉంటారు ఈ మణిద్వీపాన్నే ఇక్కడ "బిందువు" ద్వారా చూపించటం జరుగుతుంది. మానవులలో దీనినే "హృత్పుండరీకం" అని పేర్కొంటారు. హృత్పుండ రీకంలో ఇష్టదేవతా ధ్యానానికి ఉపయోగపడే ధ్యానబిందువును గురించి ఉపనిషత్తులలో విస్తృత వర్ణనం ఉన్నది శ్రీయంత్ర ప్రధమ చక్రం యొక్క అధిష్ఠాత్రి లలిత లేదా త్రిపుర సుందరీదేవి తన ఆవరణ దేవతాభేదంతో ఒకచోట షోడశ నిత్యలలో ముఖ్యమైనదిగా భావించబడింది. మరియొకచోట అష్టమాతృకలలో సర్వశ్రేష్ఠంగా వివరింపబడింది అలాగే ఇంకొకచోట అష్టవశినీదేవతల అధినాయికగా అభివర్ణింపబడింది ఈ తేదాలు ప్రస్తార

భేదాలవల్ల కలిగింది. ఆ ప్రస్తారాలు వరుసగా 1. మేరు ప్రస్తారం 2 కైలాస ప్రస్తారం 3 భూప్రస్తారం. శ్రీమంత్రోపాసనలో ముఖ్య ప్రాకారం ఇదే.

2. ఈ చక్రం ఒక త్రికోణంతో ఏర్పడినది. ఈ త్రికోణం యొక్క మూడు కోణాలు కామరూప, పూర్ణగిరి మరియు జలంధర అనే మూడుపీఠాలు. వీటి మధ్యలో ఔడయాణపీఠం ఉంటుంది. మొదట చెప్పిన మూడు పీఠాలకు కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అనే అధిష్ఠాత్రీ దేవతలుంటారు. ఈ దేవతలు ప్రకృతి, మహత్తు, అహంకార రూపమైనవి

3 ఈ చక్రంలో అష్టత్రికోణాలుంటాయి. వీటికి అధిష్ఠాత్రీదేవీలు వశిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయని, సర్వేశ్వరి, కౌలిని అనే దేవతలు. ఈ దేవతలు క్రమంగా శీతోష్ణాలకు,సుఖదుఃఖాలకు, ఇచ్ఛ, సత్త్వరజస్తమోగుణాలకు అధిపతులు (స్వామినులు). ఈ చక్ర సాధకుడు గుణాలపై ఆధిపత్యాన్ని సాధించటంలో, ద్వంద్వాతీతుడు అవడంలో సమర్థుడవుతాడు.



శ్రీయంత్రం పటం - సమాచార మతానుసారం ఉపాసన చేసే ఉపాసకుల ద్వారా పూజింపబడే సృష్టిక్రమం.

4. ఈ చక్రంలో సర్వజ్ఞ, సర్వశక్తిప్రద, సర్వైశ్వర్యప్రద, సర్వ జ్ఞానమయి, సర్వవ్యాధినాశిని, సర్వాధార, సర్వపాపహర, సర్వానందమయి, సర్వరక్ష మరియు సర్వేప్సిత ఫలప్రద అనే శక్తులు దశత్రికోణాలలో ఉంటాయి. ఇవి వరుసగా రేచక, పాచక, శోషక, దాహక, ప్లావక, క్షారక, ఉద్ధారక, క్రోధక, జృంభ మరియు మోహన బలౌర్కల అధిష్ఠాత్రీ దేవతలు.

5. ఈ చక్ర స్థిత దశ అధిష్ఠాత్రీదేవీలు దశప్రాణాలకు స్వామినులు. అవి సర్వసిద్ధిప్రద, సర్వసంపత్ప్రద, సర్వప్రియంకరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రద, సర్వదుఃఖ విమోచని, సర్వవిఘ్ననివారిణీ, సర్వాంగసుందరి మరియు సర్వసౌభాగ్యదాయిని.

6. ఈ చక్రంలో ఉండే చతుర్దశ (14) త్రికోణాలు చతుర్దశ ప్రధాన నాడులకు ప్రతీకలు. అలంబుస, కుహు, విశ్వరదిరి, వారణ, హస్తిజిహ్వ, యశోవతి, పయస్విని, గాంధారి, పూష, శంఖిని, సరస్వతి, ఇడ, పింగళ, సుషుమ్న అనేవి ప్రధానమైన పదునాలుగు నాడులు. యోగశిఖోపనిషత్తు ఐదవ అధ్యాయంలో వీటి వివరణ ఉన్నది. ఈ నాడుల అధిష్ఠాత్రీదేవతలు – సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వ సమ్మోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిని, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధని, సర్వసంపత్తి పూరిణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వక్షయంకరి.

7. ఈ చక్రంలోని అష్టదళాలు వచన, ఆదాన, గమన, విసర్గ, ఆనంద, హాన, ఉపాన, ఉపేక్ష అనే బుద్ధులకు ప్రతీకలు. అనంగకుసుమ, అనంగమేఖల, అనంగమదన, అనంగమదనాతుర, అనంగరేఖ, అనంగవేగిని, అనంగనాంకుశ, అనంగమాలిని అనేవి వీటి అధిష్ఠాత్రీ దేవతలు.

8. ఈ చక్రంలో షోడశదళాలుంటాయి. ఈ పదహారు దళాలకు మనస్సు, బుద్ధి, అహంకారం, శబ్దం, స్పర్శ, రూపం, గంధం, రసం, చిత్తం, ధైర్యం, స్మృతి, నామం, వార్ధక్యం, సూక్ష్మశరీరం, జీవనం, స్థూలశరీరం అనేవాటితో సంబంధం ఉంటుంది. కామాకర్షిణీ, బుద్ధ్యాకర్షిణీ, రసాకర్షిణీ, గంధాకర్షిణీ, చిత్తాకర్షిణీ, ధైర్యాకర్షిణీ, స్మృత్యాకర్షిణీ, నామాకర్షిణీ, బీజాకర్షిణీ, శరీరాకర్షిణి అనే దేవతలు వీటికి అధిష్ఠాత్రీ దేవతలు.

కౌలాచారం ప్రకారం శ్రీయంత్ర పటం




9. తొమ్మిదవ చక్రం భూపురంతో యేర్పడింది దీనిలో నాలుగు భాగాలున్నాయి. షోడశదళపద్మం వెలుపలి నాలుగు వృత్తాల తరువాత ఉన్న తటాక (చెఱువు) సదృశ స్థలం, 2. ఈ స్థలాన్ని అనుకొని ఉన్న వెలుపలిరేఖ, 3 రెండవ వెలుపలిరేఖ, 4 అన్నింటికన్న వెలుపల ఉన్న రేఖ ఈ నాలుగు విభాగాలలో క్రమంగా పది ముద్రాశక్తులు, పది దిక్పాలకులు, ఎనిమిది మాతృకలు మరియు సిద్ధులు అధిష్టించి ఉంటారు

**ముద్రాశక్తులు :** సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షణి, సర్వావేశకారిణి, సర్వోన్మాదిని, మహాకుశ, ఖేచరి, బీజముద్ర, మహాయోని, త్రిఖండిక. వీటిలో 10 ఆధారాలకు సంబంధం ఉంటుంది.

**అష్టమాతృకలు :** బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఐంద్రి, చాముండ, మహాలక్ష్మి అనే ఎనిమిది (అష్ట) మాతృకలు. కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలు పాపపుణ్యాలు అనే ఎనిమిదింటిపైన విజయాన్ని సాధించటానికే వీటిని పూజిస్తారు.

# శ్రీయంత్రాలు - రకాలు

ప్రధానంగా శ్రీయంత్రాలు ఎనిమిది రకాలున్నాయి

1 మేరు పృష్ఠీయ శ్రీయంత్రం
2. కూర్మ పృష్ఠీయ శ్రీయంత్రం
3. ధరా పృష్ఠీయ శ్రీయంత్రం
4. మత్స్య పృష్ఠీయ శ్రీయంత్రం
5. ఊర్ధ్వ రూపీయ శ్రీయంత్రం
6. మాంతగీయ శ్రీయంత్రం
7. నవనిధి శ్రీయంత్రం
8. వారాహీయ శ్రీయంత్రం

వీటిలో కూర్మ పృష్ఠీయ శ్రీయంత్రం, ధరాపృష్ఠీయ శ్రీయంత్రం గృహస్థులకు వ్యక్తిగతంగా పరమశ్రేష్ఠమైనవి. శ్రీయంత్రాలు వ్యాపార వృద్ధికి, ఋణవిమోచనానికి, సంతానలాభానికి,ఐహికమైన ఉన్నతికి సర్వానుకూలమైనవి. కాబట్టి ప్రతిసాధక గృహస్థుడు తరగని సంపద కోసం, దారిద్ర్య వినాశనంకోసం, సంపూర్ణ ఐశ్వర్యంకోసం ఇతర ఐహిక సుఖసంపదలకోసం, అద్భుత ఐశ్వర్య సిద్ధికోసంగా కూర్మ పృష్ఠీయ, ధరా పృష్ఠీయ (సమతల) శ్రీయంత్రాలను తమతమ గృహాలలో కార్యాలయాలలో, దుకాణాలలో ప్రతిష్ఠించుకోవచ్చు. శాస్త్రవచనానుసారం నూతన గృహం, కార్ఖానా నిర్మించాలంటే వాటి పునాదుల్లో శ్రీయంత్రాన్ని ప్రతిష్ఠించుకోవాలి. దీనివల్ల ఆ గృహాల్లో నివసించేవారు ఉత్తరోత్తర జీవనంలో ఐశ్వర్యవంతులై సుఖజీవనాన్ని సాగించగలరు

శ్రీయంత్రాలు విభిన్న ఆకృతులలో తయారుచేయబడుతున్నాయి. ఉంగరాల రూపంలో, బాహువులకు (జబ్బలకు) కట్టుకునే తాయెత్తులరూపంలో, మనిపర్సులలో ఉంచుకోవడానికి వీలుగా నాణాలరూపంలో, బహుమతులుగా, కానుకలుగా ఇవ్వడానికి ఫ్రేము కట్టిన పటాలరూపంలో లభ్యమవుతున్నాయి.

శ్రీయంత్రవిశేషాలు బహు గహనమైనవి. వీటి గురించి ఎంత పేర్కొన్నా అవి సంక్షిప్తమైనవిగానే ఉంటాయి. అయినప్పటికి చాలావరకు శ్రీయంత్ర పరిచయం చాలావరకూ చేయగలిగామనే భావిస్తున్నాను. ఈ యంత్రం ద్వారా నిరాకార ఈశ్వరుని యొక్క సాకార్థ లీలాక్రమాన్ని ఈ విశాల బ్రహ్మాండంలో, పిండాండ రూపమైన మానవ శరీరంలో విశేషంగా విశదీకరించబడింది. సృష్టి, జీవాత్మవికాసక్రమం, శివ శక్తుల తత్త్వం మొదలైన వాటిని క్రమంగా స్పష్టీకరించే ప్రయత్నం ఈపాటికి పాఠకులు గ్రహించే ఉంటారు.

శ్రీవింధ్యవాసినీ క్షేత్రంలో అష్టభుజామందిర సమీపంలో "భైరవకుండం" అనే పేరుగల ప్రదేశం ఉంది. అక్కడ కనిపించే అవశేషాలలో ఒక పెద్ద శ్రీయంత్రం కనుగొనబడింది.

అది చాలా విశాలంగా, స్వచ్ఛంగా ఉండటం గమనించారు. ఫరూఖాబాద్ జిల్లాలో 'తిరవా' అనే ప్రదేశంలో కూడా శ్రీయంత్రం ఉన్నది ఇది తిరవాలోని ఒక పెద్ద దేవాలయంలో ఉన్నది. దీనిని 'అన్నపూర్ణ దేవాలయం' అంటారు. వాస్తవానికి ఇది త్రిపురాదేవి ఆలయం. ఒక ఉన్నతమైన వేదికమీద తెల్లచలువరాయిపై చాలాపెద్ద శ్రీయంత్రం నిర్మితమై ఉంది ఈ శ్రీయంత్ర కేంద్రస్థ బిందువు మీద పాశాంకుశ ధనుర్బాణయుక్తమైన భగవతియొక్క సుందర చతుర్భుజ విగ్రహం ఉంది ఈ దేవాలయాన్ని 'రాజా సాహెబ్ తిరవా' అనే ఆయన ఒక తాంత్రిక శక్తిమంతుడైన మహాత్ముని ఆదేశానుసారం శ్రీయంత్రయుతంగా నిర్మించినట్లు చెబుతారు.

## శ్రీ యంత్రపటం



ఇదేవిధంగా గుజరాత్‌లోని సూరత్‌లో కూడా శ్రీయంత్రాకారంలో సువిశాలమైన భవ్యదేవాలయాన్ని నిర్మించారు. ఇది దర్శించి తీరవలసిన దేవాలయం. మందిరమంతా శ్రీయంత్ర నమూనావలె ఉండి మందిర మధ్యంలో యంత్రరాజమైన శ్రీయంత్రం విరాజమానమై మనకు దర్శనమిస్తుంది

శ్రీ యంత్రపూజకు సంబంధించి దక్షిణమార్గ పద్ధతులు వామాచార పద్ధతులు, విధివిధానాలు తత్ఫలితాలు త్రిపురతాపిని, త్రిపోరోపనిషత్తులలో వర్ణితమై ఉన్నాయి యామళ గ్రంథంలో ఈ యంత్రం యొక్క దర్శనమాత్రం చేతనే అద్భుత ఫలితాలు పేర్కొనబడ్డాయి

సమ్యక్ శత క్రతూన్ కృత్వా ఫలం సమవాప్నుయత్ ।
తత్ఫలం లభతే భక్త్యా కృత్వా శ్రీచక్రదర్శనమ్
మహాషోడశ దానాని కృత్వా యల్లభతే ఫలమ్
తత్ఫలం సమవాప్నోతి కృత్వా శ్రీచక్ర దర్శనమ్
సార్థ త్రికోటి తీర్థేషు స్నాత్వా యత్ఫల మశ్నుతే
లభతే తత్ఫలం భక్త్యా కృత్వా శ్రీచక్ర దర్శనమ్ ॥

శ్రీ పర్వతః శిరస్థానే కేదారస్తు లలాటకే,
వారణాసీ మహాప్రాజ్ఞా భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే.
భ్రువోర్ఘ్రాణస్య యః సంధిరితి జాబాలికా శ్రుతిః,
కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగో హృత్సరోరుహే,
చిదంబరం తు హృన్మధ్యమాధారః కమలాలయః.
- పురాణ శ్లోకము

వామే పుస్తక ధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే,
భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్.
ఉజ్జృంభాంబుజ పత్రకాంతి నయన స్నిగ్ధప్రభాలోకనీం,
యే త్వామంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః.
- అంబాస్తవము

# శ్రీ యంత్రం - తెలుసుకోవలసిన కథలు

ఒకసారి లక్ష్మీదేవి అప్రసన్నురాలై, అలిగి వైకుంఠానికి వెళ్ళిపోయింది తత్ఫలితంగా భూమండలంమీద అనేక సమస్యలు ఉత్పన్నమయ్యాయి బ్రాహ్మణులు, వ్యాపారులు, వైశ్యులు మొదలైన వారంతా లక్ష్మీదేవి లేకపోవడంవల్ల (లక్ష్మీదేవియొక్క అభావంలో) దీనులు, హీనులు, అసహాయులు అయి అటు ఇటు తిరుగాడసాగారు. అప్పుడు బ్రాహ్మణ శ్రేష్ఠుడైన వశిష్ఠుడు అది గమనించి ఒక నిశ్చయానికి వచ్చి "జనులారా! నేను లక్ష్మీమాతను ప్రసన్నం చేసుకొని ఈ భూమిమీదకు తీసుకొని వస్తాను" అని పలికాడు

వశిష్ఠుడు తక్షణమే వైకుంఠానికి చేరి లక్ష్మీమాత సన్నిధిని తన కోరికను వెల్లడించి భూమండలానికి విచ్చేయవలసిందని ప్రాధేయపడ్డాడు మమతామయి అయిన లక్ష్మి ససేమిరా తనపట్టు వీడలేదు అప్రసన్నురాలై ఉన్న ఆమె ఏ స్థితిలోను భూమండలానికి దిగిరానని నొక్కి చెప్పింది అప్పుడు వశిష్ఠుడు అక్కడే ఉపవిష్టుడై ఉన్న ఆద్యుడు, అనాది పురుషుడు, అనంతుడు అయిన విష్ణు భగవానుని గురించి తపస్సు ప్రారంభించాడు అనతికాలంలోనే ఆ విష్ణుమూర్తి ప్రసన్నుడై అక్కడ ప్రత్యక్షమయ్యాడు. అది కాంచిన వశిష్ఠుడు మిక్కిలి ప్రసన్నుడై - "హే ప్రభూ! లక్ష్మీదేవి భూమండలాన్ని విడిచి పోవడం వల్ల తదభావంతో పృధ్వీమండల వాసులంతా లేమి పీడితులై దుఃఖిస్తున్నారు. ఆశ్రమాలు నిర్జనాలయ్యాయి. వణిజ్యులు దిక్కుతోచక రోదిస్తున్నారు జీవనం దుర్భరమై, జనం వివశులైపోతున్నారు. ఆశలన్నీ అడియాసలై జీవితోత్సాహం నశించి ఆయుష్షు క్షీణించిపోతోంది" - అని విష్ణుమూర్తికి మొరపెట్టుకున్నాడు. వెంటనే విష్ణుమూర్తి వశిష్ఠుని వెంటగొని లక్ష్మీదేవివద్దకు చేరుకున్నాడు కాని లక్ష్మీదేవి మాత్రం యధాపూర్వకంగా అలకవహించి కూర్చుంది అయిష్టంగా, దృఢనిశ్చయంతో ఇలా పలికింది - నేనెట్టి పరిస్థితిలోను భూమండలంమీద అడుగుపెట్టడానికి సిద్ధంగా లేను"

ఉదాసీన మనస్కుడై, ఖిన్నుడై వశిష్ఠ మహర్షి భూమండలానికి తిరిగివచ్చి జరిగిన వృత్తాంతమంతా జనులకు వివరించి చెప్పాడు. జనులు దిక్కుతోచక చింతాగ్రస్తులయ్యారు అప్పుడు దేవతల గురువు బృహస్పతి - జనులారా! మునివరులారా! ఒకే ఒక ఉపాయం ఉంది. చెబుతాను. శ్రద్ధగా ఆలకించండి. అది శ్రీయంత్రసాధన. మీరు ఇక్కడ శ్రీయంత్రాన్ని స్థాపించి ప్రాణప్రతిష్ఠచేసి పూజించినట్లయితే లక్ష్మీదేవి అవశ్యం అవనీతలానికి వచ్చి తీరుతుంది" - అని పలికాడు. బృహస్పతి వచనాలకు యతివరులంతా సంతసించారు వెంటనే బృహస్పతి నిర్దేశానుసారం శ్రీ యంత్ర నిర్మాణం

చేసారు. మంత్రసిద్ధితో ప్రాణప్రతిష్ఠచేసి దీపావళి రోజుకు రెండురోజుల పూర్వం ధనత్రయోదశి నాడు షోడశోపచార పూజలుగావించారు. పూజ పరిసమాప్తవుతుండగానే లక్ష్మీదేవి అక్కడ ప్రత్యక్షమయ్యింది "మునివర్యులారా! నేను ఎట్టి పరిస్థితులలోను ఇక్కడకు రావడానికి సంసిద్ధురాలినిగా లేను కాని మీరు గావించిన శ్రీయంత్ర పూజకు సంతసిల్లి నేను అవశ్యం రావలసి వచ్చింది శ్రీయంత్రమే నాకు ఆధారభూతమైనది. దానిలో నా ఆత్మ నివసిస్తూ ఉంటుంది" అని పలికింది.

ఈ కథ తెలిశాక పాఠకులకు శ్రీయంత్రం యొక్క విశిష్ఠత బోధపడే ఉంటుంది లక్ష్మీదేవికి సర్వశ్రేష్ఠమైనది, మిక్కిలి ప్రియమైనది శ్రీయంత్రం అన్న విషయం పై కథ ద్వారా మనం గ్రహించాలి శ్రీయంత్రం ఉన్నచోట లక్ష్మి స్థిరనివాసం యేర్పరచుకొని ఉంటుంది. భారతీయ వాఙ్మయంలో సాధకులు, ఋషులు, మహర్షులు, తాపసులు, సాధు పురుషులు అందరూ ముక్తకంఠంతో శ్రీయంత్ర మహాత్యాన్ని చాటిచెప్పినవారే! శ్రీయంత్రసాధనలో లక్ష్మీదేవి నిస్సందేహంగా నిశ్చయంగా ప్రసన్నురాలై జీవన దారిద్ర్యాలన్నింటిని నశింపజేసి సుసంపన్నుల్ని చేస్తుంది. వ్యక్తులు ఋణవిమోచను లవుతారు. ఈవిధంగా శ్రీయంత్రం స్వయంసిద్ధమై మహిమాన్వితమైనది. పరిపూర్ణమైనది.

## శ్రీ సూక్త పారాయణం - విశేష ఫలప్రదం

శ్రీయంత్ర వైభవాన్ని శ్రీఉపాసకులైన మహనీయులు వేనోళ్ళ కీర్తించారు. శ్రీయంత్రం ఒకేసారి వందలాది శక్తుల నివాసం అసలు శ్రీయంత్రం లేని గృహం శ్మశానంతో సమానమని కొందరు మహనీయులు పేర్కొన్నారు భారతదేశంలో శ్రీయంత్రం వంటి (శ్రీవిద్య) విద్య ఉన్నప్పటికి మనం ఇంకా దుఃఖితులమై ఉండటం మన దౌర్భాగ్యానికి నిదర్శనం అని కొందరు వ్యాఖ్యానించారు. శ్రీయంత్రం కలియుగంలో కామధేనువు, కల్పవృక్షం వంటిది శ్రీయంత్రం యంత్రాలలో కెల్లా సర్వశ్రేష్ఠమైనది ప్రధానమైనది. అది యంత్రశిరోమణిగా యంత్రరాజంగా కీర్తింపబడింది. భౌతికమైన ఉన్నతికి అది అందించే ఫలితాలు అద్భుతమైనవి. ఇటువంటి యంత్రాన్ని శ్రీసూక్త పారాయణతో అర్చించినట్లయితే అది విశేష ఫలప్రదంగా ఉంటుంది. లక్ష్మీ సంబంధమైన సూక్తాన్ని "శ్రీసూక్తమని", లక్ష్మీసూక్తమని అంటారు. శ్రీసూక్తంలో 16 శ్లోకాలున్నాయి. దీనిని సంపుటిచేసి పారాయణం చేసినట్లయితే సాధకులకు అద్భుతమైన ఫలితం లభించటం ప్రారంభమవుతుంది. దీనివల్ల యంత్రం స్వయంగా మంత్రచైతన్యాన్ని పొంది, ప్రతిష్ఠితమైన చోట అనుకూల ఫలితాలను అందించటం ఆరంభిస్తుంది. ఈ యంత్రాన్ని

పూజాస్థానంలోనే గాక దుకాణాలలో, ఫ్యాక్టరీలలో, అలమరాలలో కూడా ఉంచుకొని ఒక మంచి రోజున శుభఘడియలలో పూజలు జరుపుకోవచ్చు. ఏదైనా ఒక రోజు ప్రాకృతికమైన దోషాలవల్లగాని, శారీరక దోషాలవల్లగాని ఇతర అనివార్యకారణాల వల్లగాని పూజ జరపలేకపోయినా ఏవిధమైన కీడు జరగదు. మూలతః ఈ యంత్రం చెక్కబడినదిగా ఉండాలి.

ఇక్కడ ఇంకొక కథను మనం పరిస్తే శ్రీసూక్తపారాయణంలో తీసుకోవల్సిన జాగ్రత్తలతోపాటు శ్రీసూక్త పారాయణ మహిమ కూడా మనకు అవగతమవుతుంది.

కొన్ని సంవత్సరాలక్రితం శ్రీమాలి బ్రాహ్మణ శ్రేష్ఠుడు బహుగ్రంథకర్త, జ్యోతిష్య విద్వాంసుడు, భారతీయ సాహిత్య పరిశోధకుడు అయిన శ్రీ రాధాకృష్ణ శ్రీమాలి అనే ఆయన తమ కార్యాలయంలో కూర్చుని ఉండగా టెలిఫోన్ మ్రోగింది. ఆ ఫోను అహమ్మదాబాదులో ఉన్న మిల్లు యజమానిది ఫోను అందుకోగానే " అయ్యా! మీరు వెంటనే బయల్దేరి అహమ్మదాబాదుకు తరలి రావాలి! మేము పెద్ద ఆపదలో చిక్కుకున్నాం. దానినుండి మమ్మల్ని మీరే రక్షించాలి" - అని వర్తమానం. అంతా అయోమయంగా ఉంది. ఆయన అంతకుముందు రెండురోజుల క్రితమే బొంబాయి నుండి వచ్చారు. ఇంకా ఆ బొంబాయి సేఠ్‌కు సంబంధించిన అనుష్ఠానం పూర్తిచేయాల్సి ఉంది. ఎలాగోలా నచ్చచెప్పి నాలుగురోజుల తరువాత అహమ్మదాబాదుకు చేరతానని వాగ్దానం చేశారు శ్రీ రాధాకృష్ణగారు. ఆ మిల్లు యజమాని అయిష్టంగానే సరే అని ఫోన్ పెట్టేశాడు.

అనుకున్న ప్రకారం శ్రీ రాధాకృష్ణ శ్రీమాలి అహమ్మదాబాదు చేరారు. శేఠ్‌జీ ఇంటికి కొద్దిసేపట్లోనే సేద దీర్చుకొని స్నానాదికాలు ముగించుకొని పూజకు ఉపక్రమించారు. ఆయన తన ధ్యానస్థితిలో సేఠ్ యొక్క కుటుంబంమీద అలక్ష్మీఛాయ తిరుగాడటం గమనించాడు. వ్యాపారం సన్నగిల్లటం స్నేహితులు, బంధువులు, వాటాదారులు అందరూ దూరమయిపోవడం జరిగింది. శ్రీమాలిగారికి విషయమంతా విశదమైంది. పూజ ముగియగానే సేఠ్‌జీ పరివారమంతా ఒక పెద్ద హాలులో సమావేశమయ్యారు. అప్పుడు సేఠ్‌జీ తన బాధను వెళ్ళకక్కి సమస్యను ఆయన ముందుంచాడు.

"అయ్యా! నా బాధ భగవంతుడికెరుక. వజ్రపాతంలా వచ్చిపడింది. నా పరిస్థితి దివాళా తీసే స్థితికి వచ్చింది. మీరే ఉపాయం సూచించి మమ్మల్ని గట్టెక్కించాలి. "నేను ఏది చెయ్యడానికైనా సిద్ధమే అని వాపోయాడు. అప్పుడు శ్రీమాలి "సేఠ్‌జీ! ధైర్యంగా ఉండండి. నేను వచ్చాను అంటే మీకు కావాల్సింది చెయ్యటానికే వచ్చానన్నది మరువకండి. ప్రస్తుతం ఈ విషయంలో ఏమీ చెప్పను. రేపు చెబుతాను ఓపిక పట్టండి.

ఈలోగా మీ పూజా మందిరం ఒకసారి చూడాలని ఉంది చూపించండి " అని పలికి లేచినిలబడ్డాడు

సేర్ ఒక్కసారిగా నిలబడి "పదండి వెళదాం" అంటూ పూజామందిరానికి దారి చూపించాడు. శ్రీ రాధాకృష్ణ శ్రీ మాలి పూజాస్థలమంతా పరికించి చూశాడు మిగిలిన శంకలు కూడా తీరిపోయాయి. కాని రోజంతా గడిచిపోయింది. ఎవరో ఒకళ్ళు వస్తూపోతూనే ఉన్నారు. రాత్రి పదకొండయ్యింది బాగా అలసిపోవడంతో శ్రీ రాధాకృష్ణ శ్రీమాలి నిద్రకుపక్రమించాడు తెల్లవారుతుండగానే బ్రాహ్మీముహూర్తంలో లేచి ఆయన నిత్యానుష్ఠానం ప్రారంభించాడు మనస్సంతా వికలంగా ఉంది బుర్ర ఆలోచనలతో నిండిపోతోంది. ఆయన మనస్సంతా సేర్‌జీ సమస్యలమీదే కేంద్రీకృతమై ఉంది.

ఆయన పూజాదులు ముగించుకొని విఘ్నేశ్వరుణ్ణి స్మరించుకొంటూ వెలుపలకు వచ్చాడు. పూజామందిరం నుండి ముక్తకంఠంతో వేదపారాయణం వినిపించసాగింది. వెంటనే ఆయన అటువేపుకు సాగి నిశ్శబ్దంగా పూజాగృహాన్ని సమీపించి అక్కడి ఆసనంమీద కూర్చున్నాడు. సేర్‌జీ, సేర్‌జీ భార్య, వారి ఇరువురు కుమార్తెలు, కొడుకు, కోడలు అందరూ కలిసి అక్కడ శ్రీసూక్తాన్ని పారాయణం చేస్తున్నారు. ఎదురుగా శ్రీయంత్రం బంగారు రేకుమీద చెక్కబడి ఉంది.

శ్రీమాలి రాధాకృష్ణ అంతా శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు. ఒక్కసారి చిరునవ్వు నవ్వాడు. కొంచెం సేపయ్యాక మళ్ళీ చిరునవ్వులు చిందించాడు సేర్‌జీ ఉండబట్టలేక "గురూజీ! మీరు నవ్వుతున్నారేమిటి?" అని ప్రశ్నించాడు రాధాకృష్ణ "ఏమీలేదు ఊరికే నవ్వాను. మీరు కానివ్వండి. ఆపకుండా పారాయణం కొనసాగించండి" అని బదులు పలికాడు. పదేపదే శ్రీ రాధాకృష్ణ ముఖంలో చిరునవ్వు చూసి సేర్‌జీ మొండిగా "గురూజీ! మీ నవ్వుల్లో ఏదో తేడా ఉంది అదేమిటో మీరు మాకు చెప్పాలి. మీమీద మాకు విశ్వాసం ఉంది మమ్మల్ని నిరాశపరచకండి" – అని ప్రశ్నించాడు.

అప్పుడు శ్రీరాధాకృష్ణ "ముందు మీరు పారాయణ కానివ్వండి. మీకే తెలుస్తుంది" అని అనగానే శేర్‌జీ కుటుంబం మళ్ళీ పారాయణ మొదలుపెట్టారు. ఐదవ శ్లోకం దగ్గరకి రాగానే శ్రీమాలి మళ్ళీ నవ్వాడు

మొత్తంమీద పారాయణ పూర్తయింది. వెంటనే సేర్‌జీ కుమార్తె "గురూజీ మీరు ఐదవ శ్లోకం దగ్గరే మీరు నవ్వుతున్నారు. అందులోని రహస్యమేమిటి?" అని ప్రశ్నించింది.

సేర్‌జీ కూడా 'విడమర్చి చెప్పండి" అంటూ వేడుకున్నాడు

శ్రీ రాధాకృష్ణ శ్రీమాలి వివరణం ప్రారంభించాడు ఇదో శ్లోకం "అలక్ష్మీ మే నశ్యతాం త్వాం వృణోమి " - (అనగా) "అలక్ష్మి" అనగా "దారిద్ర్యాన్ని" తొలగించే (నాశనంచేసే) లక్ష్మి వరించాలనుకొంటున్నాను - అని అర్థం ఇంకా చెప్పాలంటే లక్ష్మిని పొందాలనుకొంటున్నాను అని భావం కాని మీరంతా "లక్ష్మీమే నశ్యతాం త్వాం వృణోమి" అని చదువుతున్నారు. లక్ష్మిని నశింపజేసే దానిని నేను పొందాలనుకొంటున్నాను అనగా దారిద్ర్యాన్ని కోరుకొంటున్నానని భావం".

ఇప్పుదర్థమైందా? నేనెందుకు నవ్వానో? అని మరోసారి చిరునవ్వులు చిందిస్తూ వాళ్ళందర్నీ ఆశ్చర్యచకితుల్నిచేశాడు.

శేర్‌జీ కుటుంబానికి విషయం అర్థమైంది. శ్రీ రాధాకృష్ణ "అంతేకాదు. దక్షిణదిశలో పూజామందిరం నిర్మించారు. అది పర్వధా అశుభప్రదం". ఇది తెలుసుకోండి. అని ఇంకొంచెం వివరించాడు.

ఆ తరువాత శేర్‌జీ కోరికమీద ఒక వారంరోజులు రాధాకృష్ణ అక్కడ ఉండి ఒక శుభముహూర్తాన శ్రీయంత్రానికి ప్రాణప్రతిష్ఠచేయించి "శ్రీసూక్తాన్ని" కూడా వారిచేత బాగా అభ్యాసం చేయించాడు ఆ తరువాత ఆ కుటుంబం శ్రీమాత కృపతో ప్రఖ్యాతమైన వ్యాపారవేత్తలుగా లక్షలు,కోట్లు గడించి పేరుప్రఖ్యాతులతో సుఖజీవనం కొనసాగిస్తున్నారు

శ్రీయంత్ర ప్రభావాన్ని మనం స్పష్టంగా అనుభవంలో చూడవచ్చు. అది నిజానికి ఐశ్వర్యాన్ని, ధనసంపత్తిని, గౌరవ సత్కార్యాల్ని ప్రసాదించడంలో సమర్థమైనది. నిత్యం శ్రీయంత్రపూజలు జరిపి శ్రీసూక్తాన్ని 16 శ్లోకాలు పారాయణ చేసినట్లయితే, అది అతిశీఘ్రంగా సంతానాన్ని ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది

ప్రతిరోజు శ్రీసూక్త పారాయణం సాధ్యం కానప్పుడు శ్రీయంత్ర బీజమంత్రం జపించుట మంచిది. బీజమంత్ర జపానికి తామర బీజాలతో చేసిన జపమాలను ఉపయోగిస్తే ఫలితం బాగుంటుంది. తామర బీజాలు లక్ష్మీదేవికి ప్రియకరమైనవి. లక్ష్మీ నివాస స్థానం కూడా తామరపువ్వేకదా! హోమంలో ఆహుతికి కూడా తామరబీజాలను సమర్పిస్తారు.

# శ్రీ యంత్ర ధ్యాన మంత్రం

దివ్యా పరాం సుధవలారుణ చక్ర యాతాం
మూలాది బిందు పరిపూర్ణ కలాత్మ కాయామ్ ।
స్థిత్యాత్మికా శరధనుః సుణిపాస హస్తా
శ్రీచక్రతాం పరిణితాం సతతం నమామి.

# శ్రీ యంత్ర ప్రార్ధనా మంత్రం

శ్రీ యంత్రధ్యానం తరువాత శ్రీ యంత్ర ప్రార్ధన చేయాలి.
ధనం ధాన్యం ధరాం హర్మ్యం కీర్తిర్మాయుర్యశః శ్రియమ్
తురగాన్ దన్తినః పుత్రాన్ మహాలక్ష్మీం ప్రయచ్ఛమే ॥

# శ్రీ యంత్ర బీజ మంత్రం

మంత్రసిద్ధమైన శ్రీయంత్రం ఎదుట తామరబీజాలతో తయారుచేసిన మాలతో నిత్యం లక్ష్మి బీజమంత్రాన్ని మాలాజపంతో ఒక అవృత్తి చేసినట్లయితే ఆశ్చర్యకరమైన ప్రభావాన్ని మనం గమనించవచ్చు. ఈ విషయాన్ని అనేక పురాణాలు, ఉపనిషత్తులు వివరించి చెప్పాయి

ఓం శ్రీ హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ।

దీని తరువాత శ్రీయంత్రానికి నైవేద్యం పెట్టి స్వయంగా ప్రసాదాన్ని స్వీకరించి కుటుంబ సభ్యులందరికీ పంచిపెట్టాలి.

వాస్తవానికి శ్రీయంత్ర ప్రభావాన్ని భారతీయులు ముందు కనుగొన్నారు. జగద్గురు శంకరాచార్యులు తమ ప్రతిమఠంలో శ్రీయంత్ర స్థాపనకు, నిత్యపూజలకు ఆదేశించారు. విద్వాంసులలో సర్వశ్రేష్ఠులు పూజ్యులు అయిన ఆదిశంకరులు స్వయంగా శ్రీవిద్యకు (శ్రీ యంత్రానికి) అనన్యభక్తులు.

ఒక ప్రవాస భారతీయుడొకడు ఆ మధ్య 21 కిలోల బంగారంతో కూర్మ పృష్ఠీయ శ్రీయంత్రాన్ని నిర్మింపజేశాడు. భారతదేశంలో కొందరు పారిశ్రామికవేత్తల వంశాలలో తరాలుగా వారి ఇనపెట్టెలలో నేటికీ శ్రీయంత్రాలను చూడవచ్చు. వారి పూర్వీకులు శ్రీయంత్ర మహిమను తెలుసుకొని ముందునుంచీ ఇనపెట్టెలలో శ్రీయంత్ర స్థాపనం చేసుకొన్నారు.

దక్షిణభారతంలోని తిరుపతి శ్రీవేంకటేశ్వర దేవాలయపీఠంలో శ్రీయంత్రం ప్రతిష్ఠించబడి నిత్యపూజలందుకుంటోంది ఆబూకు చెందిన ప్రసిద్ధ “దేలవాద” దేవాలయంలో ప్రశస్త స్తంభాలమీద కూడా శ్రీయంత్రం చెక్కబడి ఉంది రాజస్థాన్‌లోని ప్రసిద్ధ “ఓసియాదేవి” ఆలయ ద్వారం మీద శ్రీయంత్రం నిర్మింపబడి ఉంది

ఆశ్చర్యమేమిటంటే శ్రీయంత్రానికి సంబంధించిన శాస్త్ర సంపద భారతదేశంలోనే గాక విదేశాలలో కూడా కనిపిస్తోంది ఇది ఎలా జరిగిందంటే - భారతీయులు తాము వెళ్ళిన చోటికల్లా శ్రీయంత్రాన్ని వెంటగొనిపోయారు. అక్కడ దాని మహిమను చాటి చెప్పారు. నేపాల్‌లోని ‘పశుపతినాథ’ మందిరం యొక్క ప్రధాన ద్వారం మీద ‘శ్రీయంత్రం’ భవ్యరూపంలో నిర్మితమై ఉంది మారిషస్‌లోని శ్రీ రామమందిరంలో కూడా శ్రీయంత్రం చెక్కబడి ఉంది. ఈవిధంగా విదేశాలలోని దేవాలయాలలో కూడా శ్రీయంత్ర నిర్మాణం కనిపించటం ఆశ్చర్యాన్ని కలిగించకమానదు

శ్రీయంత్రం స్వయంగా అత్యంత శ్రేష్ఠమైన యంత్రం ఆర్థికమైన ఉన్నతికి, భౌతిక సంపదలకు దీనిని మించిన యంత్రం ప్రపంచంలో మరొకటి లేదు శ్రీయంత్రం లేని గృహం నిజానికి దురదృష్టమైన గృహం అని చెప్పాలి జైనశాస్త్రాలలో కూడా ఈ యంత్రప్రభావాన్ని విశేషంగా పేర్కొన్నారు. లక్ష్మీప్రసన్నానికి, వ్యాపారవృద్ధికి ఈ యంత్రం శ్రేష్ఠమైనదని జైనులు కూడా పేర్కొన్నారు.

శ్రీయంత్రం స్వతసిద్ధంగా సర్వసిద్ధులకూ నివాసస్థానమని అనడంలో ఎటువంటి సందేహము లేదు. ఈ విషయాన్ని యోగీశ్వరులు, సన్యాసులు, తాంత్రికులు, వ్యాపారులు, గృహస్థులు, విదేశస్థులు ఏకగ్రీవంగా అంగీకరించారు. మంత్రపూతమై ప్రాణప్రతిష్ఠితమైన శ్రీయంత్రం ఇంట్లో స్థాపింపబడితేనే చాలు. శ్రీయంత్ర ప్రతిష్ఠతోనే అపారమైన విజయాలు ప్రసాదించడంలో సహాయకమవుతుంది దీపావళినాడు శ్రీయంత్రాన్ని స్థాపించి, దానికి పూజలు చేసినట్లయితే వారికి జీవితంలో భౌతికంగా ఏవిధమైన లోటు ఉండదు ఇంట్లో ప్రసన్నతా పూర్వకమైన వాతావరణం నెలకొని ఉంటుంది. ఆర్థికమైన అభివృద్ధికి, వ్యాపారంలో విజయానికి ఈ యంత్రం సాటిలేనిది.

శ్రీయంత్రానికి శ్రీసూక్తానికి పారంపరికంగా సన్నిహిత సంబంధం ఉంది. కాబట్టి సాధకులు విశేష మనువాంఛా సిద్ధికి శ్రీయంత్ర సన్నిధిలో నిత్యం శ్రీసూక్త పారాయణం చెయ్యాలి శ్రీసూక్త శ్లోకాలు సాధారణ మంత్రాలు కావు. అందుచేతనే ఆ రెండింటి కూర్పు (సంబంధం) వల్ల ఒక విశేషమైన దివ్యత్వం ప్రాదుర్భవిస్తుంది

## బాగా గుర్తుంచుకోండి

ప్రతి దీపావళికి కొన్ని శ్రీయంత్రం చెక్కిన నాణాలను ధన త్రయోదశినాడు కొనుక్కుని పెట్టుకుని దీపావళినాడు పూజించి మీ అలమరల్లో (బీరువాల్లో), ఇనపెట్టెల్లో లాకర్లలో ఉంచుకోండి మళ్ళీ వచ్చే దీపావళి కూడా మరికొన్ని శ్రీ యంత్రనాణాలను కొని దీపావళినాడు అన్నింటిని కలిపి పూజించి బీరువాల్లో , క్యాష్‌బాక్సుల్లో పెట్టుకోండి ఈవిధంగా శ్రీయంత్రం ఎప్పుడూ మీ ఇనపెట్టెల్లోనూ, లాకర్లలోను ఉంటూనే ఉంటుంది మీరు దినదినమూ వృద్ధిలోకి వస్తూనే ఉంటారు నిరంతరమైన అభివృద్ధిని సాధిస్తూ ముందుకు సాగుతూంటారు

# శ్రీ సూక్త పారాయణ కథ

మధ్యప్రదేశ్‌లోని సర్గూజాకి చెందిన రామ్‌దయాళ్ అనే ఆయన కొన్నేళ్ళుగా శ్రీసూక్తం నిత్యం పారాయణ చేస్తున్నాడు అతడు చాలాకాలం ధనసంపత్తి ఏమీ లేకుండా పరమ దారిద్ర్యాన్ని అనుభవించాడు. తల్లిదండ్రులుకూడా చాలా పేదవాళ్ళు చాలా కష్టాలుపడి అతని తమ్ముళ్ళను, చెల్లెళ్ళను పెంచారు. ఎక్కడికి వెళ్ళినా అతడికి ఏమీ తోచేది కాదు. ఆఖరికి దేవాలయానికి వెళ్ళి గంటలకొద్దీ అక్కడ గడిపినా మనశ్శాంతి ఉండేది కాదు మనస్సులో శ్రద్ధా విశ్వాసాలు ఉన్నప్పటికి కష్టాలు నుండి గట్టెక్కడానికి దారి చూపే వాడెవడూ కనబడలేదు

ఒకరోజున ఒక సాధువుల బృందం ఒకటి ఆ గ్రామానికి వచ్చింది. వారిని చూడగానే రామ్‌దయాళ్‌కి వారిని సేవించుకోవాలనిపించింది అనుకున్న ప్రకారం వారికి తమ సేవలను అందిస్తూ గడిపాడు వెళుతూ వెళుతూ ఆ సాధువులలో ఒక గురుస్వామి రామ్‌దయాళ్‌ని దగ్గరికి పిలిచాడు దగ్గరకు రాగానే తలపై చేతిని ఉంచి హస్తమస్తక సంయోగం చేశాడు. ఒక్కసారిగా అతడికి కనికట్టు చేసినట్లయ్యింది ఏమి జరిగిందో తెలియదు. చూస్తుండగా ఆ సాధు పురుషుని ఒడిలో తలపెట్టి రోదించసాగాడు. కొంతసేపయ్యాక ఆ సాధు పురుషుడు - ఇదుగో తీసుకో ఈమాలను తీసుకో. ఇంకో విషయం శ్రద్ధగా విను. ఎవరైనా బ్రాహ్మణోత్తముని దగ్గర శ్రీసూక్తాన్ని నేర్చుకో! నిత్యమూ స్నానంచేసిన తర్వాత దానిని పఠించు. ఇది తామరబీజాలతో చేసిన జపమాల. ఎప్పుడూ నీ దగ్గరే ఉంచుకో"- అని చెప్పి సాధువుల బృందం ఆ ఊరు విడిచి వెళ్ళిపోయింది

నాటినుంచి రామ్‌దయాళ్ దారిద్ర్యాలన్నీ దూరమవుతు వచ్చాయి ఏపాటి సంకటస్థితి కలిగినా అతడు శ్రీసూక్తపారాయణానికి కూర్చుంటాడు ఎప్పుడు ఎవరికి ఏవిధమైన సంకటం కలిగినా వారికి కూడా శ్రీసూక్త పారాయణాన్నే అతడు సూచిస్తాడు ఉచ్చారణ కంటే (ఉచ్చారణ కూడా అవసరమే) శ్రద్ధా విశ్వాసాలు అత్యంతావశ్యకాలు. శ్రద్ధా పూర్వకమైన పారాయణం సత్వర ఫలితాలను అందిస్తుంది 'నాకైతే జీవనసారం శ్రీసూక్త పారాయణం" అంటాడు రామ్‌దయాళ్‌జీ నేటికీ!

## దిగ్విజయ వ్యాపారమంత్రం శ్రీయంత్రమే!

ఒకసారి గుజరాత్‌రాష్ట్రంలోని సూరత్ నగరానికి చెందిన ప్రసిద్ధ వ్యాపారి అకస్మాత్తుగా భయంకరమైన ఆర్థికసంకటంలో చిక్కుకుపోయాడు తరతరాలుగా ఉన్న మాన మర్యాదలన్ని మట్టిలో కలసిపోయే పరిస్థితులు వచ్చిపడ్డాయి. క్రయవిక్రయాల్లో నష్టం వస్తోంది కోట్లు ఖర్చయిపోయాయి. అతనికున్న ఫ్యాక్టరీ మూతపడింది ఈ స్థితి నుండి అతను బయట పడటానికి కొందరు మిత్రులు ఎవరికి తోచిన ప్రయత్నం వారు చెయ్యసాగారు. కొంధరు భూతవైద్యుడు దగ్గరికి మరికొందరు తాంత్రికుల దగ్గరకు వెళ్ళారు. ఆ కుటుంబం నగరంలో ప్రఖ్యాత మవటం వల్ల ఆ వ్యాపారికి కలిగిన ఆర్థిక సంకటస్థితిని తెలుసుకొని నవ్వి ఊరుకుంటున్నారు. పరిస్థితులు తెలుసుకొనే నెపంతో వచ్చిపడే బంధువులకు ఏం చెప్పుకోవాలో దిక్కు తోచని చిక్కుస్థితిలో కుటుంబమంతా ఉండిపోయింది

ఆ సమయంలో శ్రీరాధాకృష్ణ శ్రీమాలి ఒక ప్రసిద్ధ పారిశ్రామికవేత్త ఇంట్లో బసచేశాడు ఇంట్లో అనుష్ఠాన కార్యక్రమం సాగుతోంది. పైన చెప్పిన వ్యాపారి ఈ పారిశ్రామిక వేత్తకు చాలాకాలమునుంచీ మంచి స్నేహితుడు ఒక రోజున ఆయన ఆ వ్యాపారిని తీసుకొని శ్రీమాలి దగ్గరకు వచ్చాడు ఆతని జాతకం చూసి శ్రీ రాధాకృష్ణశ్రీమాలి ఆశ్చర్యచకితుడై "సేఠ్‌జీ! ఇప్పటి నీ ఆర్థికపరిస్థితుల్లో ఆత్మహత్య చేసుకోవాలను కొంటున్నావు కదూ! ఈ విషయంలో నీవేమీ కంగారుపదాల్సిన అవసరం లేదు"- అని ఓదార్చి పంపించాడు

ఆ తరువాత శ్రీమాలి మంచి ముహూర్తంలో ఆ వ్యాపారి ఇంట్లో శ్రీయంత్రాన్ని ప్రాణప్రతిష్ఠ చేయించి స్థాపితం చేయించాడు. ఇంటిల్లిపాదికి శ్రీయంత్ర బీజమంత్ర జపవిధానాన్ని ఉపదేశించాడు

పదిరోజులు గడిచాయి వ్యాపారి కుటుంబమంతా జోద్‌పూర్‌లో ఉన్న శ్రీ రాధా శ్రీమాలి ఇంటికి తరలివచ్చారు సేర్‌జీ కళ్ళల్లో నీళ్ళు తిరిగి ఉన్నాయి మాట పెగిలిరావటం లేదు సేర్‌జీ భార్య అయితే నిశ్చేష్టురాలై శ్రీ రాధాకృష్ణ శ్రీమాలి వైపే చూస్తూ ఉండిపోయింది

కొద్దిసేపయ్యాక తేరుకొని జరిగిన విషయమంతా చెప్పారు వాళ్ళింట్లో శ్రీయంత్ర స్థాపన జరిగిన రెండు రోజుల్లోనే ఎక్కడెక్కడయితే బాకీలు వసూలు కాకుండా ఉండిపోయాయో, వారందరూ వచ్చి క్షమాపణలు చెప్పి బాకీ డబ్బులన్నీ తిరిగి ఇచ్చేయడం మొదలుపెట్టారు చూస్తూండగానే ఆర్థికస్థితి చక్కబడింది

తన వ్యాపారం శ్రీయంత్రం పెట్టిన భిక్షే! దివాళా తీసే పరిస్థితులలో ఈ శ్రీయంత్రమే నా కుటుంబాన్ని నా పరువుప్రతిష్ఠల్ని కాపాడింది ఆర్థిక సంకటం నుండి శ్రీయంత్రమే నన్ను అనూహ్యంగా బయటపడేసింది – అని ఇప్పటికే ఆ సూరత్‌వ్యాపారి సగర్వంగా చెప్పుకొంటాడు!

## చంచల లక్ష్మిని స్థిరంగా కట్టిపడవేసే మంత్రం శ్రీ సూక్తపారాయణం!

అలహాబాదుకు చెందిన ప్రఖ్యాత సేర్ ఇంట్లో తరతరాలుగా శ్రీలక్ష్మి తాండవిస్తోంది! లక్ష్మీదేవి వాళ్ళింటిని స్థిరనివాసంగా యేర్పరచుకుంది ఒకరోజున లక్ష్మీదేవి సుదీర్ఘకాలంగా వాళ్ళింట్లోనే ఉండటంవల్ల కొద్ది విసుగు జనించింది. వెంటనే ఆరోజు రాత్రి సేర్ కలలో దర్శనమిచ్చి – "సేర్! నేనిక్కడ కొంత విసిగిపోయాను నేనిక్కడ నుండి మరోచోటుకు వెళ్ళిపోవాలనుకొంటున్నాను అయితే నువ్వు చాలాకాలంగా నాకు సేవలు, పూజలు చేశావు కాబట్టి ఏదైనా వరం కోరుకో " – అని పలికింది

సేర్ బాగా తెలివిగలవాడు కాబట్టి వెంటనే "తల్లీ! నాకు ఒక రోజు గడువు ప్రసాదించు మా ఇంట్లో వాళ్ళందర్నీ అడిగి నిన్ను వరమడుగుతాను" అని బదులు పలికాడు

మర్నాటి ఉదయం సేర్‌జీ తన కుటుంబాన్నంతా సమావేశపరచి రాత్రి కలలో జరిగినదంతా చెప్పాడు. అందరూ ఏం చెయ్యాలా అని ఆలోచనలో పడ్డారు ఏమీ పాలు పోవడం లేదు. సేర్‌జీ భార్య "అయితే నాకు నవరత్నాల హారాన్ని అడగండి" – అంది సేర్‌గారి పెద్దకొడుకు – "నాకు కూడా ఒక ఫ్యాక్టరీని వరంగా అడగండి" అన్నాడు కోడలు ఒక కొత్త బంగళా కావాలని అడిగింది చిన్నకొడుకు ఒక ఫారిన్ టూరు కావాలన్నాడు. అంతా ఎవరికి కావలసింది వాళ్ళడిగారు

చివరికి చిన్నకోడలు ఒక్కత్తే మిగిలిపోయింది ఈ కోడలు వచ్చి నెలైనా కాలేదు ఈ పిల్లని అడుగుదామా? వద్దా? అనుకున్నాడు పోనీ ఆ పిల్లకు ఎందుకు కోపం తెప్పించాలి అడిగే చూద్దామని అడిగి చూశాడు అప్పుడు చిన్నకోడలు – "మామగారూ! నేనేమి అడగను? మీరు తల్లిదండ్రులు తీర్థస్వరూపులై మా చెంత ఉండగా నేనేమి అడగను? మీరు పార్వతీపరమేశ్వరుల్లా ఉన్నారు ఇంట్లో ఏవి కావాలంటే అవి ఉన్నాయి ఆగండి! ఒక్క విషయం గుర్తుకు వచ్చింది, అడుగుతాను ఈ విషయం తప్పకుండా ఆలక్ష్మీ మాతను అడగండి " ఏ సుఖశాంతులైతే ఈ ఇంట్లో ఇప్పటిదాకా ఉన్నాయో అవి ఎల్లప్పుడూ ఇలాగే కలకాలం ఉండేలా అనుగ్రహించమని ప్రార్థించండి" అంది గడుసుగా చిన్నకోడలు అన్నది సేఠ్‌కి చిన్నకోడలు కోరిన కోరిక సంతృప్తిని ఇవ్వలేదు

మరుసటిరోజు రాత్రి అనుకున్న ప్రకారం లక్ష్మీదేవి స్వప్నంలో సాక్షాత్కరించింది అప్పుడు సేఠ్ అందరి కోరికలు వరసగా ఏకరువు పెట్టాడు ఒక్కొక్కరి కోరికను "తథాస్తు" అంటూ అనుగ్రహించింది పద్మాలయ. ఆఖర్న చిన్నకోడలు మాట వచ్చేసరికి తథాస్తని తలపట్టుకొని కూర్చుండిపోయింది సేఠ్! నీ చిన్నకోడలి కోరిక ద్వారా నేను నీ ఇంట స్థిరనివాసిని కావాలి! ఎందుకంటే సుఖశాంతులున్న చోటు వదలి లక్ష్మి వెళ్ళలేదు అలాగే కలహం ఉన్నచోట నిలవలేదు ఆమాట అంటూ లక్ష్మీదేవి మళ్ళీ సేఠ్ ఇంట్లోనే స్థిరనివాసమేర్పరచుకుంది

శ్రీ మహాలక్ష్మి ఆసనం కమలం అందుకే ఆమెను కమలాసని అని కూడా అంటారు వాస్తవానికి ఆమె ఆదిశక్తి. ఈ ఆదిశక్తియే సముద్ర గర్భంనుండి లక్ష్మీరూపంగా అవతరించి విష్ణుమూర్తికి వామాంగంలో స్థానం ఇచ్చింది. ఆమె తన పతి విష్ణుమూర్తిని నిరంతరం సేవిస్తూ (పాదసేవనంతో) ఉంటుంది ఆమె యొక్క ప్రాణం శ్రీయంత్రంలో బసచేసి ఉంటుంది కాబట్టి ఎవరైతే శ్రీయంత్రాన్ని లేదా విష్ణుమూర్తిని పూజిస్తారో అనగా శ్రీసూక్తాన్ని పఠిస్తూ పూజిస్తారో వారిమీద శ్రీలక్ష్మీదేవి కృప అనాయాసంగా కలుగుతుంది

జీవితంలో ఏదైనా పొందాలన్నా, ఏవిధంగా వృద్ధిలోకి రావాలన్నా, ఏదో ఒకటి చేసి చూపించాలన్నా అవశ్యం మనకి ఒక గురువు ఉండి తీరాలి గురువే మనకు మార్గం చూపిస్తాడు అసలైన జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. సిసలైన లక్ష్యాన్ని చూపిస్తాడు ఆగామిలో రానున్న కష్టాలను సైతం తప్పించుకొనే ఉపాయాలు చెప్పగలడు. అయితే శిష్యుడవటానికి తగిన యోగ్యత లభించినప్పుడే సద్గురువు లభిస్తాడు ఈ విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి సద్గురువులకు సచ్ఛిష్యులమయ్యే యోగ్యత లభించేవరకూ సత్సాధనలో నిరంతరం మనం ముందుకు సాగుతూనే ఉండాలి కాబట్టి యోగ్యత సంపాదించండి మిమ్మల్నెవరూ ఆపలేరు! ఆపబోరు!

# లక్ష్మీదేవికి ప్రియాతి ప్రియమైన "శ్రీ సూక్తం"

లక్ష్మీదేవికి సంబంధించిన స్తోత్రాలలో సర్వాధిక మహిమాన్వితమైన శ్రీసూక్తం ఐహికవాంఛలను నెరవేర్చటానికి, సౌభాగ్యప్రాప్తికి అమోఘమైన సాధనం శ్రీయంత్ర పూజకూ ఇది బహుశ్రేష్ఠమైనది శ్రీయంత్ర సన్నిధిలో కూర్చుని నిత్యమూ శ్రీసూక్తాన్ని ఒకసారైనా పఠించినట్లయితే తద్వారా మనోవాంఛాఫల సిద్ధి కలుగుతుంది అతడు విశ్వవిజేత అవుతాడు కుబేర సమాన ఖ్యాతిని కూడా పొందగలుగుతాడు

ప్రపంచంలో లక్ష్మీదేవిని స్తుతిస్తూ ఉన్న స్తోత్రాలన్నింటికంటే సర్వశ్రేష్ఠమైనది శ్రీసూక్తం ఇది విశ్వవిఖ్యాతమైన స్తోత్రం ఇది స్వయంగా మంత్రమయమైనది కాబట్టి సంపుటిలో కూడా దీనిని పఠించే పద్ధతి ఉన్నది లక్ష్మీదేవిని ప్రసన్నంచేసుకోవాలనుకునే వ్యక్తికి, జీవితంలో పరిపూర్ణ భౌతిక సుఖాలను అనుభవించాలనుకున్న వ్యక్తికి ఈ స్తోత్రం అత్యంతావశ్యకం అంతేకాదు స్తోత్ర పఠనం వల్ల చిత్తశాంతి, స్థైర్యం అలవోకగా అబ్బుతాయి

ఇది స్వయంగా విశ్వవిఖ్యాతమైనది ఈ స్తోత్రంలోని తొలి మూడు పదాలలోనే బంగారాన్ని తయారుచేసే విధానం స్పష్టం చేయబడిందని అపవాదులు చెబుతారు పరిశోధకులకు స్పష్టమైన విషయమేమిటంటే – ఈ పదాల లోతులకు (మూలంలోకి) వెళ్ళి అర్థాన్ని అవగాహన చేసుకోవడం వల్ల , దానిని బట్టి అనుసరణ కొనసాగించటం వల్ల రాగి వంటి నీచలోహాలు సైతం నిస్సందేహంగా స్వచ్ఛమైన బంగారంగా మారుతుందని పరిశోధకుల పరీక్షణం వల్ల తేలింది.

కాబట్టి సాధకుడు ఈ స్తోత్రాన్ని పూర్ణతన్మత్వంతో పఠించాలి. తద్వారా జీవితంలో దాని మహిమను అంది పుచ్చుకోవాలి. ఏ వ్యక్తి అయితే ఈ స్తోత్రాన్ని నిత్యం ఒకసారైనా పఠిస్తాడో ఆ వ్యక్తి జీవితంలో ఎటువంటి లేమిని ( అభావాన్ని) పొందడు

## 1. సంపుటిత శ్రీసూక్తం

శ్రీసూక్తం యొక్క శ్లోకాల సంపూర్ణ ఫలంకోసం శ్లోకానికి ఇరువైపులా ఒక్కొక్క మంత్రం ఉంచి జరిపించటం అనగా లక్ష్మీ బీజమంత్రం (ఓం హ్రీం శ్రీం నమః) శ్లోకానికి ముందు వెనుక రెండుసార్లు జపించబడుతుంది దీనితోపాటే లక్ష్మీదేవి దారిద్ర్య వినాశకమంత్రం (దుర్గే స్మృతా హరసి) కూడా సంపుటీకరించి పఠించినట్లయితే దాని వలన వర్ణించనలవిగాని ఫలితాలు పొందగలుగుతారు దీనినే సంపుటిత శ్రీసూక్తమ్

అంటారు ఇప్పుడు మనం మూలసంపుటితంగా శ్రీసూక్తం = ధ్యానం, వినియోగం, న్యాసాలను తెలుసుకుందాం

## వినియోగ :

కుడిచేతిలో ఉద్ధరిణుడు నీళ్ళు తీసుకోవాలి.

ఓం హిరణ్య వర్ణామితి పంచదశర్చస్య సూక్తస్య శ్రీ ఆనంద - కర్దమః చిక్లీత ఇందిరాసుతా మహర్షయః । శ్రీ రగ్నిర్దేవతా ఆద్యాస్తిస్రోఽనుష్టభః, చతుర్థా బృహతీ, పంచమీ షష్ఠౌ త్రిష్టుభౌ, తతౌష్టావనుష్టుభః అన్యా ప్రస్తార పంక్తిః । హిరణ్య వర్ణామితి బీజం, తాం ఆవాహ జాతవేద ఇతిశక్తిః కీర్త్విృద్ధిం దదాతు మే ఇతి కీలకమ్ శ్రీ మహాలక్ష్మి ప్రసాద సిద్ధ్యర్ధే జపే వినియోగః । అంటూ - జలాన్ని భూమిమీద వదిలిపెట్టాలి.

## న్యాసం

కరన్యాస అంగన్యాసాలు ఈ క్రింది ఆరు మంత్రాలతో చేయాలి

హిరణ్యవర్ణాయై, హరిణ్యై, సువర్ణ రజతస్త్రజాయై, చంద్రాయై, హిరణ్మాయ్యై, లక్ష్మ్యై"

## ధ్యానం

చేతులు జోడించి లక్ష్మీమాతను ధ్యానించాలి.

అరుణ కమల సంస్థా తద్రజః పుంజవర్ణా
కరకమల ధృతేష్టాభీతి యుగ్మాంబుజాతా ।
మణి మకుట విచిత్రాలంకృతిః పద్మమాలా
భవతు భువనమాతా సంతతం శ్రీః శ్రియై నః ॥
కమలం కలశం ధేనుం జ్ఞాన మంజలి మేవ చ
నచ ముద్రాః ప్రదర్శ్యాధ శ్రీసూక్తం ప్రజపేత్ బుధః ॥

## 2. సంపుటిత శ్రీ సూక్త పారాయణం

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమా వహ ॥ 1**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఽ_చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్ ॥ 2**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఽ_చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।**
**శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మా దేవీ ర్జుషతామ్ ॥ 3**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఽ_చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**కాం సో స్మి తాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తర్పయన్తీమ్ ।**
**పద్మే స్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ 4**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఽ_చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।

శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।

స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీం శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।**

**తాం పద్మనీమీం ఈం శరణ మహం ప్రపద్యే ఽ లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణోమి ॥ 5**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।

సర్వోపకార కరణాయ సదార్ద్రఽ చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।

శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।

స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఆదిత్యవర్ణే తపసోఽ దిజాతో వనస్పతిఽ స్తవ వృక్షోఽ థ బిల్వః ।**

**తస్య ఫలాని తపసా నుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్య అలక్ష్మీః ॥ 6**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।

సర్వోపకార కరణాయ సదార్ద్రఽ చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।

శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।

స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఉపైతు మాం దేవ సఖః కీర్తిశ్చ మణినాసహ।**

**ప్రాదుర్భూతోఽ స్మి రాష్ట్రే ఽ స్మిన్ కీర్తిమృద్ధిం దదాతుమే ॥ 7**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।

సర్వోపకార కరణాయ సదార్ద్రఽ చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।

శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।

స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**క్షు త్పిపాసామలాం జ్యేష్ఠా మ లక్ష్మీ ర్నాశయామ్యహమ్ ।**
**అభూతి మసమృద్ధిం చ సర్వాంనిర్ణుద మే గృహాత్ ॥** 8

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఌ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**
**ఈశ్వరీ సర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్ ॥** 9

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఌ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**మనసః కామ మాకూతిం వాచం స్పత్య మశీమహి ।**
**పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥** 10

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఌ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।**
**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥** 11

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఌ చిత్తా ॥

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఆపస్సృజన్తు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే ।**
**ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥** 12

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఉ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥** 13

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఉ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥** 14

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్రఉ చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఉ శ్వాన్ విందేయం పురుషానహమ్॥** 15

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥
ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥

**యః శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్య మన్వహమ్ ।**
**సూక్తం పఞ్చదశర్చం చ శ్రీకామ స్సతతం జపేత్ ॥ 16**

దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా।
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా ॥
ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద ।
శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః ॥

అంగం హరేః పులకభూషణ మాశ్రయంతీ
భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్
అంగీకృతాఖిల విభూతి రపాంగలీలా
మాంగల్యదా ఽస్తు మమ మంగళదేవతాయాః. 1

ముగ్ధా ముహు ర్విదధతీ వదనే మురారేః
ప్రేమత్రపా ప్రణిహితాని గతాగతాని
మాలా దృశో ర్మధుకరీవ మహోత్పలేయా
సా మే శ్రియం దిశతు సాగర సంభవాయాః. 2

విశ్వామరేంద్ర పదవిభ్రమ దాన దక్ష
మానంద హేతు రధికం మురవిద్విషో ఽపి
ఈషన్నిషీదతు మయి క్షణ మీక్షణార్ధమ్
ఇందీవరోదర సహోదర మిందిరాయాః. 3

ఆ మీలితాక్ష మధిగమ్య ముదా ముకుందమ్
ఆనందకంద మనిమేష మనంగ తంత్రమ్
ఆకేకర స్థిత కనీనిక పక్ష్మ నేత్రం
భూత్యై భవే న్మమ భుజంగ శయాంగనాయాః.4

# శ్రీ యంత్రసాధన - జ్యోతిష విషయాలు

సాధకుడు ఏవిధమైన ఉపాసనలో సఫలీకృతుడవుతాడో తెలుసుకోవడానికి మంత్రసాధనకు పూర్వమే ఆతడి జన్మానుగత గ్రహాలను అధ్యయనం చెయ్యాలి

జాతకంలోని నవమభావంవల్ల ఉపాసనా జ్ఞానం కలుగుతుందని శాస్త్రం చెబుతోంది ఈ విషయానికి సంబంధించిన కొన్ని దశలు అంతర్దశలలో సాధ్యపడే సత్యాలను ఈ క్రింద పేర్కొంటున్నాను.

- ఒక వ్యక్తి జాతకంలో బృహస్పతి (గురుడు), కుజబుధులతో కలిసి ఉన్నా పరస్పర దృష్టి ఉన్నా అతడు సాధన క్షేత్రంలో సాఫల్యాన్ని పొందుతాడు
- గురు బుధులిరువురూ నవమ భావంలో ఉన్నట్లయితే సాధకుడు బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందడంలో సఫలుడవుతాడు.
- సూర్యుడు ఉచ్చగతుడై లగ్నాధిపతిలో కలసినట్లయితే ఆ జాతకుడు శ్రేష్ఠ సాధకుడవుతాడు
- లగ్నాధిపతి మీద గురుదృష్టి ఉన్నట్లయితే జాతకుడు స్వయంగా మంత్రస్వరూపుడవుతాడు. మంత్రం అతనికి కరతలామలకమై ఉంటుంది.
- దశమాధిపతి దశమస్థానంలో ఉంటే ఆ వ్యక్తి సగుణోపాసకుడవుతాడు.
- అలాగే దశమాధిపతి మందునితో కలిసి ఉంటే ఆ వ్యక్తి తామస విద్యా ప్రవృత్తి గల ఉపాసకుడవుతాడు.
- అష్టమభావంలో రాహువు ఉన్నట్లయితే ఆ జాతకుడు అద్భుత యంత్ర సాధకుడు, తాంత్రికుడవుతాడు. అయితే అలాంటి వ్యక్తులు తమని తాము రహస్యంగా ఉంచుకొంటారు (ఏవిధంగానూ బయటపడరు.)
- దశమాధిపతి శుక్రుడు లేదా చంద్రునిలో సంబంధం కలిగి ఉంటే ఆ జాతకుడు ఇతరుల సహాయంతో ఉపాసన సాధనలలో సాఫల్యాన్ని పొందుతాడు.
- పంచమస్థానంలో రవి ఉన్నా రవిదృష్టి ఉన్నా ఆ జాతకుడు శక్తి ఉపాసనలో పరిపూర్ణ సాఫల్యాన్ని పొందుతాడు.
- పంచమస్థానంలోగాని నవమభావంలోగాని శుభప్రదమైన గ్రహం ఉన్నట్లయితే ఆ వ్యక్తి సగుణోపాసకుడవుతాడు.
- జాతకుని నవమభావంలో కుజుడుగాని కుజదృష్టిగాని ఉన్నట్లయితే అతడు శివారాధనలో సాఫల్యాన్ని పొందుతాడు

- నవమభావంలో మందగ్రహం ఉన్నట్లయితే జాతకుడు 'సాధువు' అవుతాడు మందుడు స్వరాశిలో లేదా ఉచ్చరాశికి సంబంధించి ఉంటే వృద్ధాప్యంలో విశ్వవిఖ్యాతమైన సన్యాసి కాగలడు
- జాతకంలో రవి బలం బలీయంగా ఉంటే ఆ జాతకదు శక్తి ఉపాసన చేస్తే శ్రేష్ఠమంటారు
- జాతకంలో చంద్రుడు బలంగా ఉన్నట్లయితే తామస ఉపాసనలో మనోరధసిద్ధి కలుగుతుంది
- జాతకంలో కుజుడు దృఢంగా ఉన్నట్లయితే శివసంబంధమైన ఉపాసనలో యీప్సిత సిద్ధి కలుగుతుంది
- బుధుడు ప్రబలంగా ఉన్న ఆ జాతకుని తంత్రసాధనలో విజయం నల్లేరు మీద బడి నడకే !
- గురుగ్రహం అనుగ్రహం శ్రేష్టంగా ఉంటే సాకారబ్రహ్మోపాసనలో లభించే ఖ్యాతి అనన్య సామాన్యమే!
- శుక్రుడు బలవత్తరంగా ఉన్న జాతకుని మంత్రసాధనలో పరిపూర్ణత సంపూర్ణంగా లభిస్తుంది.
- అర్కజుడు ప్రబలంగా ఉన్న జాతకుడు సిద్ధ ఉపాసకుడయి సువిఖ్యాతుడు కూడా అవుతాడు. ఇంకా అతడు మంత్ర తంత్రాలు రెండింటిలో సాఫల్యాన్ని పొందుతాడు
- జాతకుని లగ్నం మీదగాని, చంద్రుడిమీదగాని అసితుని దృష్టి ఉన్నట్లయితే జాతకుడు సఫల సాధకుడు కాగలడు.
- జాతకంలో కళానిధి నవమభావంలో ఉండి అతనిమీద ఏ గ్రహ దృష్టి లేనట్లయితే ఆ వ్యక్తి నిస్సందేహంగా సన్యాసిగా మారి జన్మ సాఫల్యాన్ని పొందుతాడు.
- దశమభావంలో మూడు గ్రహాలు బలంగా ఉండి ఉచ్చలో ఉంటే ఆ జాతకుడు తప్పనిసరిగా తన మంత్ర సాధనలో ఉన్నతిని పొందుతాడు
- దశమభావాధిపతి సప్తమభావంలో ఉంటే ఆ వ్యక్తి తాంత్రిక విద్యలలో విజయాలు పొందుతాడు
- దశమభావలోని ఉచ్చరాశిలోని బుధుడిమీద బృహస్పతి దృష్టి ఉన్నట్లయితే ఆ జాతకుడు జీవన్ముక్తుడవుతాడు.
- బలమైన నవమాధిపతి గురువు లేదా శుక్రుడితో కలిసి ఉన్నట్లయితే ఆ వ్యక్తి నిస్సందేహంగా సాధన క్షేత్రంలో విజయుడు కాగలడు.

- దశమాధిపతి రెండు శుభగ్రహాల మధ్య ఉన్నట్లయితే సాదకుడు తన సాధనలో సన్మానాలు కూడా అందుకుంటాడు
- వృషభరాశికి చెంది చంద్రుడు, గురుడు, శుక్రుడు ఈ ముగ్గురు కలిసి కేంద్రంలో ఉన్నట్లయితే ఆ వ్యక్తి ఉపాసనా క్షేత్రంలో ఉన్నతిని గడిస్తాడు
- జాతకంలో దశమాధిపతి, లగ్నాధిపతి వీరిరువురి పరస్పర స్థానపరివర్తన యోగం ఉన్నట్లయితే ఆ జాతకుడు నిస్సందేహంగా సిద్ధుడవుతాడు
- జాతకంలో గ్రహాలన్నీ చంద్ర, గురువుల మధ్య ఉన్నట్లయితే ఆ జాతకుడు తాంత్రిక విద్యలకంటే మంత్రానుష్ఠానంలో విశేష సాఫల్యాన్ని పొందగలడు
- కేంద్రంలో త్రికోణంలో అన్ని గ్రహాలు ఉన్నట్లయితే ఆ జాతకుడు కృషితో సాధన క్షేత్రంలో సాఫల్యాన్ని పొందగలడు.

పైన చెప్పిన ఇంకా అనేక యోగాలు ఉంటాయి కొన్నింటిని మాత్రమే క్రోడీకరించటం జరిగింది వీనిద్వారా సాధకునికి జాతకరీత్యా ఏ సాధన ఫలించగలదో గ్రహించి తదనుగుణంగా సాధనలో కృషిచేసి సార్ధకతను పొందాలి

కాలాంబుదాలి లలితోరసి కైటబారేః
ధారా ధరే స్ఫురతి యా తటిదంగ నేవ
మాతుస్సమస్త జగతాం మహనీయమూర్తిః
భద్రాణి మే దిశతు బార్గవనందనాయాః 5

బాహ్వాంతరే మురజితః శ్రితకౌస్తుభే యా
హారావలీవ హరినీలమయీ విభాతి
కామప్రదా భగవతో ఽ పి కటాక్షమాలా
కల్యాణమావహతు మే కమలాలయాయాః 6

ప్రాప్తం పదం ప్రధమతః ఖలు యత్ప్రబావాత్
మాంగల్యబాజి మదుమాథిని మన్మధేన
మయ్యాపతే త్తద్దిహ మంధర మీక్షణార్ధం
మందాలసం చ మకరాలయ కన్యకాయాః 7

దద్యాద్దయానుపవనో ద్రవిణాంబుధారా
అస్మిన్న కించన విహంగశిశౌ విషణ్ణే
దుష్కర్మ ఘర్మ మపనీయ చిరాయ దూరం
నారాయణ ప్రణయినీ నయనాంబువాహః. 8

# శ్రీయంత్రం - బీజ మంత్రాలు

'త్రికూట రహస్యం' శ్రీవిద్య పంచాదశీమంత్రంలో కనిపించే త్రికూటాలకు సంబంధించినవి వాగ్భవ కూటం, కామరాజకూటం, శక్తికూటం అనే మూడింటిని కలిపి 'త్రికూటాల'ని పిలుస్తారు శాక్త్యుపాసనా రహస్యాలు 'త్రికూట రహస్యం' అనే గ్రంథంలో అత్యంత గంభీరంగా చర్చించబడ్డాయి శ్రీసుందరీ మంత్రాల సూచిక దీనిలో మనకు కనిపిస్తుంది ఇందులో ఈ విద్యకు సంబంధించిన విభిన్న ఉపాసకులు దర్శించిన మంత్రాల నిర్దేశంకూడా ఉన్నది. ఉదహరణగా ఈక్రింది మంత్రాలు గమనించవచ్చు

1 క్లీం హ్రీం శ్రీం ఐం క్లీం సౌం । క ఏ ఈ ల హ్రీం హసకల హ్రీం సకల హ్రీం స్త్రీం ఐం హూం హసకల హ్రీం హసకల హ్రీం హం సః (సప్తదశి)

2 హసకలహ హ్రీం ససకహల హ్రీం సకల హ్రీం హసకల హ్రీం సహ సకహల హ్రీం సకల హ్రీం । (షోడశీద్వయం)

3 హసకల హ్రీం । హసకలహ హ్రీం హః । సకలహ హ్రీం । (లోపాముద్రా సప్తదశి) ఐం హః క్లీం హసౌః సః సప్తదశిలో ఈ బీజాలను జత చేసినట్లయితే అష్టాదశి విద్య యేర్పడుతుంది తొమ్మిది లక్షల జపానంతరం దీనిని జపిస్తారు

4 ఐం క 5 హ్రీం హ 6 శ్రీం సం 4 ॥ (అష్టాదశి)

5. ఐం క్లీం సౌః క 5 సౌః క్లీం ఐం ఔః ఐం క్లీం సౌః హ 6 సౌః క్లీం ఐం ఔ కల ఈసార (బ్రహ్మవిద్య, కాది, ఉన్మనీ) క్లీం, హః స హ క ల హ్రీం (వరుణోపాసితం)

6. కల హ్రీం హకహ హ్రీం సహకల హ్రీం । (ధర్మరాజోపాసితం)

7. క సకల హ్రీం హసకల కల హ్రీం సకల రలహ్రీం (వహ్న్యుపాసితం)

8 హసకల హ్రీం హః సకల హ హ్రీం హసకలర హ్రీం (నాగరాజోపాసితం)

9 కయే రల హ్రీం హకరల హ్రీం సకలర హ్రీం (వాయూపాసితం)

10 క ఏ ఈరల హ్రీం హకహలర హ్రీం సకల హ్రీం (బుధోపాసితం)

11 కహల హ్రీం హకల హలలర హ్రీం సకల హ్రీం (ఈశానోపాసితం)

12 క 5 హ 6 స 4 (పంచాదశి రాత్ర్యుపాసితం)

13. క 5 హ 6 స 4 స 4 హ 6 క 5 (30 అక్షరయుత నారాయణోపాసితం)

14. కహకహసర హ్రీం హసకల హ్రీం । (బ్రహ్మోపాసితం)

15. హక హసర హ్రీం హసకల హ్రీం (జీవోపాసితం)

16. హసకల హ్రీం హసకహల హ్రీం సకఏల హ్రీం (లోపాముద్రోపాసితం)

17. సహ కఏ ఈల హ్రీం సహకహఏ ఈల హ్రీం ।
సక ఏ ఈల కహ ఏ ఈల హ్రీం కఏ ఈల హ్రీం
సక ఏఈల హ్రీం । (మనూపాసితం)

18 హాక ఏ ఈల హ్రీం హసకహ ఏ ఈల హ్రీం హరక ఏఈల హ్రీం । (కుబేరోపాసితం)

19 క ఏ ఈల హ్రీం హసకహల హ్రీం సహసకల హ్రీం । (అగస్త్యోపాసితం)

20. స ఏ ఈల హ్రీం సహకహల హ్రీం సకల హ్రీం । (నంద్యుపాసితం)

21 క యే ఈల హ్రీం సహకల హ్రీం సహసకల ।
హ్రీం కయే ఈల హంస కహల సహ సకల హ్రీం ॥ (శివోపాసితం)

ఇలాగే ఇతర అనేకవిధ మంత్రస్వరూపాలు 'నాభివిద్య' 'రాజవిద్య', "గుహ్యావిద్య" పారాయణమంత్రాల్లో కూడా ప్రయుక్తమై ఉన్నాయి అందువల్లనే 'త్రికూటరహస్యం' ఒక మహిమాన్వితమైన గ్రంథం

ఇష్టా విశిష్టమతయోఽపి యయా దయార్ద్ర
దృష్టా స్త్రివిష్టప పదం సులభం లభంతే
దృష్టిః ప్రవృష్ట కమలోదర దీప్తిరిష్టాం
పుష్టిం కృషీష్ట మమ పుష్కర విష్టరాయాః. 9

గీర్దేవ తేతి గరుడధ్వజ సుందరీతి
శాంకభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయకేళిషు సంస్థితాయై
తస్యై నమ స్త్రిభువనైక గురో స్తరుణ్యై. 10

శ్రుత్యైనమోఽస్తు శుభకర్మ ఫలప్రసూత్యై
రత్యైనమో ఽస్తు రమణీయ గుణార్ణవాయై
శక్త్యైనమోఽస్తు శతపత్ర నికేతనాయై
పుష్ట్యైనమో ఽస్తు పురుషోత్తమ వల్లభాయై. 11

నమోఽస్తు నాళీక నిభాననాయై
నమో ఽస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై
నమో ఽస్తు సోమామృత సోదరాయై
నమో ఽస్తు నారాయణ వల్లభాయై. 12

# శ్రీ యంత్ర సాధనలో రెండు కులాలు

"కాది", "హాది" (అది, కహాది) విద్యలను గురించిన చర్చ అతిప్రాచీన గ్రంధాలలో మనకు లభిస్తుంది. సృష్టికి పూర్వం ఏకైక దేవీస్వరూమే ఉన్నదన్న విషయాన్ని ఋగ్వేదీయు మైన "బహవృచోపనిషత్తు" పేర్కొన్నది ఆ దేవియే ఈ బ్రహ్మాండం యొక్క సృష్టి గావించింది. ఆమె "కామకళ" అనే పేరుతో విఖ్యాత ఆమెనే 'శృంగారకళ' అనికూడా పేర్కొంటారు ఆమె నుండియే బ్రహ్మదేవుడు ఉద్భవించాడు విష్ణుమూర్తి, శాంభవీవిద్య, రుద్రుడు ప్రాదుర్భవించాడు అమెయే (అపరాశక్తి ఆమెయే శాంభవీవిద్య, హాదివిద్య, కాదివిద్య, హాదివిద్య ) సాదివిద్య అని పిలువబడుతుంది ఆమెయే రహస్యరూప ఆమెయే ప్రణవవాక్య, అక్షరతత్త్వము "ఓం" అనగా సచ్చిదానంద స్వరూపఅయిన అమె వాగ్రూపంలోనే (వాఙ్మయంగా) ప్రతిష్ఠమై ఉన్నది బృహవృచోపనిషత్తు ఇంకా ఇలా పేర్కొన్నది. "వేదమంత్రాలు ఒక అవినాశకమైన పరమ ఆకారంలో ప్రతిష్ఠితమై ఉన్నాయి వాటిల్లో సకల దేవతలు చక్కగా నివాసమేర్పరచుకొని ఉంటారు. వారిని తెలుసుకొనే ప్రయత్నం చేయనివాడు వేదాధ్యయనంతో ఏమి సాధించగలడు?"

శక్తి సంప్రదాయానికి చెందిన 'కాది' 'హాది' (విద్యల) ఆద్యస్వరూప జ్ఞానం దీనిద్వారానే ఉపలబ్ధమవుతుంది. లలిత, దుర్గలను పరబ్రహ్మస్వరూపంగా ఉపనిషత్తులలో చింతన చేయబడింది. "శక్తి" కి సంబంధించిన మూలపంచదశాక్షరీ మంత్రంలో "క" వర్ణం మరియు 'హ' వర్ణం రెండు వర్ణాల ఆదిత్వాన్ని బట్టి ఈ మతాల (సంప్రదాయాలు) స్వరూపం యేర్పడుతుంది. శ్రీ విద్యావిశేషాన్ని శ్రీదేవీ మహాత్మ్యం ఇలా పేర్కొంది

విద్యాః సమస్తాస్తవ దేవి భేదాః
స్త్రియః సమస్తాః సకలా జగత్సు ॥ (మార్కండేయు: దుర్గా 11/6)

శక్తి సాధనలలో మంత్రం ప్రధాన సాధనంగా పరిగణించబడుతుంది మంత్రం యొక్క వాచకశక్తి విమర్శశక్తి – ఈ శక్తికి (మూలరూపంగా ఉంటాయి మంత్రం యొక్క వాచకశక్తి వాచ్యదేవతను) ప్రకాశితం చేస్తుంది. ఇదే శక్తి సాధన యొక్క ప్రయోజనం కూడా. శక్తిమతంలో భోగమోక్షాలు రెండింటి ఏకవాక్యత నిరూపించబడింది దానిలో త్యాగానికి, వైరాగ్యానికి విశేషస్థానం కల్పించబడలేదు. స్త్రీజాతి ప్రతిష్ఠ వారి పూజనీయత విషయంలో ఈ సంప్రదాయంలో అత్యున్నత స్థానం ఉంది ధర్మసాధనలో స్త్రీ సహాయకురాలు (సహధర్మచారిణి) అన్న అభిప్రాయం ఈ మతస్థులలో స్పష్టంగా ఉంది దీనిని ఆచరణలో కూడా పాటిస్తారు. వాచక తంత్రం వాక్యదేవతను స్పష్టం చేసినప్పుడు అది "విద్యా"

నామాన్ని ధరిస్తుంది "విద్యా శరీరవత్తా మంత్ర రహస్యమ్" అనగా విద్యామయమూ, శరీరయుక్తమూ అవడమే మంత్రం యొక్క రహస్యం అని కూడా చెప్పబడింది

మూల పరాదేవత అనగా శక్తి తత్త్వస్వరూపం చిన్మయమూ, ఆనందమయమూ ఇంకా ఆ స్వరూపం మధ్య ఆనందమైన చేతన నుండి మూడు రేఖలు ప్రటితమవుతాయి మధ్యకేంద్రంమీది బిందువులను ప్రధానదేవతగా పేర్కొంటారు దానినుండి ప్రకటితమయ్యే లఘుబిందువులు జ్ఞానక్రియ, ఇచ్ఛాలకు సంబంధించిన మూడు బిందువులు వీటిని "అపరబిందువులు" అంటారు ఈ మధ్య కేంద్రం నుడి బలాన్ని పొంది కోణబిందువులయ్యే రేఖలు వాటిని కలిపే రేఖలతో సబిందు త్రికోణం ప్రధాన చిదాకాశంలో ప్రకటిత మవుతుంది అది విమర్శశక్తి యొక్క ఆద్య సూచక యంత్రమవుతుంది

తాంత్రికులు, మీమాంసకులు, వైయాకరణులు, యోగులు శబ్దార్థాల మధ్య ఆనాదియైన ప్రకాశ్య – ప్రకాశక సంబంధాన్ని భావిస్తారు. తాంత్రిక సంప్రదాయానుసారం దేవతయొక్క శరీరం బీజాక్షరంతో అనగా బీజాక్షరాల్ల ప్రకటితమవుతుంది పరదేవత అనగా పరాశివ శక్తిమయ రూపం పరబ్రహ్మమూ లేదా నాదబ్రహ్మమును ఆశ్రయించి సాధకుని చిత్తంలో ప్రత్యక్షమవుతుంది (సాక్షాత్కరిస్తుంది). సాధకుని అభీష్టసిద్ధికి ఆ సాక్షాత్కారాలే సాక్ష్యం





పైన చిత్రించిన త్రికోణయంత్రంలో పరబిందువులకు శూన్యసంజ్ఞ ఇవ్వబడింది. కాని దానిభావం శూన్యంకాదు. సచ్చిదానందం యొక్క వైభవోక్తమైన మూలతత్త్వం తన అంతర్గత శక్తిని బహిర్గతం చెయ్యడంలో ఇప్పుడే వేరుకాలేదు. దీనివల్ల అది శూన్యంకాదు. ఈ శూన్యబిందువు మహాకాలుని కళతో అనగా 'అహంభావం'తో విడివడి ఉబికివచ్చే

భావంతో కూడినదై తన (నిజ) స్వరూపాన్ని తెలుసుకొనేదవుతుంది అప్పుడు అది వృత్త సహితమైనదవుతుంది (సవర్తుల మవుతుంది) అదే కార్యబిందువు అదే "స్వరూపస్య కలానాలూ" కాళి(లి)-అని పిలువబడుతంది దీనికి మరోపేరు "ఆద్య" లేదా "విద్యా రాజ్ఞి" ఎందుకంటే మంత్రోదయంలో దాని ప్రకటనాక్రమం ప్రథమంగానే ఉంటుంది.

త్రికోణానుసారం శక్తి యొక్క ప్రసరణం రేఖద్వారా కలుగుతుంది దీనివల్ల మూడు అవాంతరశక్తులు, పురుషుల ఆవిర్భావం, మూడు విధాలయిన (కర్మలు, ముదు విదాలయిన జ్యోతులు (వెలుగులు) మూడు విదాలయిన) గుణాలు వ్యక్తమవుతాయి వాటిమీద ఒకే పరబిందువు, పరాశక్తియొక్క ఆదిపత్యం ఉంటుంది కనుకనే ఆమె "త్రిపురాంబా" నామంతో కీర్తింపబడుతుంది కోణాన్ని సంస్కృతభాషలో "యోని" అంటారు తన అంతర్గత వేగాన్ని బహిర్గతం చేసే సమయంలో దాని సౌచుర్యాన్ని "శక్తితత్త్వం" అని పేర్కొంటారు ఈ శక్తి తత్త్వ బీజంతో ప్రణవం యొక్క సంబంధం వల్ల లేదా శివతత్త్వాత్మక నాదం యొక్క క్షోభ (ఘోష) వల్ల ఆకారాది వర్ణాలు సదాలు, వాక్యాలు రచనా సచేతనత్వం వ్యక్తిద్వారా జరుగుతుంది. ఈ శక్తి బీజాలలో నుంచి ఏయే మంత్ర ప్రాప్తి ఉదయక్రమానుగుణంగా అనుభవజ్ఞుడైన ఉపాసకునికి కలిగిందో, వాటినే మంత్ర సంప్రదాయంలో "దశవిద్య" అని పేర్కొంటారు



అ. రౌద్రీశక్తి, రుద్రపురుషుడు, జ్ఞానశక్తి ప్రాధాన్యం, సంహారకర్మ, అగ్నిజ్యోతి తమో గుణం

బ. జ్యేష్ఠాశక్తి, బ్రహ్మాపురుషుడు, ఇచ్ఛాశక్తి ప్రాధాన్యం, ఉత్పత్తికర్మ, సోమజ్యోతి, రజోగుణం

స. వామాశక్తి విష్ణు పురుషుడు, క్రియాశక్తి ప్రాధాన్యం, పాలనకర్మ, సూర్యజ్యోతి, సత్త్వగుణం.

ఈ పదింటియొక్క రచనావ్యవస్థ మళ్ళీ రెండు సముదాయాలలో (కులాలలో) ఉంటుంది

1 కాళీకులం 2 శ్రీకులం అందువల్లనే శక్తి సంప్రదాయ దృష్టిలో 'శ్రీయంత్రం' రెవండువిధాలుగా ఉంటుంది

1 వ్యయ కాది – విద్యానుసారం 2 హాది విద్యానుసారం (మూడో విధానం కూడా ఉన్నది దానిని 'కహాది విద్య' అంటారు (దాని కూడిక (యోజన) వెనుకనుంచి ఉంటుంది )

'కాది' విద్యా మహామంత్రారంభం 'క' కారంతో ఉంటుంది హాది విద్యా మహామంత్రారంభం 'హ' కారంతో ఉంటుంది. రెండు విద్యలలో పంచదశాక్షరాలు (15) ఉంటాయి

కాది విద్యా మహామంత్రం – క ఏ ఈలహ్రీం హ స క హ ల హ్రీం సకల హ్రీం ।

హాది విద్యామహామంత్రం – హ స క ల హ్రీం హస క హ ల హ్రీం సకల హ్రీం ।

కార్య బిందువులోనుంచి మూడు అవాంతరబిందువులు యేర్పడతాయి అపరబిందువు, నాదము, బీజము వీటిలో అపరబిందువు చేతనామయం కాగా నాదము జడాజడంగా, బీజం జడంగా ఉంటాయి అపరబిందువుకు మరోపేరు "శ్రద్ధబ్రహ్మ" పైన చెప్పిన త్రికోణం యొక్క ఉత్పత్తి మూడురేఖల ద్వారా జరిగింది దీనినే 'త్రిపురబీజం' అని మంత్ర శాస్త్రజ్ఞులు నామకరణం చేశారు క్రిందిభాగంలో గీసిన కోష్ఠకం (కుండలీ కరణం లేదా ప్రాకారం) ద్వారా దాని స్వరూపం మరింత స్పష్టమవుతుంది

కాది విద్యోపాసకులలో అగస్త్యఋషి హాది విద్యోపాసకులలో అగస్త్యముని ధర్మపత్ని లోపముద్రాదేవి ఉన్నారు తాంత్రిక ఆగమాలలో "కామమే పరమశివుని నామంగా ఉన్నట్లు చెప్పబడింది. కాది విద్యయందు అత్యంత శ్రద్ధాభరితులైన ప్రధమాచార్యులలో పరమశివుడు, దుర్వాసుడు, హయగ్రీవుడు (విష్ణుమూర్తి), అగస్త్యుడు అగ్రగణ్యులు. కాది విద్య ప్రధాన విద్య కాగా హాదివిద్య గౌణము

నమో ఽ స్తు హేమాంబుజ పీఠికాయై
నమో ఽ స్తు భూమండల నాయికాయై
నమో ఽ స్తు దేవాది దయాపరాయై
నమోఽ స్తు శార్ఙ్గా యుధ వల్లభాయై 13

# శ్రీవిద్యారహస్యం

శ్రీవిద్యోపాసన ఆత్మశక్తియొక్క ఉపాసన హారితాయన సంహిత, త్రిపురా రహస్యం మహాత్మ్యఖండంలోని చతుర్థాధ్యాయంలో సందర్జ మహాముని అడిగిన ప్రశ్న ఒకటి ఉంది పరశురాముని వలన భయపీడితులైనవారికి ఏ మార్గం ఉత్తమమైనదీ? అన్నది ప్రశ్న దానికి సమాధానంగా గురువు యొక్క ఉపదేశితమార్గంలో స్వాత్మశక్తి, మహేశ్వరి త్రిపురా దేవిని ఆరాధించి ఆమె కృపకు పాత్రులవుతారు సర్వసాభ్యాశ్రయాత్మకమైన సాత్త్వికభావాన్ని పొంది దృశ్యమానమైన దంతా (కంటికి కనబడేదంతా) ఆభాసమాత్రమైన సారశక్తి యొక్క విలాసమేనని గ్రహించి గురునిర్దేశిత పథంలో అభయుడవై నిస్సంశయుడవై ఓ పరశురామా! నీవు కూడా నా వలెనే యథేచ్ఛగా సంచరించు సర్వ భావాలలో స్వాత్మను, స్వాత్మలో సర్వభావాలను దర్శిస్తూ పిండాహంభావాన్ని త్యజించి వేతృభావ మనే ఆసనంపై స్థిరంగా ఉండు. స్వదేహాన్ని వేధ్యమైనదిగా భావిస్తూ వేత్తమీద దృష్టి ఉంచు. స్వతంత్ర తంత్రములో ఇలా చెప్పబడింది- స్వాత్మమే విశ్వాత్మికమైన లలితాదేవి. దాని వివరణమే ఆమె రక్తవర్ణము. ఆ విధమైన భావనయే ఆమె యొక్క ఉపాసన.

## 1. కామేశ్వరి - ఉపాసక స్వరూపము

స్వాత్మశక్తి శ్రీవిద్యయే లలితా, కామేశ్వరీ త్రిపురసుందరి. ఆమెయే మహాకామేశ్వ రాంకంమీద విరాజిల్లుతూ ఉంటుంది. ఉపాధిరహితమైన శుద్ధస్వాత్మమే మహా కామేశ్వరుడు సదానందరూపమైన ఉపాధిపూర్ణమైన స్వాత్మయే పరదేవత మహాత్రిపుర సుందరీ లలిత

## 2. పంచప్రేతాసన

రాజరాజేశ్వరి అయిన శ్రీవిద్యామాత పంచప్రేతాసీనమై ఉంటుంది. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు ఐదుగురు పంచమహాప్రేతములు దీని రహస్యమేమిటంటే - నిర్విశేష బ్రహ్మయే తన శక్తి విలాసం ద్వారా బ్రహ్మవిష్ణు ఇత్యాది పంచనామాలను పొంది వామాది తత్తచ్ఛక్తి సాన్నిధ్యం వల్ల సృష్టి, స్థితి, లయ, నిగ్రహానుగ్రహరూపమైన పంచకృత్యాలను సంపాదించుకొంటాడు. పంచభూతాలకు ఈ పంచబ్రహ్మలు అధిపతులు. వీరి శక్తి క్షీణించినపుడు అనగా తమ తమ వామాదిశక్తి రహితులై క్రియాశూన్యులైనప్పుడు,

సామర్ధ్యరహితులైనప్పుడు వారు ప్రేతములని పిలువబడతారు అప్పుడు వారిలో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు నలుగురు నాలుగుకోళ్ళుగాను, సదాశివుడు పర్యంకంగాను మహాకామేశ్వరాంకస్థమై మహాకామేశ్వరి విరాజిల్లుతూ ఉంటుంది.

## 3. శ్రీ విద్య ఆయుదాలు

శ్రీవిద్య లలిత, కామేశ్వరి మహాత్రిపురసుందరి అయిన జగదేకమాతను కవికుల తిలకుడు కాళిదాసు "పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః" అంటూ కీర్తించాడు శ్రీమాత నాలుగు చేతులలో పాశము, అంకుశము, ఇక్షుకాదండము, పంచపుష్ప బాణాలను కలిగి ఉంటుంది ఈ ఆయుధాలలో ఉన్న శ్రీమాతను మనం నిత్యం ధ్యానిస్తాము కనుక ఈ ఆయుధ స్వరూపాన్ని తెలుసుకోవడం అవసరం

## 4. పాశం

36 తత్త్వాలలోని 'రాగం' అనగా 'ప్రీతి' అనే తత్త్వమే పాశం బంధకత్వ ధర్మంతో సామ్యం ఉండటంవల్ల ఆ రాగాన్నే పాశరూపంలో అమ్మవారు తన ఎడమచేతిలో ధరించింది. రాగఃపాశః – అనగా రాగమే పాశము

## అంకుశం

ద్వేషో అంకుశః ద్వేషమే (క్రోధమే) అంకుశం

## ఇక్షుదనువు (చెఱకుగడవిల్లు)

మనః ఇక్షుధనుః అనగా సంకల్పవికల్పాత్మక క్రియారూపమైన మనస్సే ఇక్షుధనుస్సు

## పంచబాణాలు

శబ్దాది తన్మత్రాః పంచపుష్పబాణాః అనగా శబ్దస్పర్శ రూపరసగంధాలు ఐదూ పంచతన్మత్రలు ఈ పంచతన్మత్రలే పంచ పుష్పబాణాలు

**ఇచ్ఛా శక్తి మయం పాశమంకుశం జ్ఞాన రూపిణమ్ ।**
**క్రియా శక్తి మయే బాణ ధనుషీ దధ దుజ్వలమ్ ॥**

అనగా పాశం ఇచ్ఛాశక్తి స్వరూపం. అంకుశం జ్ఞానశక్తి స్వరూపం ఇక్షుకోదండం (చెఱకుగడవిల్లు) పంచబాణాలు క్రియాశక్తి స్వరూపాలు

## 8. శ్రీ విద్యయే బ్రహ్మావిద్య

కామో యోనిః కమలా వజ్రపాణి ర్గుహా హసా మాత రి శ్వాభ్ర మిన్ద్రః ।
పునుర్గుహా సకలా మాయయా చ పురూచ్యైషా విశ్వమాతాది విద్యోమ్ ॥

శ్రీదుర్గాసప్తదశిలో దేవధర్వ శీర్షికాంతర్గతమైన శ్లోకంలో శ్రీదేవీ మూలమంత్రం చెప్పబడింది ఇదే మంత్రబ్రహ్మ విద్య లేదా మూలవిద్య

| | | | |
|---|---|---|---|
| కామ | - క | మాతారిశ్వా (వాయు)- | క |
| యోని | - ఏ | అభ్ర | - హ |
| కమలా | - ఈ | ఇంద్ర | - ల |
| వజ్రపాణి (ఇంద్ర)- | ల | పునర్గుహా | - హ్రీం |
| గుహా | - హ్రీం | సకల వర్ణ | - సకల |
| హసవర్ణ | -హస | మాయా | - హ్రీం |

ఈవిధంగా సర్వాత్మకమైన జగన్మాత మూలవిద్యా బ్రహ్మరూపిణి యొక్క మంత్రం యేర్పడింది.

"కఏఈల హ్రీ హ స క హ ల హ్రీం స క ల హ్రీం" - ఇదేవిధంగా శాక్తప్రమోదం లోని మంత్రోద్ధారంలో ఈ మంత్రవర్ణన ఉన్నది

ఆదౌ లజ్జాం సముచ్చార్య క యే ఈ ల తతః పరమ్।
పునశ్చలాజ్జాముచ్చార్య హ స క హ ల తు తత్పరమ్ ॥
తతో లజ్జాం పునః ప్రోచ్య లజ్జాన్తం సకలం తతః ।
షోడశాక్షర మంత్రోఽయం షోడశ్యాః సముదాహృతః ॥
ఇయన్తు సున్దరీ విద్యా దేవానామపి దుర్లభా ।
గోపనీయ ప్రయత్నేన సర్వసంపత్కరీ మతా ॥

బ్రహ్మావిష్ణు శివాత్మిక, సరస్వతి లక్ష్మి, గౌరీరూప, అశుద్ధమిశ్ర శుద్ధోపాసనాత్మిక, సమరసీభూత శివ శక్త్యాత్మక బ్రహ్మ స్వరూపం యొక్క నిర్వికల్ప జ్ఞానప్రదాత్రియైన సర్వాతత్త్వాత్మిక మహాత్రిపురసుందరి - అని ఈ మంత్రం యొక్క భావార్థము. ఈ మంత్రం అన్ని మంత్రాలకు మకుటమణి మంత్రశాస్త్రంలో పంచదశి ఆది శ్రీవిద్యానామంతో ప్రసిద్ధం. దీనికి ఆరువిధాలయిన అర్థాలున్నాయి. - భావార్థం, వాచ్యార్థం, సంప్రదాయార్థం, లౌకికార్థం, రహస్యార్థం, తత్త్వార్థం ఈ ఆరు విధాలయిన అర్థాలు 'నిత్యషోడశికార్ణవం'లో చెప్పబడ్డాయి ఇదేవిధంగా 'వరివస్యారహస్యం' లో ఇంకా

అనేక అర్థాలు బోధింపబడ్డాయి శ్రుతులలో కూడా స్వరూపోచ్చారంగా, లక్షణగా, లక్షిత లక్షణగా ఇంకా కొన్నిచోట్ల వర్ణాలు భిన్నభిన్న అవయవరూపంలో దర్శింపజేసి కావాలనే భ్రమాత్మకతలో పడవేయడం జరిగింది వస్తుతః ఈ మంత్రం అత్యంత రహస్యమయమూ మహిమాన్వితము అని ఇక్కడ మనం గ్రహించాలి

ఏషా ఆత్మశక్తిః, ఏషా విశ్వమోహినీ పాశాంకుశ ధనుర్బాణధరా।
ఏషా శ్రీమహావిద్యా । య ఏవం వేద స శోకం తరతి, సశోకం తరతి॥

ఈమె పరమాత్మయొక్క శక్తి ఈమె విశ్వామోహిని పాశము, అంకుశము, ధనుస్సు, బాణాలను ధరించినది. ఈమె శ్రీమహావిద్య ఈ విధంగా ఆమెను తెలుసుకొన్నప్పుడు శోకాన్ని అధిగమించగలరు (దాటగలరు)

"నమస్తేఽస్తు భగవతి । మాత రస్మాన్ పాహి సర్వతః ।"

"హే భగవతి! నీకు నమస్కారము మాతా! అన్నివిధాలా మమ్మల్ని రక్షించు" అని భావం.

సైషా దష్టౌ వసవః సైషైకాదశ రుద్రాః సైషా ద్వాదశాదిత్యాః ।
సైష విశ్వేదేవాః సోమపాః అసోమపాశ్చ సైషా యాతుధానా అసురా
రక్షాంసి పిశాచా యక్షాః సిద్ధాః సైషా సత్త్వరజస్తమాంసి సైషా ।
బ్రహ్మవిష్ణు రుద్రరూపిణీ సైషా ప్రజాపతీంద్ర మనవః సైషా గ్రహ
నక్షత్ర జ్యోతిషి, కలా కాష్ఠాది కాలరూపిణీ తామహం ప్రణామి నిత్యమ్।"

మంత్రద్రష్టలైన ఋషులిలా ప్రవచించారు ఈమెయే అష్టవసువులు. ఈమెయే ఏకాదశ రుద్రులు. ఈమెయే ద్వాదశాదిత్యులు (సూర్యులు). ఈమెయే సోమపానం చేసేటువంటి, సోమపానం చెయ్యనటువంటి విశ్వదేవుడు (దేవత). ఈమెయే యాతుధాన (ఒకవిధమైన రాక్షసుదు) అసుర, రాక్షస, పిశాచ, యక్ష, సిద్ధులు. ఈమెయే సత్త్వరజస్తమోగుణాలు ఈమెయే బ్రహ్మవిష్ణు రుద్రరూపిణి. ప్రజాపతి ఇంద్రుదు ఈమెయే గ్రహాలు, నక్షత్రాలు, తారాగణాలు ఈమెయే కళా కాష్ఠాది కాలరూపిణి కూడా ఈమెయే అటువంటి దేవికి నేను నిత్యమూ (సదా) నమస్కరిస్తున్నాను.

పాపాప హారిణీం దేవీం భుక్తిముక్తి ప్రదాయినీమ్ ।
అనంతా విజయాం శుద్ధాం శరణ్యాం శివదాం శివామ్ ॥

పాపనాశిని, భోగమోక్షప్రదాయిని, అనంత, (అంతరహిత) విజయనిర్దోష, శరణ్య, కళ్యాణ (కారిణి) దాయిని మంగళస్వరూప అయిన దేవికి మేము నిత్యము నమస్కరిస్తాము.

దేవీ ప్రణవం : "హ్రీం"

వియదీకార సంయుక్తం వీతి హోత్ర సమన్వితమ్ ।
అర్ధేందు లసితం దేవ్యా బీజం సర్వార్థసాధకమ్ ॥

మంత్రాలలో దేవ ప్రణవానికి (ఓంకారానికి) మహిమ ఉన్నట్లుగానే దేవీ ప్రణవానికి అదే మహిమ ఉన్నది

వియత్ (ఆకాశం) – హ, ఈకారసంయుక్తం – ఈ, వీతిహోత్ర (అగ్ని)– ర, అర్ధేందు లసితం – (చంద్రబిందువు)

అనగా "హ్రీం" దేవీ ప్రణవం లేదా దేవి యొక్క బీజమంత్రం. శుద్ధాంతఃకరణులు, నిరతిశయానంద పూర్ణమైన చిత్తులు, జ్ఞానసాగరులు అయిన పురుషులు ఈ విధమైన ఏకాక్షర బ్రహ్మను ధ్యానిస్తారు

సంక్షిప్తంగా దీని అర్థమేమిటంటే – ఇచ్ఛా, జ్ఞాన, క్రియాధార, అద్వైత, అఖండ, సచ్చిదానంద, సమరసీభూత శివశక్తులను స్ఫురింపజేసేది ఈ బీజమంత్రం

వాఙ్మాయా బ్రహ్మ సూస్తస్మాత్ షష్ఠం వక్త్ర సమన్వితమ్ ।
సూర్యో ఽ వామ్ స్తోత్ర బిందు సంయుక్తష్టాతృతీయకః ॥
నారాయణేన సం మిశ్రో వాయుశ్చాధర యక్ తతః ।
విచ్చే నవార్ణ కోదర్ణః స్యాన్మహదానంద దాయకః ॥

అనగా వాక్ వాణి (ఐ) మాయా (హ్రీం)బ్రహ్మ సూః– కామం (క్లీం) తదనంతరం షష్ఠం వక్త్ర సమన్వితమ్–వర్ణమాలలో ఆరవ అక్షరం 'ఆ' కారంతో కూడినది (చా), సూర్య (మ),అవామశ్రోత్ర–దక్షిణ కర్ణం (ఉ 3), బిందువు అనగా అనుస్వారయుక్తం (ముం),టాతృతీయకః – అనగా 'ట' వర్గంలో మూడవ అక్షరం – (డ), నారాయణేన సమ్మిశ్ర – అనగా 'ఆ' కారంతో కలిసి ఉన్నది – (డా), వాయు (య) అదే అక్షరం అధరం 'ఐ' తో కూడినది అనగా(యై) మరియు విచ్చే అనే ఈ నిర్వాణమంత్రం (ఐ హ్రీం క్లీం చాముండాయై విచ్చే) ఉపాసకులకు మోక్షానందాలను ప్రసాదించేది

## 9. నవార్ణమంత్రానికి అర్థం

**హే చిత్త స్వరూపిణీ మహాసరస్వతీ! ఓ సద్రూపిణీ మహాలక్ష్మీ ! ఓ ఆనందరూపిణీ మహాకాళీ! బ్రహ్మవిద్యను పొందటానికి మేమంతా నిన్ను ధ్యానిస్తున్నాము. ఓ మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీస్వరూపిణీ చండీ! నీకు నమస్కారము. శ్రీవిద్యారూపమైన గట్టి త్రాటిముడిని విప్పి మమ్మల్ని విముక్తుల్ని చెయ్యి!**

# మంత్ర సృష్టి

ప్రపంచంలో గర్భవాసంనుండి బయటపడ్డ ప్రతిప్రాణీ తన జ్ఞానతంత్రుల వికాసం యొక్క మొదటి మెట్టుకు చేరడంతోటే సుఖాన్ని కోరుకుంటుంది ప్రవృత్తులు వృద్ధి పొందు తున్న కొద్దీ మనస్సు అనే మృగం పరుగులు పెడుతూనే ఉంటుంది ప్రతి జీవీ ప్రకృతిలోని సంసారంలో అణువణువునా సుఖాన్ని వెదుకుతూ స్వార్థ సాఫల్యానికి అఱ్ఱులు సాచు తూంటాడు మనస్సులో చెలరేగే భావాలను సాకారరూపంలో దర్శించాలను కొంటాడు అయితే ఒకళ్ళనుమించి ఒకళ్ళన్నట్లు సుఖం అతడినుండి దూరంగా పారిపోతూ ఉంటుంది. ఈ సుఖవాంఛాదృష్టితో సుఖం ఎంత సహజమైనదిగా అనిపిస్తుందో, దానిని పొందడంలో మాత్రం అంత కఠోరంగా మెండిగా ఉంటుంది. ఒకవేళ సుఖప్రాప్తి సులభమైనదైతే కేవలం అది మంత్ర తంత్ర యంత్రాల మాధ్యమంగానే సాధ్యమవుతుంది ఆ యంత్ర తంత్రాలు కూడా కేవలం గురుకృపవల్లనే సంప్రాప్తిస్తాయి అయితే

## మంత్రమంటే ఏమిటి?

మంత్రం సూక్ష్మమైన మహత్వపూర్వకమైన తత్త్వము. దీనిద్వారా మందబుద్ధిమీద నియంత్రణ, విరాట్ స్వరూపాన్ని (పరబ్రహ్మనం) స్ఫూర్తిమంతంగా ఉంచడానికి, పిండాండంలో బ్రహ్మాండాన్ని చూసే దృష్టి ఉన్నది ప్రకృతిని వశంలోకి తెచ్చుకొనే అపూర్వశక్తి కూడా మంత్రంలో ఉన్నది

ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువన త్రయమ్ ।
యది శబ్దాలయం జ్యోతి రా సంసారాన్న దీప్యతే ॥

శబ్దరూపమైన జ్యోతియే గనుక సృష్ట్యారంభంలోనే ఉండిఉండనట్లయితే ఈ త్రిలోకాలలోని ప్రజలు నేటి వరకూ అంధకారంలోనే మునిగిపోయి ఉండేవారు.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

జీవనమూలాధారం సాధన సాధనకు మూలాధారం శబ్దం. ఎందువల్లనంటే శబ్దం లేకుండా అర్థోత్పత్తి సాధ్యంకాదు. కాబట్టి వాగర్థాలు రెండింటికి సంబంధము సరిగ్గా శివశక్తుల సంబంధమువలెనే ఉంటుంది

శంభోర్జ్ఞాన క్రియేచ్ఛా బలకరణ మనః శాంతితేజ శ్శరీర ।
స్వర్లోకాగార దివ్యాసన పర మహిషీ భోగ్య వర్గాది రూపా ॥

సర్వే రే తై రూపేతా స్వయమపి చ పరబ్రహ్మణస్తస్య శక్తిః ।
సర్వాశ్వత్యే క భూమి ర్మునిభి రభినుతా వేద తంత్రాఖయుక్తై ॥

శక్తియొక్క మూలంలో శబ్దమే పరిభ్రమిస్తూ ఉంటుంది దీనినే తాంత్రిక క్షేత్రంలో 'కామశక్తి' అని, తంత్రోక్త నిరూపణంలో 'మహామంత్రమని' పిలుస్తారు ఈ శబ్దం ప్రస్ఫుటమైనదిగా, గోపనీయమైనదిగా రెండు విధాలుగా ఉపయోగకరంగా ఉంటుంది "గుహ్యాతిగుహ్యో గోప్తత్వం" అన్నదానిని బట్టి మనస్సులోనే రహస్యపద్ధతిలో ఉచ్చారణ రహితంగానే మంత్రజపంలో ధ్యానం జరుగుతుంది అప్పుడు పరమాత్మ సిద్ధి కలుగుతుంది

మానవుడు తన నోటితో ఏ శబ్దాన్నిగాని, ధ్వనినిగాని ఉచ్చరించినా అది మంత్ర రూపాన్ని పొందుతుతుంది అయితే ఈ ధ్వని లేదా శబ్దం ఒక పద్ధతిలో కూర్చబడి నట్లయితే దానిలో ఒక విషయలయ యొక్క సృష్టి జరుగుతుంది ఆ సృష్టియే మంత్రరూపాన్ని పొందుతుంది.

మీరు ఒక చోట కూర్చున్నారనుకోండి ఇంతలో ఒక దీనుడైన బికారి మీవద్దకు వచ్చి బిచ్చమడుగుతాడు కాని వాడికి మీరేమీ ఇవ్వరు మరి కొంతసేపటికి మరొక బిచ్చగాడు వచ్చి మిమ్మల్ని యాచిస్తాడు. కాని వాడికి ఏదో ఒకటి ఇవ్వకుండా మిమ్మల్ని మీరు నిరోధించుకోలేరు ఎందుచేతనంటే వాడి స్వరంలో ఒక లయ ఉన్నది. అది మిమ్మల్ని మీ మనోమస్తిష్కాల్ని కదిలించి వేసింది మన భారతీయుల మూల ఆత్మయే మంత్రమయమై ఉన్నది. మన జీవితంలో పుట్టిన దగ్గరనుండి గిట్టేవరకూ షోడశ సంస్కారాలు జరిపే విధానం ఉన్నది ప్రతి సంస్కారం వెనుక ఒక ప్రబలమైన భూమిక ఉన్నది ఒక నిశ్చితమైన ప్రక్రియ ఉన్నది. ఈ ప్రకియలన్నింటి మధ్య మంత్రాలే ఉన్నాయి ఒకవిధంగా మన జీవనమంతా మంత్రాలమీదనే ఆధారపడి ఉన్నది

సృష్ట్యారంభంలో శివుడు చేసిన నృత్యం నుండి పదునాలుగు విధాలయిన వర్ణాలు నిర్మితమవడం వల్లనే మంత్రాలు స్వయంగా శక్తిమంతములై, చింతన చేయదగినవి అయినాయి ఈ విధంగా అనేక శక్తుల యొక్క పరస్పరమైన కూర్పువల్ల నిర్మితమైన మంత్రం అజేయమైనదిగా పేర్కొనటానికి సర్వసమర్థమైనది తేలికగా చెప్పాలంటే

1 దేవతయొక్క సూక్ష్మశరీరానికి మరోపేరే మంత్రం

2 దివ్యశక్తుల అనుగ్రహప్రాప్తికి ప్రయుక్త శబ్దశక్తినే మంత్రం అని చెప్పవచ్చు.

3 విశ్వంలో వ్యాపించి ఉన్న అదృశ్యశక్తిని వెల్లడించి తనకు అనుకూలంగా చేసే

విద్యనే 'మంత్రం' అని నిర్వచించవచ్చు మంత్రానికి ఉన్న ఈ ప్రభావం వల్లనే మంత్రం బహు అర్థాలతో చెప్పబడింది ధార్మిక గ్రంథాలలో మంత్రశబ్దాన్ని గురించి పలువిధాల పేర్కొనబడింది

## 2. మంత్రవికాసం

మంత్రాలరచన వేదాల ద్వారా బహుప్రాచీనమైనదిగా మనం గ్రహించవచ్చు ఎందుకంటే ప్రపంచంలో అతిప్రాచీన గ్రంథమైన ఋగ్వేదంతో సహా అన్ని వేదాలలో మంత్రాల వికసితరూపం అతిస్పష్టంగా మనకు కనిపిస్తుంది ఇవి నేటికీ మన జీవనంలో ఒక అంగంగా నిలిచిపోయాయి వేదాల తరువాత సంహితలు, ఆరణ్యకాలు, ఉపనిషత్గ్రంథాలలో కూడా వీటి వర్ణన తరచుగా మనకు కనిపిస్తుంది.

పురాణకాలంలో ద్వాపరయుగానంతరం కలియుగారంభ సంవత్సరాలలో మంత్ర విద్యయొక్క ప్రచారం అధికంగా ఉంది. భౌతికయుగం వృద్ధివల్ల, దాని ప్రభావం వల్ల మంత్రజ్ఞులు ఈ విద్యను గోపనీయత అనే అంధకారంలోకి నెట్టివేశారు మంత్రాల వినియోగం భారతదేశంలోనే గాక విదేశాలలో కూడా ఉన్నది పలువిధాలయిన పేర్లతో ఈ విద్య ఏదో ఒక రూపంలో అన్ని దేశాలలోను సజీవంగా ఉన్నది. భారతదేశంలోను, చైనాదేశంలోను విశేషజ్ఞులు నేటికీ ఉన్నారు ఈనాటికీ విదేశాలలో మంత్రవిద్యా రహస్యాలను తెలుసుకోవడానికి భారతీయ పండితులను ఆహ్వానించుకొంటున్నారు

ఈ మంత్రవిద్య తన చరమవికాసం తరువాత మృతప్రాయంగా కనిపించినా నిర్జీవం మాత్రం కాలేదు. దీని అస్థిత్వం ఇప్పటికి సజీవంగా శక్తిమంతంగానే ఉంది. అయితే ప్రస్తుతం ఈ విద్య సిద్ధిపొందిన కొద్దిమంది మర్మజ్ఞుల వద్దనే ఉన్నది.

## 3. మంత్రము - ధ్వని

మంత్రాన్ని ఉచ్చరించేటప్పుడు వాయుమండలంలో ఒక విధమైన ప్రకంపనం ఉత్పన్నమవుతుంది. ఈ కంపన తరంగాలు వాయుమండలంలో ఈథర్ తత్త్వమాధ్యమంలో క్షణమాత్రంలోనే బ్రహ్మాండమంతా పరిభ్రమించి తనకు అనుకూలమైన తరంగాలలో సమ్మిళితమై ఒక పుంజంగా (ఒక రాశిగా) యేర్పడతాయి ఈ పుంజం అత్యంత శక్తిశాలీనంగా ఉండి దీని ప్రభావంవల్ల వాంఛితఘటనగాని (అనుకొన్న కోరిక నెరవేరటంగాని) లేదా కార్యసాఫల్యంగాని తేలిక అవుతుంది. మనం పలికే పదాలు కూడా ప్రేమతో పిలిచేటప్పుడు ఒకరకంగా, ఒక్కొక్క వ్యక్తిని విశేషంగా పిలిచేటప్పుడు

ఇంకొరకంగా వివిధ సమయాలలో వివిధమైన ప్రభావం కలుగుతుంది ఇదంతా ధ్వని యొక్క చమత్కారమే! (అద్భుతమే!)

ధ్వనియొక్క ఈ అద్భుత విశేషం మనకి గీతాల్లో (పాటల్లో) విశేషంగా కనిపిస్తుంది. ఈ ధ్వని ప్రభావం వల్లనే సీల్, డాల్ఫిన్ వంటి చేపలు మోహితమై (ఆకర్షింపబడి) (చేపల) వేటగాళ్ళ బారిన పడతాయి ఆ వలలో చిక్కుకుంటాయి సంగీతంతో గోవుల క్షీరం వృద్ధి అవుతుంది ఇది కూడా ప్రత్యక్షంగా జరుగుతున్నదే పాములు, ఎలుకలు ఇంకా ఇతర వన్యప్రాణులు కూడా సంగీతప్రభావంతో స్తబ్ధమై వశీభూతమవుతాయి

ధ్వనితరంగాలలో ప్రభావితమైన కొన్ని సంఘటనలను గమనిద్దాం మొదటి ప్రపంచయుద్ధ కాలంలో (1914-1919) జర్మనీ ద్వారా తయారైన యంత్రాలు వాటి తరంగాల ద్వారా లక్షిత వ్యక్తుల్ని చైతన్యరహితుల్ని చేసి హతమార్చుతూండేవి.

అమెరికాకు చెందిన రాల్ఫ్‌లారెన్స్‌హీథ్ అనే వైద్యుడు ఒక చికిత్సాలయాన్ని నిర్మించాడు ఇందులో ధ్వనిసంగీతం ద్వారానే పోలియో, పక్షవాతం, నరాలబాధ, మూగ వంటి గడ్డు రోగాలను నయం చేస్తున్నారు

యూత్ కాలేజ్ ఆఫ్ మెడిసన్‌కు చెందిన డాక్టర్ లిండ్‌స్టామ్ ఆందోళన కలిగించే అతి దీర్ఘవ్యాధిగ్రస్తులు ముఖ్యంగా మానసిక రోగుల మస్తిష్కల్లోకి మధుర ధ్వనితరంగాలను ప్రవేశింపజేశాడు విద్యుచ్చికిత్సలు ఇంకా ఇతర మనోవైజ్ఞానిక చికిత్సలు, ఔషధసేవలు ఏమాత్రం పనిచేయని ఆ రోగులు ఈ ధ్వని చికిత్స ద్వారా రోగవిముక్తులయ్యారు.

న్యూయార్కుకు చెందిన యేశీబా విశ్వవిద్యాలయానికి చెందిన ఐన్‌స్టీన్ కాలేజ్ ఆఫ్ మెడిసన్‌లో కూడ ధ్వని చికిత్సను అనుసంధానంచేసి ధ్వనితరంగాల ద్వారా నేత్రచికిత్సా రంగంలో కూడా విజయాలు సాధించారు

శబ్దవిజ్ఞాన (ధ్వనిశాస్త్రం) రంగంలో నేటికీ అనేక పరిశోధనలు ప్రయోగాలు విస్తృతంగానే జరుగుతున్నాయి వీటిద్వారా భారతీయ మహర్షుల ద్వారా సృష్టింపబడిన మంత్రాలలో ఏ వైజ్ఞానిక దృష్టిని దృష్టిలో పెట్టుకొని చేశారో అది అత్యంత అద్భుతమైనదని ఈ కారణంగానే భారతీయ ఆస్తికసముదాయమంతా మంత్రజపం ద్వారానే అన్ని కష్టాలనుండి కడగండ్లనుండి బయటపడుతున్నారని బలపడుతోంది

## 4. మంత్రసిద్ధి

పతంజలి తన యోగశాస్త్రంలో "జన్మౌషధి మంత్రతపః సమాదిజాః సిద్ధయః" అని పేర్కొన్నాడు అనగా జన్మద్వారా, ఔషధిద్వారా, మంత్రము, తపములద్వారా సమాధి ద్వారా ఉత్పన్నఫలాన్నే 'సిద్ధి' అంటారు ఈ సూత్రం ప్రకారంగా కొందరు సాధకులు పూర్వజన్మ సంస్కారాల వల్ల పుట్టుకతోనే సిద్ధులుగా ఉద్భవిస్తారు. మరికొందరు మంత్ర, యంత్ర, తంత్రాల ఉపాసన ద్వారా సిద్ధిపొందుతారు

## 5. మంత్రాలు - పద్ధతులు

భైరవమంత్రంలో మంత్రాలకు రెండు దశలు పేర్కొనబడ్డాయి 1 చిత్తయుక్తమైన మంత్రాలు 2 ధ్వనియుక్త మంత్రాలు మొదటి పద్ధతి మంత్రాల యొక్క ఉచ్చారణలో అంతఃకరణను పవిత్రంగా ఉంచుకొని మనస్సులోనే జపిస్తూ ధ్వని ఉత్పన్నం చేయాల్సి ఉంటుంది. రెండవ పద్ధతిలో మంత్రాలలో పెదవుల వెలుపల ఉచ్చరణ జరిగి వాయుమండలంలో ధ్వని ఉత్పన్నమవుతుంది.

శబ్దం లేదా ధ్వని నశించదు వేల సంవత్సరాలకు పూర్వం ఉచ్చాహితమై ఉన్న ధ్వని నేటికీ వాయుమండలంలో యథాతథంగానే వ్యాప్తమై ఉంటుంది అయితే ఆ తరంగాల యొక్క "ఫ్రీక్వెన్సీ" (తరచుదనం) పట్టుకోగల మాధ్యమం ఉండాలి దాని సహాయంతో ఆ ధ్వనిని వినగలుగుతాము. ఉన్నతస్థాయికి చెందిన సాధకులు నేటికీ మహాభారత కాలంలోని ధ్వనులను వినగల సమర్థులుగా పేర్కొంటున్నారు.

జెట్ విమానం యొక్క తీవ్రధ్వని కంపనాల కారణంగా ఇళ్ళుబీటలు తీస్తాయి దీనివల్ల జెట్‌విమానం ధ్వనివేగాన్ని మించిన వేగంతో పయనిస్తుంటే ఆకాశంలో ధ్వనివిస్ఫోటం జరుగుతుంది.

## 6. మంత్రాల ఆత్మ

మంత్రం యొక్క ఆత్మ ఏమిటి? మంత్రం శివాత్మకమా? శక్త్యాత్మకమా? అణు పరమాణుయుక్తమా? అంటే ఏ తత్త్వంలోనైనా శివుడు, శక్తి,అణువుల సమ్మేళనమై యుండాల్సిందే ఈ తత్త్వాలు లోపించిన పక్షంలో ఏ పదార్థము లేదా తత్త్వము యొక్క కల్పన (సృష్టి) జరగదు మంత్రాలలో కూడా ఈ మూడు తత్త్వాల కలయిక మనకు కనిపిస్తుంది.

శివుడు నిరానందంగా శక్తి ఆనందమయంగా ఉంటారు ఈ రెండింటిని వేరుచేయడం సాధ్యంకాదు శివుడు శక్తి మాధ్యమంగానే సృష్టిస్థితి లయకార్యాలు నిర్వహిస్తాడు ఈ కార్యాలకు ఆధారభూతమైనదే ఆత్మ అవుతుంది

మంత్రాలు స్వయంగా శక్తిమంతములై, తేజస్సు కలిగి శివత్వము యొక్క అభివ్యక్తిని ప్రసాదించుటంలో సమర్థమై ఉంటాయి శివశక్తుల సమ్మేళనం వల్లనే మంత్రాలు భోగమోక్షాలు ప్రసాదించగలుగుతున్నాయి

## 7. మంత్రానికి స్తోత్రానికి తేడా ఏమిటి?

స్తోత్రంలో కేవలం ఏదో ఒక దేవతయొక్క స్తుతి లేదా ప్రార్థన ఉంటుంది ఇది ఏ విధమైన శబ్దాలతోనైనా సాధ్యమే అనగా స్తోత్రంలో నిహితమైన శబ్దాలను మార్చినా ఏవిధమైన తేడా ఉండదు కాని మంత్రం అలాకాదు శబ్దాలు మార్చటం కుదరదు అంతేకాదు కొద్దిపాటి స్వరభేదం కూడా సాధ్యంకాదు (చేయరాదు). సమానార్థకమైన లేదా సమానార్థబోధకమైన శబ్దాలతో కూడా మార్పుచేయడం సాధ్యంకాదు

## 8. మంత్రస్వరూపం

మంత్రం సశరీరంగా ఉంటుందా? నిరాకారంగా ఉంటుందా? అని పరిశీలిస్తే - వస్తుతః మంత్రం సశరీరంగా ఉండదు. ఎందుకంటే శరీర గత ప్రాణులలో మాలిన్యం తప్పనిసరిగా ఉంటుంది మంత్రాలలో కాలుష్యం లేదా దోషం అనేది సాధ్యం కాదు. కాబట్టి మంత్రం మూలతః నిరాకారమైనప్పటికి శక్తిమంతమై, తేజవంతమై ఉంటుంది. మంత్రం అతిశీఘ్ర వేగం ద్వారానే సాధకుడు సంబంధిత దేవత వీరిద్దరి మధ్య ఒక విధమైన సఫల మధ్యవర్తిత్వాన్ని నిర్వర్తిస్తుంది.

ఒక సాధకుడు యజ్ఞంచేసే సమయంలో ఇంద్రుడికి ఆహుతి నిస్తాడు ఇంద్ర మంత్రాల మాధ్యమంగా తరంగాలు ఈథర్‌లో సమ్మిళితమై ఇంద్రుణ్ణి స్పృశిస్తాయి. ఈ తరంగాలతోపాటు హవిస్సు, సాధకుని లేదా యజ్ఞకర్త యొక్క గంధం, భావనలు కోరికలు హవిష్యగంధం ఇంద్రుడికి సమర్పింపబడతాయి అలా సమిర్పించి తిరిగి వచ్చే సమయంలో అవి కొన్ని తరంగాలను తమవెంట తీసుకొని వస్తాయి

ఇంద్రతేజస్సును, దార్ఢ్యాన్ని, ఆశీస్సులను కలిగి ఉన్న ఆ తరంగాలు యజ్ఞకర్త స్థూలశరీరంతో ఢీకొంటాయి యజ్ఞకర్త యొక్క ప్రాణశరీరంలో ఇంద్రతేజస్సును, దార్ఢ్యాన్ని నింపుతాయి.

కాబట్టి మంత్రాలు యజ్ఞకర్త దేవతల మధ్య సఫల మధ్యవర్తిత్వాన్ని నిర్వర్తిస్తాయి.



# శ్రీ యంత్రసాధనలో 'దీక్ష'

గురుదేవుల కృప, శిష్యుని శ్రద్ధ ఈ రెండింటి పవిత్ర స్రవంతుల సంగమమే దీక్ష గురువు యొక్క ఆత్మదానము, శిష్యుని యొక్క ఆత్మసమర్పణము ఏకైక కృపాదృష్టి శిష్యుని శ్రద్ధాతిరేకం వల్లనే సుసంపన్నమవుతాయి 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' కదా గీత దానము, క్షేపం ఇదే దీక్ష యొక్క అర్ధం జ్ఞానశక్తి, సిద్ధిప్రదానం, అజ్ఞానపాప దారిద్ర్య క్షయం – దీని మారుపేరే దీక్ష సాధకులందరికీ ఈ దీక్ష అనివార్యమే అనేక జన్మలు ఆలస్యమయి నప్పటికి ఈ అనివార్యమైన దీక్షలేని పక్షంలో సిద్ధికి సంబంధించిన మార్గము ముందుకు సాగదు. సమస్త సాధకులకు ఒకే అధికారం ఉంటే, లేదా అనేకమైన సాధనలు లేకుండా ఉంటే ఇంకా సిద్ధులలో అనేకమైన మెట్లు అంతస్థులు లేదా స్థాయిలు లేకుండా ఉంటే ఎటువంటి దీక్షా లేకుండానే పరమార్థప్రాప్తి సంభవమవుతుంది కాని అది అలా జరుగదు ఈ మానవజన్మను అనేకమంది అనేకవిధాలుగా సార్థకం చేసుకున్నారు. కొందరు పశుయోనులనుండి (క్రిందటి జన్మలో) మరికొందరు దేవయోనులనుండి, ఇంకా కొందరు పూర్వజన్మ సుకృతం వల్ల మానవజన్మను పొందారు. కొందరైతే నరకకూపం నుండి ఆ శిక్షలన్నీ అనుభవించి ఆ తరువాత మానవ జన్మ యెత్తారు కొందరి మనస్సు సుప్తావస్థలో, మరికొందరి మనస్సు జాగ్రదవస్థలో ఉంటుంది. ఇలాంటి స్థితిలో అందరికీ ఒకే మంత్రం, ఒకే దేవత, ఒకే ధ్యానం సాధ్యంకాదు వారివారి పురాకృతమైన భూమికలు వేరువేరుగా ఉంటాయన్నది ఇక్కడ గ్రహించాలి అయితే సిద్ధిపొందినవాడు (సిద్ధుడు), సాధకుడు, మంత్రం, దేవతలు వీరందరి రూపంలో ఒకే భగవానుడు ప్రకటితమై ఉంటాయన్నది యదార్థమే అయినప్పటికి ఏ హృదయంలో ఏ దేవత, ఏ మంత్రరూపంలో సహజ స్ఫూర్తినిస్తుందో కదా! అది తెలుసుకొని ఆ రూపంలో వికాసం పొందడం అవసరం ఇది దీక్షయొక్క విధానము (దీక్షావిధి)

దీక్ష అనేది ఒక కోణం నుంచి (దృష్టిలో) గురువునుండి లభించే ఆత్మదానం, జ్ఞాన సంచారం లేదా శక్తిపాతం. రెండవవైపు నుండి చూస్తే శిష్యునిలోని సుషుప్త జ్ఞానాన్నీ శక్తులను మేలుకొల్పటం. దీక్షవల్లనే శరీరంలోని సమస్తదోషాలు (మలినాలు) నశిస్తాయి. దేహశుద్ధి జరగటంవల్ల దైవారాధనకు అధికారం లభిస్తుంది. వాస్తవానికి గురువు ఒక్కడే! ఆయన ద్వారానే శక్తి విస్తారమవుతూ వస్తోంది. దీనినే పరంపరదృష్టితో చూసినట్లయితే మూలపురుషుడు పరమాత్మయే పరమగురువు. ఆ పరమాత్మనుండియే బ్రహ్మారుద్రాదులకు క్రమంగా జ్ఞానం పరంపర సాగివచ్చింది. ఆ తరువాత ఒక శిష్యుని నుండి మరొక

శిష్యునికి ఆ పరంపర సంక్రాంతమై (ప్రవేశించి) అది వర్తమాన గురువులో కూడా మనకు కనిపిస్తోంది దీనిపేరే సంప్రదాయం గురువు ద్వారా ఈ అవిచ్ఛిన్న సాంప్రదాయిక జ్ఞానప్రాప్తి కలుగుతోంది ఎందువల్లనంటే మూలశక్తియే క్రమంగా ప్రకాశితమవుతూ వచ్చింది కాబట్టి దానివల్ల హృదయస్థమైన సుప్తశక్తి జాగృతమవటానికి సహాయం లభిస్తుంది ఈ కారణంగానే అప్పుడప్పుడు చిత్తంలో వ్యాకులత వలన అచంచల భక్తి విశ్వాసాలున్న మహాభక్తులు సైతం తమ దీక్షద్వారా వారి ప్రియశిష్యులు పొందినంత భగవత్కృపానుభూతి పొందలేపోతున్నారు

దీక్ష అనేది పలుసార్లు జరుగదు ఎందుకంటే – ఒకసారి (పథనిర్దేశంజరిగితే) దారి దొరికితే ముందుదారి దానంతట అదే వచ్చి చేరుతూ ఉంటుంది మొదటి భూమిక దానంతటదే రెండవ భూమిక రూపంలో నిశ్చలమవుతుంది సాధనకు సంబంధించిన అనుష్ఠానం క్రమంగా హృదయాన్ని శుద్ధిచేస్తూ ఉంటుంది దాని కనుగుణంగా సిద్ధులు ఉదయిస్తూ జ్ఞానసాన్నిధ్యం కూడా కలుగుతుంది జ్ఞానం యొక్క పరిపూర్ణత్వమే సాధన యొక్క పరిపూర్ణత్వం శిష్యుని అధికారభేదాన్ని బట్టే మంత్రం, దేవతల యొక్క భేదం కూడా ఉంటుంది వైద్యుడు రోగియొక్క రోగాన్ని నిర్ధారణ చేశాకనే ఔషధాన్ని నిర్ణయించి ఔషధసేవనం చేయిస్తాడు రోగం నిర్ణయించకుండా ఔషధాన్ని ప్రయోగించటం నిరర్థకం ఇదేవిధంగా సాధకుని విషయంలో కూడా ముందుగా మంత్రం, దేవత ఈ రెండింటి నిర్ణయం అవసరం రోగనిర్ణయం సరిగా జరిగి తదనుగుణమైన ఔషధసేవనం జరిగితే చికిత్స సక్రమంగా కొనసాగినట్లయితే, రోగి అపథ్యం చేయకుండా చికిత్సాక్రమంలో ఉన్నట్లయితే మందు ఒంటబట్టి రోగం నయమై ఫలితం ప్రత్యక్షంగా మనకు కనిపిస్తుంది ఈ ప్రకారంగానే సాధకునికి సంబంధించిన పూర్వజన్మ సాధనలు, వాని సంస్కారాలు, వర్తమానవాసనలు తెలుసుకొని ఆ సాధకునికి అనుకూలమైన మంత్రాన్ని, ఉపాస్యదేవతను నిర్ణయించినట్లయితే ఫలితం ప్రయోజనకరంగా ఉంటుంది అలాగే సాధకుడు తగిన నియమాలను పాటిస్తూ సాధన కొనసాగించినట్లయితే అతడు కొద్దిపాటి పరిశ్రమతోనే శీఘ్రాతిశీఘ్రంగా సిద్ధిపొందగలుగుతాడు.

వధూవరుల విషయంలో వారి సంబంధాన్ని నిశ్చయించటానికి జ్యోతిశ్శాస్త్రపరంగా నాడి, మైత్రి, భకూటం మొదలైనవాటిని విచారించాల్సి ఉన్నట్లే సాధకుని విషయంలో మంత్రం, తద్దేవత విషయంలో కూడా బాగా ఆలోచించి సూచనలు చేయాలి

శుభప్రదమైన దీక్ష మూడు విధాలుగా చెప్పబడింది. 1 స్పర్శదీక్ష 2 దృగ్దీక్ష 3 మానసదీక్ష యోగ్యుడైన గురువు విశేష కృపతో తన మంగళమయమైన హస్తంతో

శిష్యునికి స్పర్శదీక్షను, దివ్యదృష్టితో పరికించి దృగ్దీక్షను, సత్యసంకల్పాన్ని మననం ద్వారా మానసదీక్షను అనుగ్రహిస్తాడు వీటికి సంబంధించిన వర్ణన 'కులార్ణవతంత్రం'లో ఈ విధంగా ఉంది

ఒక పక్షి తన రెక్కల యొక్క స్పర్శతో తన పిల్లల పాలన పోషణ చేసినట్లుగా 'స్పర్శదీక్ష' ఉంటుంది

ఒక తాబేలు దృష్టిమాత్రం చేతనే తన సంతానం యొక్క ఆలనాపాలనా చూసినట్లుగా "దృగ్దీక్ష' ఉంటుంది

ఒక చేప ధ్యానమాత్రంగానే తనపిల్ల చేపలను పోషించినట్లుగా 'ధ్యానదీక్ష' మానసికంగా చేయ (ఇవ్వ) బడుతుంది

ఈ మూడు దీక్షలేకాకుండా 'శబ్దదీక్ష' కూడా ఉంటుంది ఈవిధంగా స్పర్శ, భాషణ, దర్శన, సంకల్పాలతో నాలుగువిధాలైన దీక్షలయ్యాయి. వీటిని స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ దీక్షలని పేర్కొంటారు

శివుడు శివాగమంలో మూడురకాలైన దీక్షలను ఉపదేశించాడు 1 శక్తి 2. శాంభవి 3 మాంత్రీ దీక్షలు. మాత్రీ దీక్షయే రుద్రయామళాది గ్రంథాలలో "ఆణవీ" అనే పేరుతో ప్రసిద్ధమై ఉంది

పరమ చైతన్యరూపమైన కుండలినియే శక్తిగా శక్తిదీక్షా వివరణంగా చెప్పబడింది ఆ కుండలినీశక్తిని జాగృతం చేసి బ్రహ్మనాడినుండి పరమశివునితో ఐక్యం చేయడమే శక్తిదీక్ష. ఈ దీక్షలో గురువే శిష్యుని అంతర్దేహంలో ప్రవేశించి కుండలినీశక్తిని జాగృతంచేస్తాడు తన శక్తితోనే దానిని (పరమశివునితో) ఐక్యంచేస్తాడు ఈ ప్రక్రియలో శిష్యుడు తనవైపునుండి ఎట్టి క్రియలు చేయనవసరంలేదు

శాంభవీదీక్షను గురించిన వివరణ 'వాయవీయసంహిత'లో మనకు కనిపిస్తుంది గురుదేవుడు తన కృపామయ దృష్టితో లేదా స్పర్శ ద్వారా ఒక్క క్షణంలోనే స్వరూపస్థితి కలిగిస్తాడు అని వాయవీవసంహిత పేర్కొంది భగవానుడైన శంభుని చరణద్వయం నుండి ఉదయించిన దీక్షయే శాంభవీదీక్షగా 'రుద్రయామళం'లో చెప్పబడింది. ఇక్కడ చరణద్వయం అంటే శివ – శక్తుల ఇద్దరి చరణాలు అని గ్రహించాలి. సహస్రదళ కమలం యొక్క కర్ణిక మీద చంద్రమండలం యొక్క సుధా ధారచే అప్లావితమైన ఆ నాలుగు చరణాలను ధ్యానించాలి. నాలుగు చరణాలలో మూడు చరణాలు త్రిగుణాలను సంకేతి స్తూండగా నాలుగవది నిర్వాణం లేదా పరమానందమయ స్వరూపాన్ని ప్రకాశింప చేస్తుంది వాటి వర్ణాలు శుక్లవర్ణం, రక్తవర్ణం, మిశ్రమవర్ణంగా లేదా వర్ణనాతీతంగా

ఉంటాయి సద్గురువు యొక్క దృష్టి మాత్రంచేతనే శిష్యుని సహస్రారం వికసిస్తుంది అప్పుడు అతడు సమాధిస్థితుడై కృతకృత్యుడవుతాడు

మాంత్రీదీక్ష లేదా అణవీదీక్ష మంత్రం, పూజ, ఆసనం, న్యాసం, ధ్యానాదులచే సిద్ధిస్తుంది. ఈ దీక్షలో గురువు శిష్యునికి మంత్రోపదేశం చేస్తాడు పై రెండు దీక్షలలో తక్షణమే తత్కాల సిద్ధి కలుగుతుంది కాని ఈ మంత్రదీక్షలో మంత్రోపదేశం పొందిన శిష్యుడు అనుష్ఠానం చేయగా చేయగా క్రమంగా సిద్ధి లభిస్తుంది ఫలితం అన్ని దీక్షలకు ఒకటే (సమానమే!) సాధకులందరూ శక్తిపాతానికి పాత్రులు కాజాలరు మాంత్రీదీక్ష వలన శక్తిపాతదీక్షకు పాత్రులవుతారు తద్వారా మంత్రదేవాత్మకమైన శక్తితో సిద్ధిని పొందగలుగుతారు

నామక్రియా భేదం వల్ల దీక్షలలో అనేక భేదాలున్నాయి ఆణవీ దీక్షలోనే పదిరకాలైన భేదాలు వర్ణించబడ్డాయి . 1 స్మార్తి 2. మానసి 3 యోగి 4 చక్షుషి 5 స్పర్శకి 6 వాచికి 7 మాంత్రికి 8 హోత్రి 9 శాస్త్రి 10 అభిషేచిక

'శారదాపటలం' లో నాలుగువిధాలయిన దీక్షలు వర్ణించబడ్డాయి 1 క్రియావతి 2 వర్ణమయి 3 కళాత్మ 4 వేధమయి

దీక్షలలో రెండురకాలైన భేదాలు కూడా చెప్పబడ్డాయి బాహ్యా, ఆభ్యంతర దీక్షలు. భిన్నభిన్న శాస్త్ర గ్రంధాలలో, భిన్నభిన్న సంప్రదాయాలలో వందలాది దీక్షలు అనేకరకాలుగా పేర్కొనబడ్డాయి

మొత్తం దీక్షాభేదాలు 74 వరకూ చెప్పబడ్డాయి కాగా కొన్నిచోట్ల 64 వరకూ భేదాలు సూచింపబడ్డాయి వీటిలో సకల, నిష్కల, అఘోరేశ్వరి మొదలైనవాటి అనుష్ఠాన, కర్మలలో అవాంతరాల కారణంగా భౌతిక, నైష్ఠిక భేదాల కారణంగా దీక్షలు అసంఖ్యాకంగా కనిపిస్తున్నాయి

వర్తమాన యుగంలో ఉత్తమమైన గుణములు పరిపూర్ణమైన సద్గురువులు కరువయ్యారు చాలచోట్ల కపటగురువులు, వ్యభిచారులు, కుపాత్రులైన వ్యక్తులే స్వయంగా గురుదేవులుగా ప్రకటించుకొని కోట్లాది రూపాయలు గడిస్తున్నారు. ఫోటో మాత్రం చేతనే దీక్షలు ప్రసాదిస్తున్నారు. కొందరు ఆశ్రమాలు నిర్మించుకొంటూండగా మరికొందఱు పీఠాధిపతులుగా చెలామణి అవుతున్నారు వీరి కపటనాటకం ప్రపంచానికి బట్టబయలు కాగానే శిష్యసముదాయమంతా వంచితులై విచలితులైపోతున్నారు. వార్తా పత్రికలలో వీరికి సంబంధించిన వార్తలు పాఠకులు కూడా చదువుతోనే ఉంటారు ఇలాంటి కుపాత్రులైన వ్యక్తుల వల్లనే మన సంప్రదాయాల్ని, సంస్కృతీ వైభవాల్ని గురుపరంపరలను వేలెత్తిచూపే

అవకాశం అన్యమతస్తులకు కలుగుతోంది సత్పాత్రులు, సద్గురువులు అప్రతిష్ఠపాలవుతున్నారు అపనిందలకు గురవుతున్నారు

ఇటువంటి కాలంలో ఏ వ్యక్తి యెడల మనకు పరిపూర్ణమైన శ్రద్ధాభక్తులు ఉన్నాయో, ఆ వ్యక్తి చిత్రాన్ని ముందుంచుకొని, ఆ చిత్ర పటాన్ని పూజించి, అనుజ్ఞపొంది సాధనను ఆరంభించాలి వేల సంవత్సరాల పూర్వం ఏకలవ్యుడు కూడా ఇలాగే సాధనచేసి విజయాన్ని సాధించాడు ఈ కలి యుగంలో కూడా ఏకలవ్యుని వలె నిరంతర సాధన సాధకునికి ఎంతో అవసరమనిపిస్తోంది!

## శక్తిపాతదీక్ష

శక్తిపాతం చేయగల గురువులు నేటికీ ఉన్నారు శక్తిపాతంలో గురువు కొద్దిసేపు శివత్వాన్ని పొందుతాడు గురువు పూర్ణదయా ప్రేరితుడై ఈ దశను పొంది శక్తిపాతం చేయగల గురువులు తారసిల్లి వారి దయ కలిగినా మనకు ఆ భావం కలుగక ఉదాసీనులమైతే గురువులు శక్తిపాతం చేసినా ఆ ప్రక్రియ నామ మాత్రమే అవుతుంది తప్ప ఆశక్తి సిద్ధించదు.

ఒక హస్తంతో శివశక్తిని, రెండవ హస్తంతో తన గురువుల యొక్క శక్తిని శక్తిపాతదీక్షలో సద్గురువు భూతశుద్ధిచేసి శివత్వాన్ని యధాసాధ్యంగా సంప్రాప్తింప జేసుకొని రెండు చేతులతోను శిష్యుని శిరస్సుమీద ఉంచి నింపుతాడు. గురువు ఈ ప్రక్రియను సక్రమంగా నిర్వహించగానే శిష్యుడు సాత్త్వికుడైనచో అతడు కొద్దిసేపు స్తబ్దంగా ఉండిపోతాడు. దానితోపాటు ఆతడికి ఉపదేశించబడిన మంత్రం క్రియావంతమవుతుంది, ఫలిస్తుంది. ఒక వ్యక్తి ఎన్నోరోజులుగా ఒక మంత్రాన్ని జపిస్తూ ఉండేవాడు. కాని దాని ద్వారా ఆతనికి ఏ అనుభూతి కలగడంలేదు అనుకుందాం. అదే ఒక గురువు భూతశుద్ధి జరిపి అపారకరుణాభావ ప్రేరితుడై ఆ సాధకునికి శక్తిపాతదీక్షను ప్రసాదించినట్లయితే అప్పుడు ఆ శిష్యుని మంత్రజపం వల్ల దేవతాదర్శనం కలుగుతుంది అంతేకాదు మహా నందం యొక్క అనుభవం సిద్ధిస్తుంది. మరొక వ్యక్తికి భూతశుద్ధి జరిపి ఉపనయన విధిని కూడా నిర్వహించి గాయత్రీమంత్రదీక్ష కూడా ఇవ్వబడిందనుకొందాం. ఆ వ్యక్తికి శక్తిపాతదీక్ష ప్రసాదింపబడి నట్లయితే అప్పుడు ఆతనిలో ఔన్నత్యాన్ని పొందే లక్షణాలు కనబడకపోయినప్పటికి అప్పుడప్పుడు ఆతనికి దివ్యదృష్టి ప్రాప్తిస్తుంది కీర్తనలో పేర్కొన్న అదృశ్యదేవతల దర్శనభాగ్యం కలుగుతుంది. దూరదూరాలలో ఉన్న దృశ్యాలు కూడా యధాతథంగా దృగ్గోచరమవుతాయి

మూడవవ్యక్తి ఒకడు ఉన్నాడనుకుందాం ఆతడు ఒక సన్యాసినుండి మంత్రోపదేశం పొందాడు అయినప్పటికి ఆ మంత్రజపంవల్ల ఆతడికి ఏవిధమైన లాభం కలుగలేదు. ఆతడికి కూడా పైన చెప్పినట్లుగా భూతశుద్ధితోపాటు శక్తిపాతం చేయబడి దీక్ష ప్రసాదింపబడినట్లయితే అప్పుడు ఈ మూడవ వ్యక్తి కూడా మంత్రజపం ద్వారా ఆనందాన్ని అద్భుత దర్శనాన్ని పొందుతాడు

## దీక్షాసమయం

శాస్త్రాలలో ముఖ్యంగా తాంత్రికగ్రంధాలలో దీక్షావిషయక వర్ణనలున్నాయి దినము, మాసము, సంవత్సరము ఇత్యాదిక్రమంలో దీక్ష, అభిషేకాలు ఉంటాయి క్రమంగా సాధకుని అధికారం వృద్ధిపొందుతూ పోతుంది ఆతడు ఒక దీక్షనుండి మరియొక దీక్షాస్థాయికి చేరుకొంటాడు ఈ దీక్షావిధానం సాధారణ సాధకునికి ఉపయోగకారి కాదు. కాబట్టి దీనిని గురువు ద్వారా శాస్త్రాల ద్వారా గ్రహించాలి. వైదికదీక్ష, తాంత్రికదీక్ష, మిశ్రితదీక్ష, స్త్రీదీక్ష, భావదీక్ష, స్వప్నదీక్ష, మహాదీక్ష మొదలైన అనేక విధాలైన దీక్షలన్నీ ప్రభుల యొక్క (పరమేశ్వరుని యొక్క) కృపాలబ్ధులై సఫలులై అధికారాన్ని పొందిన సాధకులకే లభిస్తాయి. దీక్ష లేకుండా ఉండటానికి ఏ దీక్ష యొక్క మహానీయ జ్ఞానము కలుగదు ప్రస్తుతకాలంలో దీక్ష ఒక పరిపాటిగానే మిగిలిపోయింది తప్ప సాధన మీద పట్టుదల అటు శిష్యునికి గాని ఇటు గరువుకిగాని కనబడటంలేదు అయితే చక్కని పట్టుదల గలిగిన సాధకుని సాధన ఫలించి తదనుగుణమైన అధికారిగా తాను తయారయినపుడు ఏదో ఒక రోజున సద్గురువు తప్పక లభిస్తాడు. అప్పుడు సద్గురుల ద్వారా దీక్షాప్రాప్తి అవశ్యం సిద్ధిస్తుంది

'శ్రీకాళీవిలాసం' అనే గ్రంథంలోని ఆరవ అధ్యాయంలో దీక్షా కాలనిర్ణయాన్ని గురించిన వర్ణన ఉంది ఫాల్గుణమాస కృష్ణపక్షంగాని, శుక్లపక్షంగాని దీక్షాకాలనికి బావుంటుంది. అందులోను పంచమితిథి స్వాతి నక్షత్రం కలిసివచ్చిన శుక్రవారంరోజు శుభప్రదమే కాకుండా – ఆ ముహూర్తాన దీక్షాస్వీకారం జరిగినట్లయితే కోటిదీక్షా ఫలితం లభిస్తుంది. శ్రవణా నక్షత్రయుక్తమైన ముహూర్తం కూడా అత్యుత్తమమైనది శుక్లపక్ష చతుర్థశి తిథి సైతం సర్వసిద్ధి ప్రదమైనది. ఆర్ద్రా నక్షత్రయుక్తమైన శుక్లపక్ష నవమి రోజున తీసుకునే దీక్ష సమస్త సకలైశ్వర్య ప్రదాయిని అవుతుంది.

# దీక్షాక్రమం

మాతాపితరులు, గురువు ఈ ముగ్గురు మనకు ప్రత్యక్షదైవాలు ఈ విషయాన్ని మన శాస్త్రాలు విశేషంగా వివరించాయి ఈ ముగ్గురిని త్రిమూర్తులుగా భావించి బ్రహ్మవిష్ణు మహేశ్వరులుగా పేర్కొనటం జరిగింది తల్లి జన్మనిస్తుంది గనక ఆమెను బ్రహ్మగాను, తండ్రి పోషిస్తాడు గనుక విష్ణుమూర్తిగాను, గురువు కుసంస్కారాలను నశింపజేస్తాడు గనుక మహేశుడుగాను శాస్త్రాలు వర్ణించాయి గురువు యొక్క స్థానము మాతాపితరులతో సమానంగానే పరిగణింపబడింది తల్లిదండ్రులు లేకుండానే నేను జన్మించాను అని ఎవరైనా చెబితే వాడిని మనం అబద్ధాలకోరుగా ప్రకటిస్తాం ఎందుకంటే తల్లిగర్భంలో గర్భవాసాన్ని అనుభవించకుండా ఎవడూ ఏవిధంగానూ జన్మించలేడుగదా! ఇదేవిధంగా ఎవడైనా తండ్రిలేకుండా పుట్టాను అంటే వాడిని వర్ణసంకరునిగా అనగా వేశ్యా పుత్రునిగా చెబుతాం ఇదేప్రకారంగా ఎవడైనా నాకు ఎటువంటి గురువు లేదని చెబితే అతణ్ణి అసభ్యునిగా, అసంస్కారిగా పేర్కొంటాం. ఎందువల్లనంటే మస్తిష్కంమీద ఆలోచన, స్వభావం, జ్ఞానం, గుణం, కర్మవంటివానిపై దూరదర్శియైన వాని నియంత్రణ లేనప్పుడు వాడి మానసిక మైన ఆరోగ్యంమీద ఎటువంటి భరోసా ఉండదు అటువంటి అసంస్కృతుడైనవాడిని 'నిగుర' అని పిలుస్తారు. అనగా గురురహితునిగా పేర్కొనవచ్చు ఏదో ఒక సమయంలో గురురహితునిగా పేర్కొనడం వేశ్యాపుత్రునితో, అసత్యవాదితో సమానంగా అపశబ్దవాచ్యంగా దుర్భాషలాడినట్లుగా భావించబడుతుంది.

ఈ జగత్తులోనికి మానవుడు అసంపూర్ణరూపంలో ప్రవేశిస్తాడు. మానవునికి ఒక పరిపూర్ణతను, పవిత్రతను సాధించాలనే అభిలాష ఉంటుంది. ఈ పరిపూర్ణత కోసం గురువు ఒక్కడే ఏకైక సహాయకుడవుతాడు. అందుచేతనే దీక్ష యొక్క ఆవశ్యకత యేర్పడుతుంది

తాంత్రిక గ్రంథాల నిర్దేశానుసారం మూలాధారంలోని 'కుండలినీశక్తి' నిద్రాణమై ఉన్నంతవరకూ మంత్రతంత్రాలు, యంత్రాలు, అర్చనాది కర్మలూ సఫలీకృతం కావు గురువు యొక్క పుణ్యప్రభావం వల్ల పారాయణలు, పూజాదులు, జపతప ధ్యానజ్ఞాన కర్మలు ఏవి సాధ్యమైనా అవి అన్ని సిద్ధిస్తాయి పూర్వాశ్రమంలో ఏ జగత్తును దుఃఖమయంగా, మిధ్యగా భావిస్తున్నాడో, దేనిని అసత్యంగా, నరకంగా తలచాడో అదే సత్యమైనదిగా, స్వర్గమయంగా భావిస్తుంది. ఎందువల్లనంటే కుండలినీశక్తి జాగరణంతో శరీరంలోని ప్రతి క్షేత్రంలో సఫలత అనే స్తంభాలను ప్రతిష్ఠించడం జరుగుతుంది.

జీవితసాఫల్యానికి ' కుండలినీ జాగరణం' అనే క్రియ ఒక ప్రముఖ ప్రక్రియ

ఈ ప్రక్రియాసాఫల్యం సద్గురుని సహాయంతోనే సుసంపన్నమవుతుంది. ఇదే దీక్షాక్రమానికి ఆధారభూతమైనది

64 విధాలయిన దీక్షాక్రమాల జాబితా ఈక్రింద పేర్కొనడం జరిగింది

## అదరామ్నాయం - మూలాదారం

1 తారణి 2 ఏకజట 3 నీలాసరస్వతి 4 మహోగ్రతార 5 ఉగ్రతార 6 నిర్వాణతార అధరామ్నాయ నివార్ణ సర్వాధికార మహాపాదుక, మహాషోఢ 7. శాంభవ నవాత్మకేశ్వరానందనాథ

## సృష్టిచక్రం - పూర్వామ్నాయం - స్వాదిష్ఠానం

8. ఉన్మని 9 పూర్ణేశ్వరి (భువన) 10 భువనేశి 11 భువనేశ్వరి 12 నిర్వాణ భువనేశ్వరి 13 పూర్వామ్నాయ సర్వాధికార సృష్టి సుందరీ పూర్వామ్నాయ మహాపాదుక, మహాషోఢా 14 శాంభవ (నవాత్మానందనాద) దీపేశ్వరానందనాథ

## స్థితిచక్ర దక్షిణామ్నాయ - మణిపురం

15 ఆద్యాకాళి 16 పరమాద్యకాళి 17 సిద్ధికాళి 18 శ్యామకాళి 19 దక్షిణకాళి 20 నిర్వాణ దక్షిణకాళి దక్షిణామ్నాయ సర్వాధికార స్థితిసుందరి, దక్షిణామ్నాయ మహా పాదుక మహాషోఢ 21 శాంభవ (దీపేశ్వరనందనాథ) సంవర్తేశ్వరానందనాథ.

## సంహారచక్ర - పశ్చిమామ్నాయ - అనాహతచక్రం

22 సమయ కుబ్జిక 23 ఘోరకుబ్జిక 24 వీర కుబ్జిక 25. వజ్రకుబ్జిక 26. అఘోర కుబ్జిక 27. నిర్వాణకుబ్జిక, పశ్చిమామ్నాయ సర్వాధికార, సంహారసుందరి పశ్చిమామ్నాయ మహాపాదుక, మహాషోఢ 28 (సంవర్తేశ్వరానందనాథ) హంసేశ్వరానందనాథ

## అనాఖ్యాచక్రం - ఉత్తరామ్నయం - విశుద్ధచక్రం

29. తుంబేశ్వరి 30 సిద్ధిలక్ష్మి 31 సిద్ధికరాళి (భరతోపాసిత గృహ్యాకాళి) 32 సిద్ధికరాళిక (రామోపాసిత గృహ్యాకాళి) 33 కామకళాగృహ్యాకాళి 34. నిర్వాణ గృహ్యాకాళి, ఉత్తరామ్నాయ సర్వాధికార, అనాఖ్యాసుందరి, ఉత్తరామ్నాయ మహాపాదుక, మహాషోఢ 35 శాంభవ విశ్వేశ్వరానందనాథ 36 ఈశామ్నాయ –మహాకాళి 37 అగ్నే

యామ్నాయ - మహాలక్ష్మి 38 వాయవ్యామ్నాయ - మహాసరస్వతి 39 ఉపామ్నాయ - చాముండ

## ఊర్ధ్వామ్నాయ దీక్షాక్రమాలు

40 బాలాత్రిపుర 41 బాలాసుందరి 42 బాలభైరవి 43 బాల త్రిపురభైరవి 44. బాలా త్రిపురసుందరి 45 నిర్వాణబాల, బాలా సర్వాధికార 46 పంచదశి 47. శోడశి 48 మహాశోడశి 49 మహా సప్తదశి 50 మహాష్టదశి 51 సర్వాధికార 52 మధ్యపాశుపత 53 మహాపాశుపత 54 నిర్వాణసుందరి 55 మహాశాంభవ షడామ్నాయేశ్వరానందనాథ 56 సర్వమంత్రేశ్వరి పరదేవత 57 బంగళ సమయ విద్య 58. కాలరాత్రి సమయవిద్య 59 జయదుర్గ సమయవిద్య 60 ఛిన్నమస్త సమయవిద్య 61. దశకూటాత్మిక నిర్వాణసుందరి 62 పంచసింహాసన దేవత 63 పంచపంచిక 64 అలేఖనీ అనుత్తరవాదిని

శ్రీయంత్రసాధన (శ్రీవిద్య)లో అనేక దీక్షాక్రమాలు ఉంటాయి కాది, హాది, ఆధార,సాది, పంచపంచిక, పంచసింహాసన మొదలగు భిన్నభిన్న సాధనాక్రమాలు (పద్ధతులు)

సప్తశతిలో వర్ణింపబడిన దుర్గాదీక్షలలో రెండు క్రమాలున్నాయి ప్రథమక్రమంలో - 1. ఏకాక్షరీదీక్ష 2 అష్టాక్షరీదీక్ష 3 జయదుర్గ 4. నర్వాణ 5 పంచదశి

ద్వితీయక్రమంలో 1 మహాకాళి 2 మహాలక్ష్మి 3 మహాసరస్వతి 4 ఉగ్రచండ 5 పంచదశి ఇవన్నీ కలిసి మహాపూర్ణదీక్ష అవుతుంది

నమో ఽ స్తు దేవ్యై భృగునందాయై
నమోఽ స్తు విష్ణోరురసి స్థితాయై
నమో ఽ స్తు లక్ష్మ్యై కమలాలయాయై
నమో ఽ స్తు దామోదర వల్లభాయై. 14

నమోఽ స్తు కాంత్యై కమలేక్షణాయై
నమోఽ స్తు భూత్యై భువన ప్రసూత్యై
నమో ఽ స్తు దేవాదిభి రర్చితాయై
నమోఽ స్తు నందాత్మజ వల్లభాయై. 15

సంపత్కరాణి సకలేంద్రియ నందనాని
సామ్రాజ్యదాన విభవాని సరోరుహాక్షి
త్వద్వందనాని దురితా హరణోద్యతాని
మామేవ మాత రనిశం కలయంతు మాన్యే. 16

-శ్రీ కనకధారా స్తోత్రము

# శ్రీ యంత్రసాధనను రహస్యంగా ఎందుకు ఉంచాలి?

తంత్రవిద్యలను ఎతిగిన పెద్దమనిషి విషయం అందరికీ తెలియకూడదు. ఫలానా వ్యక్తి తాంత్రిక సాధకుడు అని తెలిసిననాడే ఆ వ్యక్తి మరణదినంగా భావించాలి అని తాంత్రికగ్రంథాలు పేర్కొన్నాయి సాధన వెల్లడి అవడంవల్ల కీర్తిప్రతిష్టలు ఎంతగా వృద్ధి పొందుతాయో అదే పద్ధతిలో సాధనాఫలితాలు కూడా క్షీణించడం మొదలుపెడతాయి అందుకే బైబిలు గ్రంథం "ఢంకాలు మోగించి దానాలు పుణ్యాలు చెయ్యకు" అని ప్రవచించింది నగారాలు మ్రోగించి (ప్రచారంతో) దానాలు పుణ్యకార్యాలు చేసినవాడికి తక్షణమే వాటి ఫలితం లభించినా తరువాత అవేమీ మిగలవు. యయాతి యొక్క యజ్ఞఫలాలన్నీ ఆతడు రావణుని సమ్ముఖాన ప్రకటించడంవల్లనే నశించిపోయాయి.

ఒక వ్యక్తి యొక్క సాధనలు ప్రకటితమైనట్లయితే ఆతని వద్దకు అనేమంది జనం అనేక మైన కోరికలతో చుట్టుముడతారు కొందరు సంతానేచ్ఛతో సాధకుని చరణ స్పర్శ చేస్తారు ఇంకా కొందరు శత్రుభయం నుండి విముక్తులవటానికి సేవలు అందిస్తారు ఈ విధంగా జనం గుంపుగుంపులుగా చేరడంతో సాధకుని సాధనకు అవరోధం యేర్పడు తుంది.

తరచుగా ఏ సాధకుని వద్దకైనా ఆతని సాధనౌన్నత్యాన్ని తెలుసుకొని వచ్చి చేరే జనం అనేకమైన వస్తువులను ఫలాలను, పుష్పాలను, భోజనపదార్థాలను, మిఠాయిలను, ధనాన్ని కొని తెచ్చి సాధకుని చరణ సన్నిధిలో ఉంచుతారు. వాటిని గ్రహించడం వల్ల నైతేనేమి భుజించడం వల్ల నైతేనేమి ఆ సాధకుని యొక్క సాధనకు పలువిధాలైన బాధలు, నష్టాలు కలుగుతాయి

'కులార్ణవం'లో

యస్యాన్నేన తు పుష్టాంగో జపం హోమం సమాచరేత్ ।
అన్యధాతుః ఫలస్యార్ధ చార్ధ కర్తు ర్నసంశయః ॥

మహాభారతంలో ఒక సాధువు కథ ఉన్నది. అందులో ఒక స్వర్ణకారుని ఇంటిలో ఒక సాధువు భోజనం చేసి తదనంతరం ఆ ఇంటిలోనే దొంగతనానికి పాల్పడతాడు. ఈ విధంగా సాధకుని వద్దకు ఒక వ్యక్తి యొక్క పాపం ద్వారా ఆర్జింపబడిన అన్నం వచ్చి నట్లయితే ఆ సాధకుడు తన సాధనలోని అర్థాంశాన్ని కోల్పోవటమే కాకుండా కడకు మతిభ్రష్టుడు కూడా అయ్యే ప్రమాదం ఉంది.

వీటన్నిటికంటే మిక్కిలి కీడు కలిగించే ఘట్టాలు కూడా తారసపడుతుంటాయి ఒక్కొక్క సారి సాధకుని చుట్టు శిష్యురాండ్రు వచ్చి చేరుతూంటారు పురుషుల కంటే స్త్రీలు భక్తి ప్రపత్తులు ఎక్కువ పాలు కలిగి ఉంటారు ఏ వ్యక్తినైనా అతని ఆడంబరాలు చూసి తేలికగా నమ్మేస్తారు. ఇలాంటివాళ్ళు సాధకుని ఔన్నత్యాన్ని పసిగట్టినట్లయితే ఏదోవిధంగా వారు ఆ సాధకుని వద్దకు వచ్చి చేరతారు స్వాములవారు ధనపుత్రసుఖాది సమస్తవాంఛలను నెఱవేరుస్తారని తలుస్తారు గీతలో పేర్కొన్నట్లు సంగం వల్లనే కామం ఉద్భవిస్తుంది. ఈవిధంగా సాధకగణం సాధనను సాధ్యాన్ని విస్మరించి శిష్యురాండ్ర ధనకనక వస్తువాహనాది కోరికలను నెఱవేర్చటానికి అన్ని ప్రసాదించడం మొదలుపెడతారు. తద్వారాక్రమంగా పతనావస్థకు చేరి చివరకు విశ్వామిత్రుడిలా అధఃపాతాళాన్ని చేరతారు

ఇక్కడొక పిట్టకథని చదవండి!

ఒకప్పుడు షిరిడీసాయిబాబా సన్నిధిలో దేవీదాసు అనే సాధువు ఉండేవాడు ఆ సాధువు చుట్టుపక్కల గ్రామ ప్రజలకు కావాల్సిన వైద్యం చేస్తూ ఉండేవాడు. ఒకసారి బాబా ఆ సాధువులను చూసి "ఒరే నాయనా! స్త్రీలతో చనువుగా ఉండటం అంత మంచిదికాదురా నాన్నా" అని పలికారు సాధువు బాబా మాటల్లోని అంతరార్థాన్ని, దూరదృష్టిని కనిపెట్టలేకపోయాడు. ఆ దగ్గర గ్రామంలోని ఒక ధనవంతురాలు ఈ సాధువులపై కన్నేసి అతగాడిని వశం చేసుకుంది దానితో ఆ సాధువు యోగభ్రష్టుడై సాధనలో సాధించిన సత్ఫలితాలన్నింటిని బూడిదలో పోసిన పన్నీరు చేసుకున్నాడు. అందుకే బద్దెన ప్రభువు సుమతీశతకంలో

క॥ పరసతుల గోష్ఠినుండిన<br>
పురుషుఁడు గాంగేయుడైన భువి నిందవడున్<br>
పరసతి సుశీల యైనను<br>
పరు సంగతి నున్న నిందపాలగు సుమతీ! అని నీతిని బోధించాడు

సాధన చేసే సమయంలో సాధకులకు అనేకమైన అనుభవాలు, అద్భుత దృశ్యాలు ప్రత్యక్షంగాను స్వప్నంలోను దర్శనమిస్తుంటాయి. అటువంటి సమయాలలోనే సాధకుడు కడుజాగరూకత వహించాలి. అప్పుడేవాటిని ప్రకటించకుండా రహస్యంగా ఉంచగలిగి నట్లయితే వాటి పరంపర కొనసాగి ఫలితాలు కరతలామలకాలవుతాయి

సాధకుడు తన అనుభూతులు సత్వరమే ప్రకటించినప్పుడు మరొక నష్టం కూడా వాటిల్లుతుంది అవి అనధికారుల వద్ద వెల్లడి అయి దుష్ఫలితాలు కొని తెచ్చిపెడతాయి.

ఏ సాధనలు ఎంతెంత రహస్యమైనవో తెలుసుకోవడం చాలా కష్టం. తాంత్రిక విద్యలు లేదా వామాచార సాధనా రహస్యాలను అరుదైన వ్యక్తులే తెలుసుకోగలుగుతారు ప్రజలు ఏదైనా విషయాన్ని సరిగా తెలుసుకోలేనప్పుడే వాటిని విమర్శించడం మొదలుపెడతారు తెలుసుకోలేని విషయాలను తమాషాగా భావిస్తారు కాబట్టి ఏవిధమైన సాధనలైనా సరే వాటి గురించి వివరించేటప్పుడు వాటిని తగుమాత్రం రహస్యంగా ఉంచాలి అని పేర్కొనటం జరిగింది

## 1.మంత్రసాదనావిది

మనధర్మశాస్త్రాలలో పేర్కొనట్లు మంత్రం ప్రయోగానికి పూర్వమే దానిని సాధన ద్వారా సిద్ధంచేయబడుతుంది మంత్రసాధనకు సాధకుడు స్థలనిర్దేశం, శుభఘడియలు, ఋతువు మొదలైన వాటిని శ్రద్ధగా చూసుకోవాలి శుచిశుభ్రత, ఆహారనియమాలు, వస్త్రధారణం, పూజాసామగ్రితో పాటు జపతపాదులయందు విశేష శ్రద్ధ తీసుకోవాలి దీనికి సంబంధించిన అనేకమైన నియమనిబంధనలు ఉన్నాయి. వాటిని ఈ క్రింద క్రోడీకరించటం జరిగింది.

1 సాధకుడు మంత్రసాధనకు ఉపక్రమించేటప్పుడు కుదిరినంతవరకూ ఆ స్థానంలో చాలావరకూ నిర్జనప్రదేశంలో మనుషుల రాకపోకలు లేని స్థలంలో సాధన ప్రారంభించుటం మంచిది ఏకాంత ప్రదేశాలలోని తీర్థస్థానాలు, నదీతీరాలు, బావులు, పర్వతశిఖరాలు, గుహలు, ఇంకా ఇతరమైన నిర్జన ప్రదేశాలు బహు శ్రేష్ఠమైనవి. ఇంకా తోటలలో, గృహాలలో, కొండలపైన చేసే మంత్రసాధన అధిక ఫలకారకమవుతుంది సాధకుడు ఈవిధంగా సాధనాస్థలాన్ని విశేషంగా ఎంచుకొని మనోవాక్కాయకర్మలతో అనగా త్రికరణశుద్ధిగా ఆ విశేష స్థల దేవతలను రక్షకులుగా యక్షభైరవాది దేవీదేవతలను వినయపూర్వకంగా స్మరించుకోవాలి. “ఓ దేవతలారా! క్షేత్రపాలకులారా' నేను నా అభీష్టకార్యసిద్ధి కోసం ఈ విశేషస్థలానికి ఉపాసనాభిలాషినై వచ్చాను మీ అందరిని రక్షణకై ఆశ్రయిస్తున్నాను. నేనిక్కడ ఉన్నంతవరకూ, ఇక్కడ నా సాధన కొనసాగినంతవరకూ మీరు నన్ను రక్షింతురుగాక! నా అభీష్ట సిద్ధికి (నన్ను) ఆశీర్వదింతురుగాక! నాపై ఏవిధమైన బాహ్యాభ్యంతర సంకటాలు (విఘ్నాలు), ఉపద్రవాలు, భయాలు ముంచుకొచ్చినా వాటన్నింటిని సముచిత రీతిన నివారిస్తూ (తొలగిస్తూ) ఉండెదరుగాక!” అని ప్రార్థించాలి

2 విశేష మంత్రసాధన చేయదలుచుకున్న సాధకుడు ఒకానొక నిర్జన స్థానాన్ని ఎంచుకొన్న తరువాత క్షేత్రపాలకునికి ముందుగా ప్రార్థించాలి "నేను ఈ ప్రదేశంలో ఫలానా సమయం వరకూ ఉండి ఉపాసన కొనసాగించదలిచాను అప్పటివరకూ నీ క్షేత్రంలో ఉండటానికి అనుమతించు ఎటువంటి విఘ్నాలు ఎదురైన వాటిని తొలగిస్తూ ఉండు " అని ఆ క్షేత్ర స్వామిని శరణు వేడుకోవాలి మన ధర్మశాస్త్రాలలో కూడా ఇదే విధిని పేర్కొన్నాయి

3 మంత్రసాధనకై వెడలి వెళ్ళేటప్పుడు వెంట మరొక వ్యక్తిని కూడా తీసుకొని వెళ్ళటం మంచిది. ఆ సహచరి ఉదరపోషణకు కావలసిన సాధనసామగ్రిని, పూజాసామగ్రిని ఏర్పరచటంలో సహకరిస్తాడు బట్టలు ఉతకడానికి, పూజాస్థలాన్ని శుభ్రంచేయడం, ఇతర జీవజంతు జాలం నుండి రక్షణ కల్పించడం వంటి కార్యక్రమాలలో అతడు నిమగ్నమై ఉంటాడు

4 ఒక మంత్రాన్ని సిద్ధింపజేసుకోవాలంటే ప్రప్రథమంగా విధివిధానపూర్వకంగా ప్రతిరోజూ ఒకే నియమిత సంఖ్యలో జపిస్తూ లక్షా పాతికవేల జపం పూర్తి చేసి మంత్రసాధన చేయాలి తదనంతరం అవసరమైనచోట ఎంత చేయగలిగితే అంత చొప్పున అనగా **100** సార్లుగాని, **27**సార్లుగాని, **21** సార్లుగాని ఆయా మంత్రాలకు నిర్దేశింపబడిన సంఖ్యలోగాని జపం ఆచరించినట్లయితే శీఘ్రమే కార్యసిద్ధి కలుగుతుంది. మంత్రసాధన పరిశుద్ధావస్థలో చేయాల్సి ఉంటుంది శాకాహార భోజనం, భూమిమీద శయనం, బ్రహ్మచర్యపాలనం అవశ్యం ఆచరించాలి మంత్రం లో ఏ శబ్దానికి ముందు ౨ లేదా ౩ అంకెలు ఎన్ని ఉంటే అన్నిసార్లు ఆ శబ్దాన్ని ఉచ్చరించాలి. అనగా ౨ సాధయ అని ఉంటే సాధయ సాధయ అని పలకాలి ఇంకా ఇతర సంక్షిప్తమైన గుర్తులు కూడా గురుముఖతః తెలుసుకొని ఉచ్చరించాలి మంత్రరహస్యాన్ని కాపాడటానికి ఇలాంటి గుర్తులు యేర్పరచబడ్డాయి

5 ఎంతవరకూ కుదిరితే అంతవరకూ గ్రీష్మఋతువులో చసే జపం ఉత్తమోత్తమమైనది మంత్రసిద్ధికై సాధ్యమైనంతవరకూ ఉతికినబట్టను అనగా ధోవతి, ఉత్తరీయాలనే ధరించాలి. ఈ బట్టలు పరిశుభ్రమైనవిగా ఉండాలి. ఈ బట్టలతో లఘుశంకలు, దీర్ఘశంకలు తీర్చుకొనరాదు. ఈ బట్టలు ధరించి భోజనం కూడా చేయరాదు ఈ బట్టలు ధరించి మూత్రవిసర్జన చేయటంగాని, వాటితో నిద్రించటంగాని నిషిద్ధము. జపం ముగించుకొని పైన పేర్కొన్న దీక్షావస్త్రాలను విడిచి విడిగా మడిగా (శుచిగా) ఉంచుకోవాలి. వేరే వస్త్రాలను ధరించాలి. ఈ బట్టలను నిత్యదైనిక కర్మలు

ముగించుకొని (కాలకృత్యాలు తీర్చుకొని) శుభ్రంగా స్నానంచేసి చక్కగా తుడుచుకొని ఆ తరువాతనే ధరించాలి. పైన చెప్పిన వస్త్రాలు ఊలు, ఉన్ని, పట్టు, ఇత్యాది అపవిత్ర వస్తువులతో తయారైనవి కాకూడదు మంత్రసాధన సమయంలో స్త్రీ సంపర్కం పనికిరాదు ఒకవిధంగా సన్యాసాశ్రమానికి వచ్చినట్లుగా సంచరించాలి

6 సాధకుడు మంత్రజపానికి ఉపక్రమించే రక్షామంత్రాన్ని (కవచాన్ని) సరళీకరించుకొని రక్షణ కల్పించుకోవాలి అలా చేయడంవల్ల ఏ ఉపద్రవం కలగకుండా ఉండటమే కాకుండా జపకాలంలో విఘ్నాలు కూడా కలగవు రక్షాకవచాన్ని (మంత్రాన్ని) జపించి మంత్ర జపానికి ఉపక్రమించినట్లయితే పాములు, తేళ్ళు, కుక్కలు, పిల్లులు ఇంకా ఇతర జీవజంతుజాలమేదీ కూడా సాధకుని శరీరాన్ని స్పృశించనైనా స్పృశించ లేవు సరికదా! ఆ దరిదాపులకు కూడా రాజాలవు ఒకవేళ మంత్రపూర్ణస్థితిలో దేవీదేవత లెవరైనా సర్పాకారాన్ని లేదా ఇతర జంతురూపంలో సాధకుని భయ పెట్టడానికి వచ్చినప్పటికి రక్షామంత్రజపంతో తపస్సుకు కూర్చున్న సాధకుని శరీరాన్ని అలా వచ్చిన సర్పాలు వగైరా లేవీ స్పృశించజాలవు (అవి) ఎదరబడి భయపెట్ట జాలవు కూడా. ఒకవేళ ఏదైనా కీడు కలిగి (ఉపద్రవం) ప్రాణాపాయ స్థితి వచ్చినా భయపడాల్సిన అవసరం లేదు అలాంటి స్థితిలోనే మంత్రసిద్ధి కలుగుతుందని గ్రహించాలి. మనోభీష్ట సిద్ధికి తగిన సమయంగా గుర్తించాలి రక్షామంత్రం లేదా కవచ జపం లేకుండా సాధన కొనసాగిస్తే సాధకుడు పిచ్చివాడై పోయే ప్రమాదం కూడా ఉంది.

7 మంత్రవిశేషాలలో ఏ వస్తువులతో, ఏ రంగుతో చేయబడిన జపమాలను వాడాలని నిర్దేశింపబడిందో అదే రంగు ఆసనం, పడకను, దీక్షావస్త్రాలు, జపమాలలు ఉపయోగించినట్లయితే ఇతోఽధిక ఫలితం లభిస్తుంది. ఒకవేళ జపమాల అదే రంగులో లభించకపోతే నూలు దారానికి రంగువేసి తయారుచేసుకోవచ్చు.

8 అన్నిటికన్నా దర్భాసనం అదిక శ్రేష్ఠమైనదిగా భావించబడింది ఒకవేళ దర్భాసనం లభించని పక్షంలో తెలుపు, పసుపు, ఎఱుపు రంగులలో మంత్రవిధిలో పేర్కొన్న విధంగా ఆసనాన్ని ఉపయోగించుకోవాలి.

9. పద్మాసనంలో కూర్చుని జపించినట్లయితే అది ఉత్తమఫలితాలను ఇస్తుంది అనగా దేవాలయాలలో దేవీదేవతా విగ్రహాలు ఏవిధంగా పద్మాసనంలో కూర్చుని కనిపిస్తాయో ఆవిధంగా కూర్చుని జపవిధిని నిర్వర్తించాలి. ఎడమచేతిని ఒడిలో

ఉంచుకొని కుడిచేతిలో మాలను ఉంచుకొని జపవిది కొనసాగించాలి ఒకవేళ మంత్రవిధిలో జపమాల ఎడమచేతిలో ఉండాలని నిర్దేశింపబడి ఉంటే కుడిచేతిని ఒడిలో ఉంచుకొని ఎడమచేతిలో జపమాలను ఉంచుకొని జపించాలి

10 కట్టుకునే వస్త్రాలు కప్పుకునే ఉత్తరీయాలు మొదలుగునవి తెల్లవిగా, నాణ్యమైనవిగా ఉండాలి ఏ మంత్రానికి ఏ రంగు వస్త్రాలు పేర్కొన్నారో గమనించి తదనుగుణంగా వస్త్రాలను ధరించాలి

11 శరీరాన్ని మంచిగా శుద్ధిచేసుకొని చక్కగా తుడుచుకొని నెమ్మదిగా ప్రశాంతంగా మంత్రాన్ని జపించాలి ప్రతి అక్షరాన్ని స్వచ్ఛంగా స్పష్టంగా ఉచ్చరిస్తూ జపం ఆచరించాలి

12 మంత్రంలో 'స్వాహా' శబ్దం విధించబడి ఉన్నట్లయితే అక్కడ ధూపంతో జపించాలి అనగా ధూపం లేదా అగరుబత్తి వెలిగించి ముందుంచుకోవాలి

13 దీపం గురించి చెప్పినప్పుడు అక్కడ ఆవునేతితో దీపాన్ని వెలిగించాలి

14 ఆయా మంత్రాలలో ఏయే అంగుళీయకం ఉపయోగిస్తే మంచిదో వివరించబడి ఉంటుంది తదనుగుణంగా ఆయా అంగుళీయాన్ని, బొటనవేలును (అంగుష్ఠాన్ని) ఉపయోగించి జపవిధి సాగించాలి

బొటనవేలిని అంగుష్ఠం అంటారు. బొటనవ్రేలి పక్కవేలును 'తర్జనీ' అంటారు తర్జని పక్కవేలును లేదా మధ్యమవేలును (బొటనవేలితో సహా కలిపి లెక్కిస్తే మూడవది) 'మధ్యమ' అంటారు నాలుగవవేలును (మధ్యమ పక్కది) 'అనామిక' అంటారు అన్నింటికన్నా చివరిది చిన్నది అయిన వేలును 'కనిష్ఠిక' అంటారు

I) జపవిధిలో ధర్మసిద్ధికి, మోక్షప్రాప్తికి అంగుష్ఠంతోపాటు తర్జనిని జతచేసి జపమాచరించాలి.

II) మానసిక శాంతికి, దైహిక మానసికానందానికి అంగుష్ఠంతో మధ్యవేలిని కలిపి జపించాలి

III) సిద్ధి, సాఫల్యాలకు అంగుష్ఠాన్ని అనామికతో కలిపి జపవిధిని సాగించటం శ్రేష్ఠమైనది.

పైన పేర్కొన్న విషయాలను పట్టించుకోకుండా జపమాచరించినట్లయితే అది నిష్ఫలమవుతుంది మంత్రవిధిలో జపసంఖ్య కీలకమైనదిగా గ్రహించాలి నిర్దిష్ట సంఖ్యకు ఎక్కువైనా తక్కువైనా సాధకుని ప్రయత్నం నిష్ఫలమవుతుంది అంతేకాకుండా మంత్రసిద్ధి కూడా జరగదు

అంగుళీయకం (వ్రేలు) అగ్రభాగంలో జపించే ప్రక్రియలో జపమాల పైభాగంలోని మూడు పూసలను 'మేరువు' అని పిలుస్తారు దానినే సామాన్యభాషలో 'సుమేరువు' అంటారు దానిని ఉల్లంఘించి జపమాచరించకూడదు వ్యాకుల చిత్తంతోను, హడావిడిగాను (తొందరతొందరగా) అతివేగంగాను జపమాలను తిప్పుతూ జపించే జపం ఆ మంత్ర ఫలాన్ని సాధకునికి సిద్ధింపజేయదు

ప్రాతఃకాలంలో జపం చేసేటప్పుడు సాధకుని హస్తం నాభి సమక్షంలో (ఎదురుగా) ఉండాలి మధ్యాహ్నవేళలో హృదయంమీద రాత్రివేళ మస్తకంమీద హస్తాన్ని ఉంచి జప మాచరించాలి సర్వకార్యాలలో పంచవర్ణపుష్పాల మాల సర్వశ్రేష్ఠమైనదిగా భావించ బడింది దుష్టభయంకరం కావాలనుకొన్నప్పుడు, స్తంభనలో, వశీకరణలో గట్టి రుద్రాక్షమాలతో జపించటం ఉత్తమమైన పద్ధతి

మంత్రసాధకులు ధర్మంకోసం, శరీరారోగ్యం కోసం, మోక్షంకోసం, శాంతికోసం, పుత్రప్రాప్తికోసం చేసే జపంలో ముత్యాలతో లేదా స్ఫటికాలతో చేసిన జపమాలను ఉపయోగిస్తే ఉత్తమఫలితాలు లభిస్తాయి శాంతికోసం అంటే రోగులకు ఉపశమనంకోసం రోగశాంతికి, గ్రహశాంతికి, పితృదోషం, క్రూరదేవీదేవతలనుండి ఎదురయ్యే ఉపద్రవ శాంతికోసం చేసే జపం అని ఇక్కడ గ్రహించాలి

శాంతిప్రయోగంలో మంత్రజపం చేసే సాధకుడు సరిగ్గా అర్ధరాత్రి సమయంలో పశ్చిమ దిశాభిముఖుడై జ్ఞానముద్రతో, పద్మాసనంలో కూర్చుని ముత్యాలమాలను చేతనిడి స్వచ్ఛశ్వేతవామయోగ పూర్వక ఉచ్చారణతో జపవిధిని కొనసాగించిన పక్షంలో అది సత్ఫలితాలను సత్వరమే సంప్రాప్తింపజేస్తుంది మంత్రంలో ఉచ్చారణ శబ్దాలు చంచః క్రాం ఇత్యాదులు స్తంభనకోసం అనగా అడ్డగించటం నిరోధించటం వంటి ప్రయోగ మంత్రాలతో రెండో ఝాముకు పూర్వమే వజ్రాసనంలో పూర్వాభిముఖంగా కూర్చుని స్వర్ణమణిమాలను చేబూని పసుపురంగు వస్త్రాన్ని ధరించి రః రః పల్లవోచ్చారణ చేస్తూ జపమాచరించాలి ఇది శ్రేష్ఠవిధిగా చెప్పబడింది

జపమాలలో శత్రుచ్చాటనకు రుద్రాక్షమాల, శత్రువులను జయించటానికి గాజు పూసలమాల, మోక్షప్రాప్తికి స్ఫటికమణిమాల లేదా మంచిముత్యాలమాల శ్రేష్ఠమైన ఫలితాలను ఇస్తాయి

ఉచ్చాటన ప్రయోగజపంలో వాయవ్యదిశా ( ఉత్తర పశ్చిమదిశల మధ్యకోణం) ముఖంగా రాత్రి రెండవ ఝాము తరువాత కుక్కుటాసనంలో పగడపుదండ (పగడాల మాల) చేబూని 'ఫట్' పల్లవోచ్చారణతో అంగుష్ఠ తర్జనిల సమ్మేళనంతో జపవిధి నిర్వర్తించాలి.

వశీకరణం లేదా వశంలోకి, తమ అధీనంలోనికి తెచ్చుకొనే ప్రయోగశాలలో రెండవఝాముకు పూర్వమే స్వస్తికాసనంలో ఉత్తరముఖంగా కమలముద్రాసహితంగా పగడపు మాలతో జపం చెయ్యాలి కుసుమ బన లేదా షట్‌పల్లవోచ్చారణ చేస్తూ జపాన్ని సాగించాలి

యంత్రోద్ధారణకు దుర్భాసనం స్వీకరించి అరుణ వస్త్రాలు ధరించి ఎడమచేతిలో ఉంచుకొని దర్భాసనం మీద కూర్చుని ఎడమచేతితో ఎఱ్ఱని పూలు వేస్తూ ఎడమచేతితో జపం చెయ్యాలి

## 2. షట్కర్మ లక్షణాలు

1. శాంతికర్మ : ఈ కర్మ ద్వారా రోగాలు, మంత్రతంత్రవశీకరణాలు, గృహకలహాల నుండి శాంతి లభిస్తుంది
2. వశీకరణం ఈ కర్మ ద్వారా సర్వప్రాణులను వశీకరించుకోవచ్చు
3. స్తంభన · దీనిలో జీవుల ప్రవృత్తిని నిరోధించవచ్చు. దీనిని స్తంభన అంటారు
4 విద్వేషం . ఇద్దరు జీవులు లేదా ప్రాణుల మధ్య పరస్పర ప్రేమకు భంగం కలిగించి మిత్రభేధం కలిగించటం 'విద్వేషం' గా చెప్పబడింది.
5 ఉచ్చాటన అనగా ఈ ప్రక్రియ ద్వారా ఏజీవినైనా దాని కార్యకలాపాలనుంచి వేరుచేసి తొలగిపోయేలా చేయటం
6 మారణం . ఈ కర్మద్వారా ప్రాణులకు మృత్యువును కూడా ప్రసాదించవచ్చు ఇలాంటి కర్మను 'మారణం' అంటారు

## 3. షట్కర్మలు - దేవీపూజలు

పైనపేర్కొన్న షట్కర్మలను చేసేటప్పుడు ఒక్కొక్కవిధమైన కర్మకు ఒక్కొక్క దేవిని (అమ్మవారిని) ఆరాధించాల్సి ఉంటుంది.

1. శాంతికర్మ రతీదేవిని ఆరాధించాలి.
2. వశీకరణం సరస్వతీదేవిని ఆరాధించాలి.

3 స్తంభన లక్ష్మీదేవిని ఆరాధించాలి
4 విద్వేషణ జ్యేష్ఠాదేవిని ఆరాధించాలి
5 ఉచ్చాటన దుర్గాదేవిని ఆరాధించాలి
6 మారణం భద్రకాళీదేవిని ఆరాధించాలి.

## 4. షట్కర్మలు ఎప్పుడు ఆచరించాలి?

షట్కర్మల్ని సమయవిచారంతో ఆయా సమయాలలో ఆచరించాలి ప్రాతః కాలంలో మొదలిడి పదిగంటల వరకు 'వశీకరణ' ను చేయాలి. రెండవఝాము విద్వేషణకర్మ, మూడవఝామున ఉచ్చాటన ఇలా శాంతికర్మలు, స్తంభన మరణాది కర్మలను ఆయా సమయాలలో చేయాలి

## 5. షట్కర్మలు - ఋతు ప్రాధాన్యం

ఒక్కొక్క ఋతువు ఒక్కొక్క కర్మకు అనుకూలంగా ఉంటుంది అందువల్ల ఆయా కర్మలకు ఆయా ఋతువులను నిర్దేశించారు.

హేమంత ఋతువు శాంతికర్మలకు అనుకూలంగా ఉంటుంది. వసంత ఋతువు వశీకరణకు విశేషంగా ఉంటుంది శశిరం స్తంభనకు అనుకూలం కాగా గ్రీష్మం విద్వేషణకు మారణానికి, శరదృతువు, ఉచ్చాటనకు వర్షఋతువు వాంఛిత ఫలితాలను అందిస్తాయి

## 6. వర్ణవిచారం

| | | |
|---|---|---|
| ఆకర్షణ కార్యాలకు | | క్షోమ(తెల్లని) వర్ణం, |
| వశీకరణకు | . | ఎఱుపు; |
| శాంతికర్మలకు | · | శ్వేత (తెలుపు) వర్ణం, |
| స్తంభన | . | పసుపు; |
| ఉచ్చాటన | · | ధూమ్రవర్ణం, |
| విద్వేషణ | . | ఎఱుపు; |
| మారణం | · | నలుపురంగును ధ్యానించాలి |

## 7. దిశానిర్ణయం

మంత్రవిధిలో మంత్రసాధనా సమయంలో ఏ దిశాభిముఖులై జపమాచరించాలి అన్నది కూడా స్పష్టంగా నిర్దేశింపబడింది

వశీకరణకు, తూర్పుముఖంగాను, మారణకు దక్షిణాభిముఖంగాను, ధనలాభానికి పశ్చిమముఖంగాను, శాంతికర్మలకు ఆయువృద్ధికి రక్షణకు, పుష్టికర్మలకు ఉత్తర ముఖం గాను కూర్చుని ఆయా కర్మలను ఆచరించాలి

## 8. ముద్రలు

ఆకర్షణ కొరకు చేసే ప్రయోగాలలో మధ్యాహ్నానికి ముందే దండాసనాయుక్తంగా అంకుశముద్రను దాల్చి దక్షిణాభిముఖంగా కూర్చుని పగడాలమాలను చేబూని బొటన వ్రేలు, మధ్యవ్రేలు మధ్య మాలను తిప్పుతూ జపమాచరించాలి

నిషిద్ధ కర్మలు లేదా మారణకర్మలు చేసే సమయంలో భద్రపీఠాసన యుక్తంగా ఈశాన్యదిశాభిముఖంగా కూర్చుని గాజుపూసల మాలను చేబూని ధూపం సమర్పిస్తూ లేదా హోమం చేస్తూ అంగుష్ఠాన్ని,కనిష్ఠాంగులీయాన్ని జతచేసి జపమాల తిప్పుతూ జపవిధి సాగించాలి

మంత్రసాధన భగవంతుని ముందు లేదా ఇష్టదైవతం యొక్క పీఠానికి ఎదురుగా కూర్చుని చేయాలి. ఇంకా కావాలంటే ఏ దేవాలయానికో వెళ్ళి, కూడా చేయవచ్చు ఇంట్లోనే చేయాలనుకుంటే ఏకాంతస్థానంలో కూర్చుని జపంచేసినా ఉత్తమంగా ఉంటుంది. అయితే ఇంట్లో జరిపే మంత్రసాధనలో కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి ఇంట్లో హోమంగాని, పుణ్యాహవాచనంగాని జరిపి ఓంకారమంత్రంలో ఉన్న చిత్రాన్నిగాని, దేవుడి పటంగాని ఉంచి దీపాన్ని ధూపాన్ని సిద్ధం చేసుకొని ఉచితాసనంమీద కూర్చుని శుభ్రమైన (మడిగా) వస్త్రాన్ని ధరించి జపంచేయాలి జపస్థానంలో పిల్లలు ఏవిధమైన ఆటంకం కలిగించకుండా చూడాలి. పిల్లలు అల్లరిలేకుండా కూడా జాగ్రత్త వహించాలి ఏకాంతానికి, ఏకాగ్రతకు భంగం కలగకుండా పరిసరాలను అమర్చుకోవాలి. ఇలా అమర్చుకొని అత్యంత శ్రద్ధాభక్తులతో ఆచరించే జపవిధి సత్ఫలితాలను సత్వరమే కరతలామలకం చేస్తుంది జపానికి కూర్చొన్నాక ఏవిధమైన వ్యాకులతగాని, అసహనంగాని, మనసులోనికి రానీయకూడదు మనసు చింతాగ్రస్తంగా, ఉండకూడదు ఏవిధమైన దుఃఖాన్ని శోకాన్ని దరికి రానీయకూడదు.

జపసమయంలో మనస్సును స్థిరంగా ఉంచుకోవాలి తూర్పుముఖంగాగాని, ఉత్తరముఖంగాగాని కూర్చుని మంత్రాన్ని జపించాలి జపానికి పూర్వమే జపం ప్రారంభించటానికి తగిన ముహూర్తాన్ని నిర్ణయించుకోవాలి పద్మాసనం వేసుకొని మౌనంగా ఉండాలి ఎన్నిరోజుల జపం చేస్తామో అన్నిరోజులు ఒకే ఆసనంమీద కూర్చోవాలి ఏదైనా రుచిని త్యజించాలి ఏదో ఒక వస్త్రాన్ని పరిత్యజించి రంగు వస్త్రాన్ని ధరించటం వదిలివేయాలి భూశయనం చేయాలి లేదా చాపమీదగాని చెక్కబల్లపైగాని శయనించాలి జపదీక్ష ముగిసేవరకూ బ్రహ్మచర్యాన్ని పాటించాలి మంత్రసాధన పుష్యమి, హస్త, మూలాది శుభనక్షత్రాలలో ఆరంభించాలి మంత్రజపం ఉదయం, మధ్యాహ్నం సాయంత్రం చేయాలి ప్రాతఃకాలంలో నాలుగుగంటలకే నిద్రలేచి స్నానాదులు ముగించుకొని శుభ్రమైన స్థానాన్ని ధరించి జపారంభం చేయాలి జపకాలంలో శ్వేతవస్త్రధారణం చేయాలి ఇంట్లో చేసే జపవిధిలో ఒకసారి దైవదర్శనం చేసుకొని పూజాదులు పూర్తిచేసుకొని జపాన్ని ప్రారంభించాలి మడిబట్ట కట్టుకొని, మధ్యాహ్నం పూట దేవాలయంలో దైవదర్శనం చేసుకొని సాయంత్రంవేళ జపాన్ని ప్రారంభించాలి

జపాన్ని మూడు రకాలుగా వర్గీకరించారు

1. **మానసిక జపం :** మనస్సులోనే చేసే జపాన్ని మానసిక జపం అంటారు. ఇది కార్యసిద్ధికోసం ఈ జపవిధి ఉత్తమమైనది.
2. **వాచికజపం :** ఇది ఉచ్ఛస్వరంలో అటే కొంచెం మంత్రాన్ని జపిస్తూ బిగ్గరగా నిర్వహించే జపం. ఈ వాచిక జప ప్రయోగం పుత్రప్రాప్తికి అనుకూలమైనది
3. **కాయకజపం ·** మాట వినిపించకుండా పెదవులు మాత్రం కదుపుతూ చేసే జపం కాయకజపం ఈ జపం ధనప్రాప్తికోసం నిర్వహిస్తారు

పైన పేర్కొన్న మూడువిధాలయిన జపవిధులలో మానసికజపం ఉత్తమమైనదిగా పేర్కొనబడింది జపాన్ని చేతివేలి కణుపులను లెక్కిస్తూ చేయవచ్చు లేదా జపమాలను తిప్పుతూ చేయాలి జపమాలలు మంచి స్ఫటికాలతో కూడినవి లేదా బంగారం, వెండితో చేసినవి ముత్యాలతో చేసినవి వాడవచ్చును.

విశ్వశాంతికోసం 8 కోట్లు, 8 లక్షలు, 8 వేలు 808 ఇత్యాది సంఖ్యలో జపం చేయాలి. కనీసం ఏడులక్షల జపం చేయాలి ఈ జపం నియమబద్ధంగా నిరంతరంగా నిర్వహించాలి సూతకాలు, పురుడుపుణ్యాలు (అనగా కుటుంబంలో జననమరణాలు ) సంభవించినా దీక్ష మానకుండా జపాన్ని కొనసాగించాలి. అయితే విశ్వశాంతికి జరిపే మంత్రదీక్షలో నిర్దిష్టదినసంఖ్యను అనగా నిర్దిష్ట కాలపరిమితిని అవశ్యం పాటించాలి.

పుత్రప్రాప్తికి నవగ్రహశాంతికి, రోగనివారణాది శాంతిజపాలలో ఒక లక్ష జపం చేయవలసి ఉంటుంది. ఆత్మశాంతికి (మనశ్శాంతికి) అన్నివేళలా జపవిధి కొనసాగించాలి ఇది నిరంతరం సాగించాలి దీనికి ఎన్నిరోజులు చేయాలి అన్న నిబంధనమేదీలేదు జపం ముగియంగానే అభిషేకం చేసి యధాశక్తి దానధర్మాలు చేయాలి

గృహంలో జపం ద్వారా పొందే ఫలితం కంటే వందరెట్ల ఫలం దానధర్మాల ద్వారా లభిస్తుంది పుణ్యక్షేత్రాలలో, వనాలలో జపంచేస్తే వేయిరెట్ల ఫలితాన్నిస్తుంది నదీతీరంలో లక్షరెట్లు, దేవాలయంలో కోటిరెట్ల ఫలం ప్రాప్తిస్తుంది భగవసన్నిధిలో జపం చేస్తే అనంతగుణ ఫలితాన్ని చేతికందిస్తుంది

మోక్షప్రాప్తికి అంగుళీయకాలతో (చేతివేళ్ళతో) జపించాలి అలాగే వ్యాపారాలకు, వ్యవహారాలకు తర్జనితోను, ధనవృద్ధికి సుఖప్రాప్తికి మధ్యమంతోను, శాంతికోసం అనామికతోను, సర్వకార్యసిద్ధికి కనిష్ఠికతోను జపంచేయాలి శత్రునాశనానికి కూడా తర్జనీ ప్రయోగం విజయవంతమవుతుంది

## 9.మాలావిదానం

దుష్టదేవతలు, కలికీ ఉపద్రవాలను తొలగించటానికి, స్తంభనకు, రోగశాంతికి, పుత్రప్రాప్తికి ముత్యాలమాలతోను లేదా కమల బీజమాలతోను జపిస్తే అత్యుత్తమ ఫలితాలు కలుగుతాయి శత్రోచ్చాటనకు రుద్రాక్షమాలతో, సర్వకార్యసిద్ధికి పంచవర్ణ పుష్పాలతో జపం చేయాలి. అంగుళీయక జపం అనగా చేతివ్రేలి కణుపులను లెక్కిస్తూ చేసే జపం పదిరెట్ల ఫలితాన్నిస్తుంది ఉసిరికాయల మాలతో చేసే జపంవల్ల సహస్రగుణ (వేయిరెట్ల) ఫలం లభిస్తుంది లవంగమొగ్గలమాలతో జపిస్తే ఐదువేలరెట్ల ఫలం, స్ఫటికమాలతో పదివేలరెట్లు, ముత్యాలమాలతో లక్షరెట్లు, కమలబీజమాలతో పదిలక్షలరెట్లు, స్వర్ణమాలతో కోటిరెట్లు ఫలితం కరతలామలకమవుతుంది జపమాలతోపాటు జపంమీద శ్రద్ధా, ఏకాగ్రత శుద్ధాంతఃకరణం అత్యంతావశ్యకం

## శ్రీ యంత్రసాధనలో సిద్ధిదాయక మంత్రాల ఎన్నిక

వివాహం నిశ్చయం చేసుకోవడానికి ముందుగా నాడి, నక్షత్రం వంటి జ్యోతిష విషయాలు పరిగణలోనికి తీసుకొన్నట్లుగానే మంత్రదీక్షా నిర్ణయానికి పూర్వం సాధకునికి మంత్రానికి గల సంబంధవిచారణ కూడా మంత్రశాస్త్రానుగుణంగా చేయబడుతుంది దీనికి సంబంధించిన విస్తారమైన వివరణలున్నప్పటికి సంక్షేపంగా నైనా వాటికి

సంబంధించిన ఆవశ్యక చక్రాల వర్ణన ఇక్కడ చాలా అవసరం మొదటగా కులాకుల చక్ర వివరణం సముచితమైనది. యాభై అక్షరాలను పంచభూతాలలో అంతర్గతం చేసి సాధకుని పేరుతోపాటు విచారణ చేయడం ఈ పద్ధతిలోని విశేషం అనగా మంత్రం యొక్క ఆద్యక్షరం సాధకుని పేరులోని ఆది అక్షరాల పంక్తిలోనే వచ్చినట్లయితే ఆ మంత్రము సాధకుడు ఏకదైవతములుగా భావించవచ్చు కులాకుల చక్రం మీ పరిశీలనకోసం ఇవ్వబడినది.

## 1. కులాకుల చక్రం

| వాయువు | అగ్ని | భూమి | జలం | ఆకాశం |
|---|---|---|---|---|
| అ,ఆ | ఇఈ | ఉఊ | ఋ,ౠ | ఌ ౡ |
| ఏ | ఐ | ఓ | ఔ | అం |
| క | ఖ | గ | ఘ | ఙ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |
| య | ర | ల | వ | శ |
| ష | క్ష | ళ | స | హ |

## 2. ఫలితాలు చూసే పద్ధతి

ఈ చక్రం ద్వారా సాధకునికి దీక్షా నిర్ణయాన్ని విచారించే పద్ధతి ఈవిధంగా ఉంటుంది సాధకుని పేరులోని తొలి అక్షరం దేవత పేరులోని తొలి అక్షరం ఒకే వర్గానికి చెందినట్లయితే ఆ దేవత సాధకుని (అనుకూల) కులంగా భావించాలి. అప్పుడు ఆ దేవతకు సంబంధించి సాధన పూర్ణసిద్ధిప్రదమవుతుంది.

ఈవిధంగా మిత్రవర్గం లేదా మిత్రకులం దేవత అయినట్లయితే అప్పుడు కూడా సాఫల్య సిద్ధి కలుగుతుంది

శత్రుకులానికి సంబంధించిన దేవత అయినట్లయితే సాధనలో సాఫల్యసిద్ధి సందిగ్ధంగా ఉంటుంది గురుకృప ఉంటే ఆ విషయం వేరుగా ఉంటుంది.

మిత్రవర్గం : జలవర్గం+ భూమివర్గం,
అగ్నివర్గం + వాయువర్గం;

శత్రువర్గం . వాయువర్గం + భూమివర్గం,
అగ్నివర్గం + భూమివర్గం,

విశేషం . ఆకాశవర్గం అన్ని వర్గాలతోను మైత్రి కలిగి ఉంటుంది
అందుచే అది సర్వ వర్గాలకు మిత్రవర్గ అవుతుంది

## 3. రాశి చక్రం

వృషభం
ఉ ఊ ఋ
మిధునం
ౠ ఌ ౡ
మేషం
అ ఆ
ఇ ఈ
మీనం
య ర
ల వ
కుంభం
ప ఫ బ
భ మ
కర్కాటకం
ఏ,ఐ
మకరం
త ధ ద ధ న
సింహం
ఓ ఔ
కన్య
శ ష స
హ ల క్ష
తుల
కఖ
గఘ
ఙ
ధనుస్సు
ట ఠ డ
ఢ ణ
వృశ్చికం
చ ఛజ
ఝ ఞ

## 4. ఫలవిధి

1. సాధకుని రాశినుండి మంత్రం యొక్క రాశి 6వది గాని, 8వది గాని, 12వది గాని అయినచో ఆ మంత్రం ఉపయోగకరంగా ఉండదు.

2 సాధకుని రాశినుండి మంత్రంయొక్క రాశి 1వది, 5వది లేదా 9వది అయినచో మిత్రవర్గం అవుతుంది.

3 మంత్రం యొక్క రాశి 2,6,10వ రాశిలో ఉన్నట్లయితే మంత్రం శుభప్రదం.

4 3,7, 11 రాశిలో ఉంటే మంత్రం పుష్టికరం

5. 4,8,12 రాశులలో ఉంటే మృత్యుకారకమవుతుంది.

## నక్షత్రచక్రం

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని<br>అఆ<br>దేవ | భరణి<br>ఇ<br>నర | కృత్తిక<br>ఈఉఊ<br>రాక్షస | రోహిణి<br>ఋ ౠ<br>నర | మృగశిర<br>ఏ<br>దేవ | ఆర్ద్ర<br>ఐ<br>నర | పునర్వసు<br>ఓఔ<br>దేవ | పుష్యమి<br>క<br>దేవ | ఆశ్లేష<br>ఖగ<br>రాక్షస |
| మఘ<br>ఘ ఙ<br>రాక్షస | పూ ఫ<br>చ<br>నం | ఉ ఫ<br>ఛజ<br>నం | హస్త<br>ఝఞ<br>దేవ | చిత్త<br>టఠ<br>రాక్షస | స్వాతి<br>డ<br>దేవ | విశాఖ<br>ఢణ<br>రాక్షస | అనూరాధ<br>తథద<br>దేవ | జ్యేష్ఠ<br>ధ<br>రాక్షస |
| మూల<br>నపఫ<br>రాక్షస | పూ షాఢ<br>బ<br>నర | ఉ షాఢ<br>భ<br>నర | శ్రవణం<br>మ<br>దేవ | ధనిష్ఠ<br>యర<br>రాక్షస | శతభిషం<br>ల<br>రాక్షస | పూ భాద్ర<br>వశ<br>నర | ఉ భాద్ర<br>షసహ<br>నర | రేవతి<br>ళ క్ష అం అః<br>దేవ |

రాశిచక్రం చూశాక నక్షత్ర చక్రాన్ని పరిశీలించాలి

## 6. నక్షత్రచక్రం చూసే విధానం

మొదటగా సాధకుని యొక్క గణాన్ని, మంత్రం యొక్క గణాన్ని నిశ్చయించుకొని ఆ తరువాత సాధకుని గణానికి మంత్రం యొక్క గణం ఎలా ఉంటుందో పరిశీలించాలి

మానవగణానికి .మానవగణం – శ్రేష్ఠం, దేవగణం – ఉత్తమం, రాక్షసగణం – నికృష్టం (అధమం),

దేవగణానికి · దేవగణం – ఉత్తమం; మానవగణం – శ్రేష్ఠం

రాక్షసగణానికి రాక్షసగణం – శ్రేష్ఠం, మానవగణం – నికృష్టం, దేవగణం – నికృష్టం.

ఇదేకాకుండా సాధకుడు తన నక్షత్రం నుండి మంత్ర నక్షత్రం వరకూ లెక్కించి చూచే పద్ధతి కూడా ఉన్నది

**1,10,19** అయినట్లయితే – జన్మతార , **2, 11, 20** – సంపత్తార, **3, 12, 21** – విపత్తార, **4,13,22** – క్షేమతార, **5,14,23** – ప్రత్యక్తార, **6,15,24** – సాధనతార, **7, 16, 25** – నైధనతార; **8, 17, 26** – మిత్రతార, **9, 18, 27** – పరమమిత్రతార.

ఈవిధంగా సాధనకు అనుకూలమైన మంత్రాన్ని ఎన్నిక చేసుకోవాలి అది ఉపయోగపడుతుందా లేదా అన్నది ముందుగానే తెలుసుకోవాలి.

## 7. అకడమ చక్రం

ఈ చక్రం అ, క, డ, మ అనే అక్షరాలతో ప్రారంభమవుతుంది గనుక ఈ చక్రాన్ని 'అకడమ' చక్రం అంటారు.

| | | |
|---|---|---|
| | అ క డ మ | |
| ఔ ఞ ఫ క్ష | | ఈ ఘ త ల |
| | ఏ భ ధ ష | |

ఈ చక్రగణనం దక్షిణావర్తంగా ఉంటుంది సాధకుని నామాక్షరం ఉన్నా కోష్టకం (గడి) నుండి మంత్రాక్షరం ఉన్న కోష్టకం వరకూ లెక్కించి ఫలితాలు పట్టికలో ఈవిధంగా సరిచూసుకోవాలి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1వ | కోష్ఠంలో ఉన్నట్లయితే | - | సిద్ధము | - | శ్రేష్ఠం, |
| 2వ " | " | - | సాధ్యము | - | అనుకూలం; |
| 3వ " | " | - | సుసిద్ధము | - | ఉత్తమం, |
| 4వ " | " | - | శత్రు | - | విపరీతం; తాజ్యం, |
| 5వ " | " | - | సిద్ధము | - | శ్రేష్ఠం; |
| 6వ " | " | - | సాధ్యం | - | అనుకూలం; |
| 7వ " | " | - | సుసాధ్యం | - | ఉత్తమం, |
| 8వ " | " | - | శత్రు | - | త్యాజ్యం; |
| 9వ " | " | - | సిద్ధము | - | శ్రేష్ఠం, |
| 10వ " | " | - | సాధ్యము | - | అనుకూలం; |
| 11వ " | " | - | సుసిద్ధము | - | ఉత్తమం; |
| 12వ" | " | - | శత్రు | - | త్యాజ్యం (త్యజించదగినది). |

## 8. అకథహా చక్రం

ఈ చక్రం మొదటి కోష్టకం అ, క,థ, హ తో ప్రారంభమవుతుంది అందుచేతనే ఈ చక్రానికి అకథహచక్రం అని పేరు పెట్టారు

| | | | |
|---|---|---|---|
| 1<br>అ క<br>ధ హ | 2<br>ఉ<br>జ ప | 3<br>ఆ<br>ఖ ద | 4<br>ఊ<br>చ ఫ |
| 5<br>ఓ<br>డ బ | 6<br>ఌ<br>ఝ మ | 7<br>ఔ<br>ధ శ | 8<br>ౡ<br>ఞ య |
| 9<br>ఈ<br>ఘ న | 10<br>ౠ<br>జ భ | 11<br>ఇ<br>గ ధ | 12<br>ఋ<br>ఛ బ |
| 13<br>అః<br>త స | 14<br>ఐ<br>ర ల | 15<br>అం<br>ణ ష | 16<br>ఏ<br>ట ర |

ఇందులో కూడా దక్షిణావర్తంగానే గణించాలి.

ఇందులో కూడా సాధకుని పేరులోని అక్షరం ఏ కోష్టకంలో ఉన్నదో అక్కడనుంచి మంత్రాక్షరం ఏకోష్టకంలో ఉన్నదో అక్కడివరకూ లెక్కించి ఫలితాలు పట్టిక ననుసరించి సరిచూసుకోవాలి.

| | | |
|---|---|---|
| 1వ ప్రకోష్ఠమైతే | సిద్ధము | శ్రేష్ఠం; |
| 2వ ప్రకోష్ఠమైతే | సాధ్యము | అనుకూలం; |
| 3వ " | సుసిద్ధము | ఉత్తమం, |
| 4వ " | శత్రు | త్యాజ్యము, |
| 5వ " | సిద్ధము | శ్రేష్ఠం, |
| 6వ " | సాధ్యము | అనుకూలం; |
| 7వ " | సుసిద్ధము | ఉత్తమం; |
| 8వ " | శత్రు | త్యాజ్యం; |
| 9వ " | సిద్ధము | శ్రేష్ఠం, |

| | | |
|---|---|---|
| 10వ " | సాధ్యము | అనుకూలం, |
| 11వ " | సుస్థిరము | ఉత్తమం; |
| 12వ " | శత్రు | త్యాజ్యము, |
| 13వ " | సిద్ధము | శ్రేష్ఠం, |
| 14వ " | సాధ్యము | అనుకూలం, |
| 15వ " | సుసిద్ధము | ఉత్తమం, |
| 16వ " | శత్రు | త్యాజ్యం |

## 9. ఋణ ధనాత్మకచక్రం

రుద్రయామళ తంత్రంలో ఋణధనాత్మక చక్రం పేర్కొనబడింది ఈ చక్రం పై వరుసలో మంత్రాక్షరాల అంకెలు క్రింది వరుసలో సాధక నామాక్షరాల అంకెలు ఉంటాయి మధ్యలో ఉండే నాలుగు వరుసలలో అక్షరాలు ఉంటాయి.

మొదటగా మంత్రంలోని స్వరవ్యంజనాలను విడదీసి దానికి సంబంధించిన అంకెలను కూడాలి ఇదేవిధంగా సాధకుని పేరులోని స్వరవ్యంజనాల అంకెలను కూడా కలిపి ఆ రెండింటిని ఒకదానితో ఒకటి భాగించాలి.

| పైవరుస | 6 | 6 | 6 | 0 | 3 | 4 | 4 | 0 | 0 | 0 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అఆ | ఇఈ | ఉఊ | ఋౠ | | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః |
| 2 | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట |
| 3 | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ |
| 4 | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ |
| క్రింది వరుస | 2 | 2 | 5 | - | - | 2 | 1 | - | 4 | 4 | 1 |

శేషంలో మంత్రాక్షరాల సంఖ్య అధికం ఉంటే అది ఋణాత్మకం అవుతుంది అలాగే తక్కువగా ఉంటే ధనాత్మకమవుతుంది. ఋణాత్మకమైన మంత్రం ద్వారా శీఘ్ర సిద్ధి లభిస్తుంది సమానమైతే కూడా సాఫల్యం ఉంటుంది. ధనాత్మక మంత్రసాధన వల్ల సాఫల్యం లభించటానికి ఆలస్యం పడుతుంది. శేషం సున్న అయినపక్షంలో ఆ మంత్రసాధన మృత్యుకారకమని గ్రహించాలి.

# కొన్ని మంత్రాలకు మినహాయింపులు

కొన్ని గ్రంథాలలో కొన్నిమంత్రాలకు మినహాయింపులు ఇవ్వబడ్డాయి ఆ మంత్రాల విషయంలో ఋణాత్మక ధనాత్మక వివేచనగాని, ఇతరమైన చక్ర పరిశీలనంగాని అవసరం లేదు. అవి స్వయంగా సిద్ధిస్తాయి ఏ సాధకుడైనా వాటిని సాధన చేసి సిద్ధింపచేసుకోవచ్చు

స్వప్న లబ్ధే స్త్రియా దత్తే మాలా మంత్రే త్రయాక్షరే ।
వైది కేషు చ సర్వేషు సిద్ధాది న్నైవ శోధయేత్ ॥
హంస స్యా ష్టాక్షర స్యాపి తధా పంచాక్ష రస్య చ ।
ఏక ద్విత్ర్యాది బీజస్య సిద్ధా ది న్నైవ శోభయేత్ ॥

అనగా 1 స్వప్నంలో లభించిన మంత్రము; 2. స్త్రీ సాధకురాలి ద్వారా ఉపదేశింపబడిన మంత్రము; 3. బీజాక్షరాలు అధికంగా ఉండి పెద్దదిగా ఉన్న మంత్రము (మాలామంత్రము), 4 మూడువేల అక్షరాలతో కూడిన మంత్రము; 5. సమస్త వైదిక మంత్రాలు; 6 హంసమంత్రము, 7. అష్టాక్షర మంత్రము; 8 పంచాక్షరమంత్రము 9. ఒకే ఒక బీజాక్షరంలో ఉన్న మంత్రము; 10 రెండు బీజాక్షరాలతో ఉన్న మంత్రము, 11 మూడు బీజాక్షరాలతో ఉన్న మంత్రము. ఈ మంత్రాల విషయంలో చకవిచారము ఋణధనాత్మక మంత్ర వివేచన అవసరం లేదని భావము.

ఇంకా ఈ క్రింద పేర్కొన్న మంత్రాలకు సంబంధించి కూడా ఎట్టి విచారము లేక నిరభ్యరంతరంగా సాధన చేసుకోవచ్చు.

1 శ్రీకృష్ణ సంబంధమైన ఏ మంత్రమైనా, 2 గోపాలమంత్రం.

భక్తిశ్రద్ధల మాట అటుంచి ప్రతి మంత్రానికి దానికి సంబంధించిన సాధన ప్రారంభించే ముందే పైన పేర్కొన్న విధంగా ఆయా చక్రాల ద్వారా ఫలితాలు సరి చూసుకొని మంత్రాలను ఎన్నుకొని తదనుగుణమైన సాధన కొనసాగించాలని చాలా శాస్త్రాలు నొక్కి వక్కాణించాయి కాబట్టి సాధకులు సరైన గురూపదేశంతో శాస్త్రోపదేశానుగుణంగా వ్యవహరించినట్లయితే సత్వరఫలితాలే కాకుండా సత్ఫలితాలను కూడా పొందగలుగుతారు.

## 11. మంత్ర సంస్కారం

ఏ మంత్రమైనా ఛిన్నము, రుద్రము, శక్తిహీనము, పరాఙ్ముఖము మొదలైన అర్థశత దోషాలనుండి రక్షింపబడలేదు సప్తకోటి మంత్రాలకు పైన చెప్పినట్లుగా దోషగ్రస్తం కాక తప్పదు. ఈ దోషనివృత్తి కోసం మంత్రాలకు ఈక్రింద పేర్కొన్నట్లుగా "దశసంస్కారాలు" చేయాల్సి ఉంటుంది.

దోషాని మాన విజ్ఞాయ యో మంత్రాన్ భజతే జడః ।
సిద్ధి ర్నజాయతే తస్య కల్పకోటి శతైరపి ॥

1 జననం 2 దీపనం 3 బోధనం 4 తాడనం 5 అభిషేకం 6 వమలీకరణం 7 జీవనం 8. తర్పణం 9 గోపనం 10 ఆపయాపనం అనేవి దశసంస్కారాలు




పటం · ఆత్మాభిముఖ త్రికోణం

1 భూర్జపత్రంమీద గోరోచనం, కుంకుమ,చందనం మొదలైనవాటితో ఆత్మాభిముఖ త్రికోణాన్ని ముందుగా గీయాలి ఆ తరువాత మూడు త్రికోణాలలో ఆరేసిచొప్పున సమానరేఖలు నిర్మించాలి. ఈవిధంగా 49 త్రికోణాలు ఏర్పడేటట్లుగా చేయాలి. వీటిలో ఈశాన్యకోణంనుండి మాతృకావర్ణా--లిఖించి దేవతను ఆవాహనచేసి పూజించి మంత్రంలోని ఒక్కొక్క వర్ణాన్ని ఉద్ధరించి (ఎత్తిరాసి) వేరే పత్రం మీద రాయాలి. అలా చేయడం వలన "జననం" అనే ప్రథమ సంస్కారం జరుగుతుంది.

2 హంస మంత్రాన్ని సంపుటంచేసి ఒక వెయ్యిసార్లు జపించడం ద్వారా మంత్రానికి రెండవదైన 'దీపన' సంస్కారం చేసినట్లవుతుంది

3 హ్రూం - బీజాన్ని సంపుటీకరించి మంత్రాన్ని ఐదువేలు జపం చేసినట్లయితే మంత్రం హ్రౌం రామాయనమః హ్రౌం । "బోధనం" అనే మూడవ సంస్కారం జరుగుతుంది

4. "ఫట్" సంపుటి చేసి మంత్రాన్ని ఒక వెయ్యిసార్లు జపించినట్లయితే "తాడనం" అనే నాలుగవ సంస్కారం జరుగుతుంది.

మంత్రం  ఫట్ రామాయనమః ఫట్ ॥

5 భూర్జపత్రంమీద మంత్రాన్ని లిఖించి "రోం హంసః ఓం" - అనే మంత్రంతో అభిమంత్రించాలి ఒక వెయ్యిసార్లు జపించిన జలంతో అశ్వత్థపత్రాదుల ద్వారా ఆ మంత్రాన్ని అభిషేకించాలి ఇలా చేసినట్లయితే 'అభిషేకం' అనబడే ఐదవ సంస్కారం జరుగుతుంది

6 ఓం త్రోం వషట్ - అనే ఈ వర్ణాలతో మంత్రాన్ని సంపుటితం చేసి ఆ మంత్రాన్ని ఒక వెయ్యిసార్లు జపించినట్లయితే "వమలీకరణం" అనే ఆరవ సంస్కారం జరుగుతుంది

మంత్రం : ఓం త్రోం వషట్ రామాయనమః వషట్ తోం ఓం ।

7. 'స్వధా వషట్' - అనే వర్ణాలతో సంపుటితం చేసిన మూలమంత్రాన్ని ఒక వెయ్యిసార్లు జపించినట్లయితే 'జీవనం' అనే ఏడవ సంస్కారం జరుగుతుంది.

మంత్రం : స్వధా వషట్ రామాయనమః వషట్ స్వధా ॥

8 పాలు, నీరు, నెయ్యితో మూలమంత్రాన్ని వందసార్లు జపించి అర్పణ చేయడమే తర్పణసంసారం. ఇది ఎనిమిదవ సంస్కారం

9. 'హ్రీం' బీజాన్ని సంపుటితంచేసి మంత్రాన్ని ఒక వెయ్యిసార్లు జపించటం ద్వారా 'గోపనం' - అనే నవమ సంస్కారం జరుగుతుంది.

మంత్రం : హ్రీం రామాయ నమః హ్రీం ॥

10. హ్రౌం బీజాన్ని సంపుటీకరించి మంత్రాన్ని (సంస్కరించాల్సిన మంత్రాన్ని) ఒక వేయిసార్లు జపించటం ద్వారా 'ఆప్యాయనం' అనే దశమసంస్కారం జరుగుతుంది

మంత్రం : హ్రౌం రామాయ నమః హ్రౌం ॥

ఈవిధంగా సంస్కరింపబడిన మంత్రం శీఘ్రమే సిద్ధిప్రదనువుతుంది

## 12. కూర్మచక్రం

"దీప స్థానం సమాశ్రిత్య కృతం కర్మ ఫలప్రదమ్ ॥"

మంత్రసాధనలో దీపస్థానం (కూర్మచక్రం) కూడా నిర్ణయింపబడుతుంది సాధకుడు మంత్రసాధన చేయాల్సిన స్థానం, క్షేత్రం, నగరం లేదా గృహం మొదలైనవాటిని నిర్ణయించుకొని ఆ స్థానాన్ని తొమ్మిది భాగాలుగా చేసి కూర్మచక్రంగా యేర్పరచాలి. దీని మధ్యభాగంలో 'స్వరాక్షరాలు' లిఖించాలి తూర్పున ప్రారంభించి 'వ్యంజనాక్షరాలు' లిఖించాలి 'ల' క్ష అనే అక్షరాలు లిఖించాలి




కూర్మ చక్రం

ఏ గడిలో (కోష్ఠకంలో) అయితే క్షేత్రం యొక్క తొలి అక్షరం ఉంటుందో ఆ గడి ఉన్నచోటును ముఖంగా భావించాలి. దానికి రెండువైపులా ఉన్న రెండుగడులు భుజాలుగాను, మిగిలిన రెండువైపులా ఉన్న గడులు కుక్షిగాను, మరి రెండు గడులు పాదాలుగాను, మిగిలిన గడులు పుచ్ఛముగాను (తోకగాను) గుర్తించాలి ముఖస్థానంలో జపించటం వలన సిద్ధి కలుగుతుంది భుజాలలో అల్పజీవనం, కుక్షిలో ఉదాసీనత, పాదాలలో దుఃఖం, తోకలో వధ, బంధనం వంటి పీడలు కలుగుతాయి

## 13. మంత్రం జపం అంగాలు

మంత్రజపానికి 24 అంగాలు ఉన్నాయి వీటిని సంపూర్ణంగా పాటించడం వలననే మంత్రసిద్ధి కలుగుతుంది

ఆ అంగాలు క్రింద ఇవ్వబడ్డాయి.

1 మంత్రం 2 మంత్రశాఖ 3 మంత్ర చైతన్యం 4 మంత్రార్థం 5 మంత్రభావన 6 గరుధ్యానం 7. ఇష్ట (దేవతా) ధ్యానం 8. కులాకులం 9. మహాసేతువు 10. కవచసేతువు 11. నిర్వాణం 12 బంధనం 13 యోనిముద్ర 14. కరన్యాసం 15. అంగన్యాసం 16. ప్రాణాయామం 17. ముఖశుద్ధి 18. ప్రాణయోగం 19. దీపనం 20. సూతక ద్వయ మోక్షణం 21. మధ్యదృష్టి 22 అనులోమ విలోమములు 23. పురశ్చరణ 24. కీలనం – ఉత్కలనం

# 14. మంత్ర చైతన్యం

మంత్రానికి ముందు కామబీజ, శ్రీంబీజం, శక్తిబీజం మరియు ఆకారం నుండి క్షకార వరకూ గల సమస్త స్వర వర్ణాలు పలికి ఆ తరువాత మంత్రోచ్చారణ చేయాలి మళ్ళీ అవే బీజాక్షరాలను, అక్షరాలను ఉచ్చారణ చేయాలి ఈవిధంగా మూలమంత్రాన్ని 108 సార్లు జపించినట్లయితే ఈ ప్రయోగం వలన మంత్రం చైతన్యవంతమవుతుంది

సూర్యమండలంలో పేర్కొన్నట్లుగా బహిఃస్థితంగా అంతస్థితంగా ఉన్న ద్వాదశ కళాత్మకమైన సూర్యునిలో తన యొక్క మంత్రాన్ని చింతన చేస్తూ 108 సార్లు మంత్రజపం చేసినట్లయితే ఆ సాధకుని మంత్రం చైతన్యవంత మవుతుంది

'వరదాతంత్రం'లో మరొకవిధంగా కూడా పేర్కొనబడింది దీనిని అనుసరించి మంత్రానికి "ఈ" అనే అక్షరాన్ని సంపుటిచేసి జపం చేసినట్లయితే స్వయంగానే దానంతట అదే చైతన్యవంతమవుతుంది

ఈవిధంగా మంత్ర చైతన్యాన్ని సాధించాలి.

# 15. బీజమంత్రాలకు అర్థాలు

మంత్రాలు సాధారణమైన శబ్దాలు కావు వాటి శక్తి దివ్యమైనది అయినప్పటికి వాటికి అర్థాలు కూడా ఉన్నాయి. ఇవి ఇష్టదేవతనుండి అభిన్నంగా ఉంటూనే దేవతను గురించి బోధింపచేస్తాయి. మంత్రం ఏ వస్తువును సంకేతిస్తూ ఉన్నదో, సాధకుని ఎక్కడికి తీసుకొని వెళ్ళాలనుకుంటుందో అది సాధకునికి అవగాహన అయినట్లయితే సాధన మరింత సులభతరమవుతుంది. ఈ కారణంగానే అన్ని శాస్త్రాలలోను మంత్రాలతోపాటుగా వాటికి సంబంధించిన అర్థజ్ఞానం కూడా అత్యంతావశ్యకమని పేర్కొనబడింది. యోగ శాస్త్రంలో మంత్రార్థభావననే జపంగా పేర్కొనటం జరిగింది సాధకుని విషయంలో మంత్రార్థం గుప్తంగా ఉండకూడదు. ఇప్పుడు కొన్ని బీజమంత్రాల అర్థాలను పరిశీలిద్దాం

**హ్రౌం :** దీనిని ప్రసాద బీజం అంటారు. "హ్ర" అంటే శివుడు "ఔ" అంటే సదాశివుడు. బిందువు యొక్క అర్థం దుఃఖహరణం ఈవిధంగా హ్ర,ఔ, బిందువులతో యేర్పడిన హ్రౌం బీజానికి అర్థం శివ, సదాశివుల కృపవల్ల నా దుఃఖం తొలగిపోవునుగాక!

**దూం :** "ద" అంటే దుర్గ ఊకారానికి అర్థం రక్ష. బిందువు యొక్క అర్థం చెయ్యి (చేయుము) అనగా "హే దుర్గామాతా! నన్ను రక్షించు" అని అర్థం.

**క్రీం :** క = కాళి, (కాళి) ర = బ్రహ్మ, ఈకారం = మహామాయ, నాదం = విశ్వమాత బిందువు = దుఃఖ హరణం అనగా బ్రహ్మశక్తి స్వరూపురాలైన కాళీమాతా! నా దుఃఖాలను తొలగించు. (దూరం చెయ్యి) అని భావము

**హ్రీం :** హ = శివుడు, ర = ప్రకృతి ఈ నాదం = మహామాయ, బిందువు = దుఃఖ హరణం అనగా శివునితో గూడిన మహామాయ నా దుఃఖాలను తొలగించునుగాక! అని అర్థము

**శ్రీం :** 'శ' అనగా మహాలక్ష్మి, ర = ధన సంపత్తి, ఈ = తుష్టి; ఈ నాదం = మహామాయ బిందువు = దుఃఖహరణం అనగా ధనసంపత్తికి, తుష్టికి పుష్టికి సంబంధించిన మహాలక్ష్మీదేవి! నా దుఃఖాలను తొలగించు గాక అని భావము.

**ఐం:** ఇది సరస్వతీబీజం ఐ = సరస్వతి కాగా బిందువు దుఃఖహరణం, అనగా సరస్వతీదేవి నా దుఃఖాలను నశింపజేయును గాక! అని అర్థము

**క్లీం :** దీనిని కృష్ణబీజం లేదా కామబీజం అంటారు క = కృష్ణ లేదా కామం ల = ఇంద్రుడు, ఈ, బిందువుల అర్థంపైన చెప్పినట్లే శ్రీకృష్ణుడు నాకు సుఖశాంతులను ప్రసాదించుగాక! అని ఈ బీజాక్షరానికి అర్థాన్ని గ్రహించాలి

**హ్రూం :** దీనిని వర్మబీజం లేదా కూర్చబీజం అంటారు హ = శివుడు, ఊ = భైరవుడు; నాదం, బిందువు అర్థం పైన చెప్పినట్లే గ్రహించాలి. మొత్తంమీద ఈ బీజాక్షరానికి అర్థం శివుడు నా దుఃఖాలను హరించుగాక!

**గం :** గ అనగా గణపతి (గణేశుడు); బిందువు = దుఃఖహరణం శ్రీగణేశుడు నా దుఃఖాలను తొలగించునుగాక! అని అర్థము

**గ్లౌం :** ఇది గణేశబీజం. గ = గణేశుడు (వినాయకుడు) ల = వ్యాపకుడు, ఔ = తేజస్సు, బిందువు = దుఃఖనాశకం శ్రీగణేశుడు నా దుఃఖాలను నశింపజేయునుగాక! అని అర్థము.

**క్షౌం :** ఇది నృసింహబీజం. క్ష = నృసింహుడు; ర = బ్రహ్మ; ఔ = ఊర్ధ్వదంతుడు; బిందువు = దుఃఖనాశకం. శ్రీ నృసింహస్వామి దుఃఖాలనుండి నన్ను రక్షించునుగాక! అని భావము.

స్త్రీం : ఇది వధూబీజం. స = దుర్గోత్తరణం త = తారకం ర = ముక్తి ఈ = మహామాయ నాదం = విశ్వమాత, బిందువు = దుఃఖహరణం. భగవతి మహామాయ దుఃఖాలనుండి నన్ను రక్షించునుగాక! అని ఈ బీజాక్షరానికి అర్థం

ఈవిధంగా అనేకమైన బీజాక్షరాలున్నాయి వాటికి అర్థాలున్నాయి అని సాధకుడు గ్రహించాలి ఇంకా మరిన్ని బీజాక్షరాలకు అర్థాలు కావాలంటే ఏకాక్షర నిఘంటువుల్ని సంప్రదించాలి అలా పరిశీలించినప్పుడు మంత్రంకాని అక్షరం అంటూ ఉండదని మనకు బోధపడుతుంది అయితే వాటిని ఎలా ప్రయోగించాలి అన్నది తెలుసుకోవడం అత్యంతావశ్యకం

ధ్యాయేన పరమేశాని యద్రూనం సముపస్థితమ్ ।
తదైవ పరమేశాని మంత్రార్థ విద్ధి పార్వతి ॥

సహస్రారాన్ని చేరి బ్రహ్మస్వరూపాన్ని ధ్యానిస్తూ ధ్యానిస్తూండగా స్వయంగా ప్రకటితమయ్యేది ఏదైతే ఉన్నదో అదే మంత్రానికి అర్థం ఆ అర్థాన్ని సంప్రాప్తింప జేసుకోవడానికి ప్రయత్నంచేయాలి

## 16.మంత్రాలలోని బీజాక్షరాలు - వాటి సంపుటి

సరస్వతీతంత్రానుసారం మంత్రబీజానికి పూర్వం వాటిలోని బీజాక్షరాల గురించి తెలుసుకోవడం చాలా అవసరం జపాన్ని ప్రారంభించేముందు ఏ మంత్రాన్ని జపించబోతున్నామో ఆ మంత్రం యొక్క మూలమంత్రాన్ని శిరస్సుమీద స్థాపన చేసుకోవాలి అనగా శిరస్సుమీద దానిని న్యాసం చేయాలి. కొన్ని మంత్రాలకు సంబంధించిన బీజాక్షరాల సంపుటి ఈక్రిందివిధంగా ఉంటుంది

| | |
|---|---|
| కాళి | ఓం క్రీం హూం స్త్రీం హ్రీం ఫట్ |
| తార | ఓం హ్రీం శ్రీం హూం |
| ఛిన్నమస్త | ఓం శ్రీం హ్రీం హ్రీం ఐం హ్రీం హ్రీం స్వాహా |
| వజ్రవైరొచని | ఓం శ్రీం హ్రీం హ్రీం ఐం హ్రీం హ్రీం స్వాహా హూం |
| భైరవి | ఓం హ స రై |
| త్రిపురసుందరి | ఓం ఐ క్లీం హ్రీం త్రిపురే భగవతి స్వాహా |
| భద్ర | ఓం క్లీం క్లీం హూం |
| భువనేశ్వరి | ఓం హ్రీం |
| విష్ణువు | ఓం నమో నారాయణ |
| మాతంగి | ఓం |
| ధూమావతి | ఓ హ్రీం |
| షోడశి | ఓ స్త్రీం |

| | |
|---|---|
| లక్ష్మి | ఓం శ్రీం |
| సరస్వతి | ఓం ఐం |
| అన్నపూర్ణ | ఓం క్లీం |
| శివుడు | ఓం హౌం |

ఇదేవిధంగా అన్ని దేవతలకు

**తిథి వారం పక్షం మాసం :** మంత్రాన్ని స్వీకరించేటప్పుడు శుభప్రదమైన మాసాన్ని, పక్షాన్ని, తిథిని, వారం మొదలైన వాటిమీద దృష్టి పెట్టుకోవాలి

## మాసం :

1. మంత్ర స్వీకరణకు వైశాఖం, శ్రావణం, ఆశ్వయుజం, కార్తీకం, మార్గశీర్షం, మాఘ ఫాల్గుణమాసాలు ఉత్తమమైనవి.
2. గోపాలమంత్రం లేదా శ్రీకృష్ణ సంబంధమైన మంత్రాలకు చైత్రమాసం అన్నివిధాలా మంచిది
3. లక్ష్మీమంత్రం శ్రీమంత్రాలెకు కార్తీకమాసం, మార్గశిరమాసం సముచితమైనవి.
4. ఆషాఢమాసములో లక్ష్మీమంత్రం తప్ప అన్ని మంత్రాలకు అనుకూలంగా ఉంటుంది.
5. తంత్రోక్తమైన మంత్రాలకు మాఘ ఫాల్గుణమాసాలు విశేష శుభప్రదాలు.
6. అధికమాసం కొన్ని మంత్రాలకు వర్జించపదగినది

## పక్షం:

1. దీక్షకు కృష్ణ శుక్ల పక్షాలలో ఏ పక్షమైనా మంచిదే!
2. మంత్రాన్ని శుక్లపక్షంలో ప్రారంభించాలి.
3. కొంతమంది విద్వాంసులు కృష్ణపక్ష పంచమి వరకు మంత్రసాధనకు శుభప్రద మైనదిగా పేర్కొన్నారు.
4. కేవలం మోక్షప్రాప్తికై చేసే సాధనామంత్రాలకు కృష్ణపక్షం శుభదాయకమైనది ఇతరమైన అన్ని మంత్రాలకు శుక్లపక్షమే శ్రేష్ఠమైనది.

## తిథి :

1. మంత్రసాధనకు విదియ తదియలు, చవితిపంచములు సప్తమినుండి ద్వాదశి వరకూ మంచివే. వీటితోపాటు పూర్ణిమనాడు కూడా మంత్రసాధన విశేష శుభప్రదమైనది.

2 చతుర్థ నవమి, చతుర్దశి కొన్ని ప్రత్యేక మంత్రాలకు పనికిరాదు

3 అక్షయ తృతీయ, నాగపంచమి, జన్మాష్టమి, దుర్గాష్టమి, కార్తీక కృష్ణత్రయోదశి, చతుర్దశి అమావాస్య తిధులు గ్రహింపదగినవి

**వారం :** మంగళవారం, శనివారం, ఆదివారం తప్ప మిగిలినవారాలన్నీ మంత్రసాధన ప్రారంభించటానికి శుభప్రదమైనవి.

**నక్షత్రం :** అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఘ, పూర్వఫల్గుణి స్వాతి, అనూరాధ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రాలన్నీ మంత్రసాధనకు అన్నివిధాలా అనుకూలమైనవి

**యోగం :** ప్రీతి, ఆయుష్మ, సౌభాగ్యం, శోభనం, ధృతి, వృద్ధి, సుకర్మ, సాధ్యము, హర్షణం, వరీయానం, శివ, సిద్ధి, ఇంద్రయోగాలు ఉపయుక్తాలు

**కరణం :** బబ,చాలవ, కౌలవ, తైతిల, వనిజ కరణాలు సఫలతా పూర్వకమైనవి.

**లగ్నం :** వృషభం, సింహం, కన్య, మీనలగ్నాలు మంత్రసాధనకు మరింత ఉపయోగకరమైనవి. విష్ణు మంత్రానికి మేషం, వృశ్చికం, సింహం, కుంభలగ్నాలు అత్యంత శుభప్రదమైనవి

శక్తిదీక్షలో లేదా శక్తి సంబంధ మంత్రసాధనకు మిధున, కన్య, ధనుర్లగ్నాలు మీనలగ్నం శుభప్రదమైనవి.

శివ మంత్రసాధనలో మేషలగ్నం, కర్కాటక, తులా మకరలగ్నాలు ఉచితమైనవి.

## మంత్రసాదనకు ఉపయోగకరమైన ప్రదేశాలు

మంత్రసాధనకు గోశాల, గురుగృహం, దేవాలయం, అరణ్యం, నదీతీరం, బిల్వవృక్షం క్రింద, పర్వతశిఖరంమీద (కొండమీద) గుహలోపల, గంగాతీరం మొదలైన ప్రదేశాలు సర్వశ్రేష్ఠమైనవి

**ఆసనవిదానం :** వెదురులో చేసిన చదరుపై కూర్చుని జపం చేసే సాధకునికి దరిద్రం చుట్టుకుంటుంది. పాషాణం లేదా రాతిమీద కూర్చుని జపమాచరిస్తే వ్యాధులు, పీడలు సంక్రమిస్తాయి. కటికనేలమీద చేసే జపం దుఃఖాన్ని కొని తెచ్చిపెడుతుంది గడ్డితో చేసిన

చదరుమీద కూర్చుని జపంచేస్తే అది అపకీర్తిని సంప్రాప్తింపజేస్తుంది ఆకులతో చేసిన ఆసనంమీద కూర్చుని జపంచేస్తే జాతకుడు భ్రమకు లోనవుతాడు బండరాతిమీద కూర్చొని జపం చేయడం వలన మనస్సు నిరంతరం చంచలమైపోతుంది చర్మంతో చేసిన ఆసనంమీద కూర్చుని జపం చేసినట్లయితే జ్ఞానం నష్టమైపోతుంది కంబళీ మీద కూర్చొని చేసే జపం వల్ల సత్కారాలు చేజారిపోతాయి మానమర్యాదలు మంటగలిసి పోతాయి

అయితే సర్వకార్యసిద్ధికి దర్భాసనం సర్వశ్రేష్ఠమైనదిగా చెప్పబడింది

అలాగే నీలంరంగు వస్త్రాన్ని ధరించి జపమాచరిస్తే మనస్సు మహాదుఃఖ భరితమవుతుంది హరితవర్ణ వస్త్రధారణతో చేసే జపం గౌరవాన్ని హరిస్తుంది శ్వేతవస్త్రం (తెలుపురంగు వస్త్రం) యశఃపూర్వకంగా పీతాంబరం సర్వసంతోషకారకమవుతుంది ధ్యానానికి ఎఱుపురంగు వస్త్రం శ్రేష్ఠమైనదిగా పేర్కొనబడింది

ఇక్కడ మనకొక మూలభూతమైన ప్రశ్న ఉదయించకమానదు ఏ మంత్రాన్ని ఏ ఆసనంమీద కూర్చుని జపించాలి? అన్నది ప్రశ్న అలాగే ఏ ఆసనం ద్వారా శీఘ్ర ఫలప్రాప్తి కలుగుతుంది? వీటికి సమాధానాలు మన ప్రాచీనఋషులు తమ అనుభవం ఆధారంగా నిర్దేశించి పెట్టారు 1 పద్మాసనం 2 సిద్ధాసనం 3 స్వస్తికాసనం 4 సుఖాసనం. ఈ నాలుగు జపసాధనల్లో మిక్కిలి ఉపయోగకరమైనవిగా పేర్కొనబడ్డాయి

## పద్మాసనం :

ఈ ఆసనం జపానికి, ధ్యానానికి శ్రేష్ఠమైనదిగా పేర్కొనబడింది. దర్భాసనం మీదగాని ఇతరమైన అనుకూల ఆసనాలమీదగాని కూర్చుని ఈ ఆసనం వేసుకొని జపధ్యానాలు కొనసాగిస్తే చాలామంచిది. కుడికాలుని ఎడమతొడపైన, ఎడమకాలును కుడి తొడపైన ఉంచాలి. అటుపైన కుడిచేయిని కుడి మోకాలుపైన, ఎడమచేయిని ఎడమమెకాలు పైన ఉంచాలి. ఇలా కూర్చుని వేసే ఆసనం పద్మాసనం ఈ ఆసనంలో శిరస్సు, మెడ, వెన్నెముక అన్ని ఒకే సరళరేఖలో నిటారుగా ఉండాలి.

## సిద్ధాసనం :

హఠయోగ ప్రదీపికలో ఈ ఆసనం 72 నాడుల్లోని మాలిన్యాన్ని శోధించి వేస్తుందని చెప్పబడింది. ఈ ఆసనం సిద్ధించినట్లయితే ఇతరమైన ఏ ఆసనాలతోను పని ఉండదు ఈ ఆసనవిధానం ఈక్రిందివిధంగా ఉంటుంది. ఎడమకాలి మడమను గుద స్థానంలో ఉంచాలి. కుడి కాలు లింగం మీదుంచాలి. ఇది సిద్ధాసనం ఈ ఆసన స్థితుడై సాధకుడు ఏ మంత్రసాధన చేసినా ఆ మంత్రం అవశ్యం సిద్ధిస్తుంది పద్మాసనం తరువాత

మహిమాన్విత దృష్టిలో మరింత మహత్వపూర్ణమైన స్థానము ఈ ఆసనానికి ఉంది. ఈ ఆసనాన్ని సముచిత రీతిన అభ్యాసం చేశాక అనేకవిధాలైన సిద్ధులు సంప్రాప్తిస్తాయి. స్థూలకాయులైన సాధకులు కూడ ఈ ఆసనాన్ని అనాయాసంగా అభ్యాసం చేసుకోవచ్చు బ్రహ్మచర్యపాలనకు ఈ ఆసనం మిక్కిలి ఉపయోగకరమైనదిగా పేర్కొనబడింది పద్మాసనంలోగాని, సిద్ధాసనంలోగాని 15 నిమిషాలపాటుకూర్చున గలిగేలా అభ్యాసం చేసి ఏకాగ్రతతో జపసాధన చేయగలిగినట్లయితే ఆ సాదకుడు ఊహించని ఉపయోగాలను అత్యద్భుతంగా తన సాధన పొందగలుగుతాడు వాత రోగ నిదానానికి ఈ ఆసనం ఉత్తమోత్తమమైనది ఈ ఆసనం పిక్కలలోని నరాలకు బలం చేకూర్చుతుంది

## స్వస్తికాసనం :

తొడలకు, పిక్కలకు మధ్య అనగా మోకాళ్ళ నడుమ భాగంలో రెండు పాదాలు ఉంచి సౌకర్యంగా కూర్చొనడం ద్వారా స్వస్తికాసనం ఏర్పడుతుంది

## సుఖాసనం :

బాసనపట్టు వేసికొని సౌకర్యంగా కూర్చునే ఆసనం సుఖాసనం ఈ ఆసనం ఎక్కువసేపు కూర్చునే వీలు కల్పిస్తుంది సాధారణంగా ఈ ఆసనస్థితులై సాధకులు జపమాచరిస్తుంటారు

పైన పేర్కొన్న ఆసనాలలో సౌకర్యవంతమైన దానిని ఎన్నుకొని సాధన సాగించవచ్చు. అంటే సదుపాయంగా ఉన్న ఆసనంమీద మంత్రజపం చేసుకోవచ్చు

ఆసన సిద్ధికి కనీసం అరగంట సేపైనా అభ్యాసం ఆరంభించాలి నెమ్మది నెమ్మదిగా దీనిని 3 గంటల వరకు పెంచుకోవాలి. ఇలా ఒక సంవత్సరం పాటు కొనసాగిస్తే ఆసనసిద్ధి కలుగవచ్చు

మంత్రాలను ఎన్నుకొనే సమయంలో పరిపూర్ణమైన జాగురూకత, హేతుబద్ధమైన వ్యవహారం అత్యంతావశ్యకము దూషితమైన మంత్రానుష్ఠానం వలన ఏవిధమైన సాఫల్యము సిద్ధించదు మంత్ర జపవేళలో మన భావనలు, ఆలోచనలు పరిశుద్ధంగా, పవిత్రంగా ఉంచుకోవాలి

మంత్రే తీర్థే ద్విజే, దేవే, దైవజ్ఞే, భేషజే గురౌ ।
యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ ॥

అనగా మంత్రము, తీర్థం, ద్విజుదు, దేవత, దైవజ్ఞుదు (జ్యోతిష్యుదు), ఔషధం, గురువు వీరియందు ఎవరికి ఎలాంటి భావన ఉంటుందో వారికి అలాంటి సిద్ధియే లభిస్తుంది



# తిలకధారణం

యజ్ఞోపవీతధారణం, శిఖాబంధనం వలెనే తిలకధారణం కూడా సాధనాపరంగా మిక్కిలి ప్రదానమైనది ఇది బ్రాహ్మణులకే పరిమితమైనదిగా భావించడం పొరపాటు క్షత్రియులు కూడా తిలకధారణం చేయడం మనం గమనిస్తూనే ఉన్నాంగదా! రాజులకు రాజ్యాభిషేకవేళలో రాజతిలకం దిద్ది మహోత్సవం జరపటం ప్రసిద్ధమైన విషయమే! అందుకే దానిపేరు రాజతిలకం అని పెట్టారు రాజతిలకం లేకుండా గద్దెనెక్కే అధికారం లభించదని భావించేవారు అక్కడ అధికారం తిలకంద్వారానే గుర్తింపబడేది ఈ తిలకధారణం ఈనాటిదికాదు ప్రాచీనకాలంనుండి నిరంతరం సాగివస్తున్న ప్రక్రియే! శ్రీరామచంద్రుదుకూడా ముఖానికి చందనతిలకం ధరించినట్లు వాల్మీకిమహర్షి వర్ణించాడు

ఏ దేవాలయానికి వెళ్ళినా పూజారి మన ముఖాన బొట్టుపెట్టి ఆశీర్వదించడం నేటికీ మనకు అనుభవైక విషయమేగదా!

హోమాది వైదికక్రియలలో బొట్టుపెట్టుకోవడం అవశ్యకమైన విధి ఇంతకీ సారాంశ మేమిటంటే శూన్యలలాటంతో దైవసంబంధ కార్యక్రమాలేవైనా నిషిద్ధాలే!

వినాభస్మ త్రిపుంద్రేన వినా రుద్రాక్షమాలయా ।
పూజితో ఒపి మహాదేవీ నస్యాత్ తస్య ఫలప్రదః ॥

తిలకం (బొట్టు) అనేకవిధాలుగా ఉంటుంది. మృత్తిక, భస్మం, చందనం, కుంకుమ, సింధూరం, గోపీచందనం మొదలైనవి

సంధ్యాతర్పణాదులకు పూర్వమే తిలకధారణచేయడం పరమావశ్యకమైన విధిగా భావించబడింది

స్నానం దానం తపో హోమో దేవతా పితృ కర్మచ ।
తత్సర్వం నిష్ఫలం యాతి లలాటే తిలకం వినా ।
బ్రాహ్మణ స్తిలకం కృత్వా కుర్యాత్సంధ్యాం చ తర్పణమ్ ॥

నొసటన తిలకం ధరించకుండా (బొట్టు పెట్టుకోకుండా) చేసే స్నానం, దానం, తపం, యజ్ఞం, దేవ పితృకర్మలు సర్వదా నిష్ఫలమవుతాయి. నుదుట బొట్టు పెట్టుకున్నాకనే బ్రాహ్మణుడు సంధ్యాతర్పణాదులు నిర్వర్తించాలి ఏ తిలకాన్ని ఏవిధంగా ధరించాలన్నది విశేషంగా పేర్కొనబడింది -

ఊర్ధ్వపుండ్రం మృత్తికాయై భస్మనా తు త్రిపుండ్రకమ్ ।
ఉభయం చందనేనైవ హ్యాభ్యంగత్యుత్సవ రాత్రిషు ॥

ఊర్ధ్వ పుండ్రాన్ని మృత్తికలో ధరించాలి. త్రిపుండ్రాన్ని భస్మంతో ధరించాలి చందనం తోటి రెండు విధాలైన తిలకాన్ని అభ్యంగ, ఉత్సవరాత్రులలో ధరించాలి

పైన పేర్కొన్న తిలకసామగ్ని ఉపలబ్ధంగాని పక్షంలో జలంతోసైతం తిలకధారణ చేయవచ్చు. దీనిని శాస్త్రాలు కూడా ఆదేశించాయి. అయితే సాన మీదనుంచే తిలకాన్ని తీసుకొని తిలకధారణం చేయడం నిషిద్ధమైనదిగా నిర్దేశించాయి

అనామికా శాంతిదా ఉక్తా మధ్యమాయుష్కరీ భవేత్ ।
అంగుష్ఠః పుష్టిదః జ్ఞేయో తర్జనీ మోక్షదాయినీ ॥

అనామికలో చేసే తిలకధారణం వల్ల శాంతి, మధ్యవ్రేలితో ఆయువృద్ధి, అంగుష్ఠంతో పుష్టి, తర్జనితో మోక్షప్రాప్తి కలుగుతాయని పేర్కొనబడింది.

## చందనతిలకం (గంధంబొట్టు)

చందనేన ఉత్తరైర్దేవతాభ్యః ప్రదాయ । ఉత్తరయా అనుర్లిప్య ।
సావరభాష్యంలో ఈవిధంగా పేర్కొనబడింది.
దేవాయ ధూపో దేయః పుష్పాణి అవకర్తివ్యాని చందనేన అనులిప్తభ్య ।
ఉపహారొస్మై ఉపహర్తవ్యః ఏవం కృతే దేవేస్తుష్యతి ॥

దేవతలకు ధూపం సమర్పించాలి. పుష్పాలు అర్పించాలి. ఇంకా చందనం పూయాలి. నైవేద్యం పెట్టాలి ఈవిధంగా చేసినట్లయితే దేవతలు సంతుష్టులై ప్రసన్నులవుతారు.

తిలకధారణం ధార్మికమైన మహిమను సూచిస్తుంది. చికిత్సాశాస్త్ర దృష్టితో చూసినప్పటికి చందన మహిమ గణనీయమైనది. అనేకమైన రోగాల విషయంలో ఇది అత్యంత ఉపయోగకరమైనది. శిరోవేదనకు గంధంపూత విశేషమైన ఔషధం. దీనివలన ప్రశాంతత, చల్లదనం లభిస్తాయి. ఈనాడు రోజంతా అనేకమైన పనులలో నిమగ్నుడై ఉండే మానవుని ఎదుట అనేక సమస్యలు చుట్టుముడుతున్నాయి. వాటితో వ్యక్తి సతమతమై అనేక వత్తిళ్ళకు లోనవుతున్నాడు. కారణం లేకుండానే క్రోధావేశాలకు గురి అవుతున్నాడు. గంధలేపనం వల్ల మస్తిష్కం ప్రశాంతతను పొందుతుంది. తగిన

బలాన్ని పుంజుకుంటుంది శాంతియుతంగా సమస్యాపరిష్కారానికి కావలసిన శక్తిని ప్రసాదిస్తుంది ప్రపంచంలోని ప్రతి ఘనకార్యము మస్తిష్కశక్తి ద్వారానే సాధించబడుతుంది గంధం ధరించటంవల్ల దీనికి కావలసిన స్ఫూర్తి, చైతన్యశక్తి సమకూరుతాయి నిత్యనూతనమైన శక్తి ఆవిర్భవిస్తుంది ప్రశాంత మస్తిష్కంలోనికి వికారాలు (రాగద్వేషాలు) దరిచేరవు అసంబద్ధమైన ఆలోచనలు కలగనప్పుడు శక్తి ఉద్భవిస్తుంది గంధం పూత మానసిక ఏకాగ్రతను పెంపొందిస్తుంది గంధం (చందనం) దుర్గంధాన్ని అపవిత్రను దూరం చేస్తుంది మస్తిష్కంలోని (మెదడులో) జ్ఞానతంతులవల్ల సంచరించే శక్తి భ్రుకుటి, లలాటం మధ్య కేంద్రీకృతమై ఉంటుంది చందనధారణ వల్ల సంకల్పశక్తికి దృఢత్వం (దార్ఢ్యం) ఏర్పడుతుంది గంధాన్ని ధరించటం ద్వారా ఆధ్యాత్మికంగా అనేకమైన మహిమాన్వితమైన ప్రయోజనాలను మనం పొందవచ్చు.

శతం చైకా చ హృదయస్య నాద్యం స్తాసాం మూర్ధానమభినాః స్వతైకా ।
త్యోర్ధ్వమాయన్ నమృత తత్వమేతి, విష్వ న్యా ఉత్క్రమణే భవన్తి ॥

హృదయంలో 108 నాడులుంటాయి వీటిలోని ఒకనాడి కపాలంవైపు ప్రయాణిస్తుంది ఇది సాధకుడు దీని ఊర్ధ్వలోకాలకు చేరి అమృతాన్ని పొందుతాడు ఇతరమైన నవనాడులు విభిన్న మోనులను ప్రసాదించేవిగా ఉంటాయి

పైన సుషుమ్ననాడి వైపు సాగే సంకేతాలు శిరస్సునుదుటి భాగంనుండే వెలువడతాయి. వాటికి ప్రశాంతత కలిగి బలంచేకూరటం ఆధ్యాత్మిక ప్రకృతికి సబల చిహ్నంగా భావించబడుతుంది. కారణమేమిటంటే ఈ నాడి బ్రహ్మరంధ్రం వైపు ప్రయాణిస్తుంది ఇది యోగులకు తీర్థతుల్యమైనది. ఈ రంధ్రం ద్వారానే యోగులకు ప్రాణోత్సర్గం జరుగుతుంది దీనికి అంతటి విశిష్టత ఉంది. చందనధారణం ఈ మార్గాన్ని ప్రశస్తం చేసినట్లవుతుంది.

## భస్మధారణం

గుహ్యసూత్రానుసారం "త్రయాయుషం జనదగ్నే" అనే మంత్రం ఆధారంగా శిరసున, నుదుటన , మెడకు, బాహువులకు, హృదయానికి భస్మాన్ని పులుము కొంటాయి. కేవలం భస్మాన్నే బొట్టుగా కూడా పెట్టుకుంటారు. సాధువులు యోగులు శరీరమంతా భస్మాన్ని ధరిస్తారు. హోమం ముగిశాక పూర్ణాహుతి సమర్పించాక కూడా

భస్మధారణ చేసే విధానం ఉన్నది. స్థూలద్రవ్యాలకంటే సూక్ష్మ ద్రవ్యాలలోనే అధికమైన గుణాలుంటాయి ఈ విషయాన్ని ఈనాటి విజ్ఞాన శాస్త్రాలు కూడా అంగీకరిస్తున్నాయి ఏ వస్తువైనా తన స్థూలరూపం నుండి సూక్ష్మరూపానికి పరివర్తనం చెందడం దాని యొక్క శక్తికి, వృద్ధికి సంకేతంగా చెప్పవచ్చు స్థౌల్యం (లేదా స్థూలత్వం) ఎంతగా తగ్గుతూపోతుంటే అంతగా ఆ వస్తువు శక్తిమంతమవుతుంది అందువల్లనే ఆయుర్వేద వైద్యంలో భస్మాలు తయారుచేయబడి శక్తిమంతాలుగా చికిత్సకు ఉపయోగపడుతున్నాయి.

ఈ భస్మము అత్యంత ప్రభావశాలిగా ఉంటుంది హోమంలో సుగంధద్రవ్యాలు, ఔషధులు, నెయ్యి, ఎండిన ఫలాలు, ఇంకా పౌష్ఠికమైన ద్రవ్యాలు ఆహుతి ఇవ్వబడతాయి ఆకాశవాతావరణంలో వీటి గుణాలు ద్విగుణీకృతమవుతాయి అలాగే హోమగుండంలో బూడిదగా మిగిలిన భస్మంలో కూడా ఈ గుణాలు నిక్షిప్తమై ఉంటాయి అవి వేదమంత్రోక్తంగా అభిమంత్రితమవుతాయి

మంత్రోచ్చారణతోపాటు పవిత్రమైన భావన, శ్రద్ధ సమ్మిళితమై ఉంటాయి అందువల్ల భస్మం మంత్రపూతమై, శక్తివంతమై దరించినవారికి అనేకవిధాలైన ప్రయోజనాలను చేకూర్చి పెడుతుంది. హోమభస్మం వల్ల అనేక రోగాలు దూరమవుతాయి. అనేకమైన మానసికరోగాలు నయమవుతున్నాయి. యజ్ఞభస్మాన్ని ధరించడంవలన శరీరంలోని సూక్ష్మమైన, ప్రధానమైన కేంద్రాలపై దాని ప్రభావం అధికంగా ఉంటుంది అవి జాగృతమైనప్పుడు సాధకుడు శక్తిమంతుడవుతాడు. శిరస్సుపై భస్మాన్ని ధరిస్తే బ్రహ్మరంధ్రం, సహస్రదళ కమలం, ఆజ్ఞాచక్రం జాగృతమవుతాయి. భస్మాన్ని హృదయంపై ధరిస్తే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం ద్వారా ఉత్పన్నమయ్యే తామసగుణం నశించి సాత్త్వికత యేర్పడుతుంది. సూర్య చక్రవికాసం కూడా దీనిద్వారానే జరుగుతుంది.

భస్మానికి బాహ్యావాతావరణం నుండి సురక్షితంగా ఉండే గుణం ఉంది. భస్మంలో మండే బొగ్గును, పుల్లలను, పిడకలను ఉంచినట్లయితే దానియొక్క ప్రకాశము, ప్రభావము బహుకాలం మన్నికగా ఉంటుంది సాధుపురుషులు శీతాకాలంలో శరీరమంతా భస్మాన్ని పులుముకొని ఉంటారు. ఇలా పులుముకొన్న భస్మం శీతం నుండి వారిని కాపాడుతుంది. సాక్షాత్తు శంకరుడు భస్మాన్ని ధరించేగదా మంచుకొండల మీద సాధన చేస్తుండేవాడు. తేజస్సును సురక్షితంగా ఉంచడం అనే కారణంవల్లనే భస్మధారణను ఆయుర్వృద్ధికి మాధ్యమంగా పేర్కొన్నారు

భస్మంలో తేజస్సును కాపాడే గుణం ఉన్నది దీనికి కారణం దీనిలో అల్యూమినియం, పొటాష్, సోడియం కార్బొనేట్ లోహాలు, మెగ్నీషియం వంటి

పదార్థాలు ఉండటమే. భస్మం పులుముకోవడం వలన రోమకూపాలు తెరచు కుంటాయి. తద్వారా ఆక్సిజన్ లోనికి ప్రవేశించి రక్తశుద్ధి కారణభూత మవుతుంది రోగక్రిములను నాశనం చేస్తుంది. జఠరాగ్నిని వృద్ధిచేస్తుంది ఆకలి పుట్టిస్తుంది విషప్రభావాలకు విరుగుడు కలిగిస్తుంది. భస్మం దుర్గంధాన్ని దూరం చేస్తుంది గాయాలను మాన్పుతుంది. (మాను బట్టిస్తుంది). అనేక రోగాలను హరిస్తుంది సంక్షిప్తంగా చెప్పాలంటే -

శరీరాన్ని బాహ్యావాతావరణం నుండి కాపాడటం, రోమకూపాలను తెరచుకొనేలా చేసి వాయు వినిమయానికి సౌలభ్యం కలిగించడం, జఠరాగ్నిని తేజోవంతం చేయడం, విషప్రభావాలకు విరుగుడు కలిగించడం, రోగాలను నశింపజేయడం, మనోబుద్ధి చిత్తాహంకారాది తామసవిచారాలను నశింపజేసి సాత్త్విక విచారాన్ని ప్రోగుచేయడం, ఆజ్ఞాచక్ర సూర్యచక్రాదులను జాగృతంచేయడం వంటి ప్రయోజనాలను భస్మధారణం మనకు కలిగిస్తుంది.

కాలాగ్ని రుద్రోపనిషత్తులు త్రిపుంద్రవిభూతి మహిమను కీర్తిస్తూ ఈవిధంగానే పేర్కొనబడింది -

త్రిపుంద్రధారణలోని త్రిరేఖల్లో ప్రథమరేఖ గార్హపత్యాన్ని, అగ్నిరూపాన్ని, ఆకారాన్ని, రజోగుణరూపాన్ని, భూలోకరూపాన్ని, స్వాత్మరూపాన్ని, క్రియాశక్తి రూపాన్ని, ఋగ్వేద రూపాన్ని ప్రాతఃహవన రూపాన్ని, మహేశ్వరరూపాన్ని సూచిస్తుంది.

ద్వితీయరేఖ, దక్షిణాగ్ని రూపాన్ని, ఓంకార రూపాన్ని, సత్త్వరూపాన్ని, అంతరిక్ష రూపాన్ని, అంతరాత్మరూపాన్ని, ఇచ్ఛాశక్తి రూపాన్ని, యజుర్వేదరూపాన్ని మధ్యాహ్నకాల హవనరూపాన్ని, సదాశివరూపాన్ని సూచిస్తుంది.

తృతీయరేఖ ఆహ్వనీయరూపాన్ని, నివాసరూపాన్ని, తమోరూపాన్ని, భూలోక రూపాన్ని, పరమాత్మరూపాన్ని, జ్ఞానశక్తిరూపాన్ని, సామవేదరూపాన్ని, తృతీయహవన రూపాన్ని మహాదేవరూపాన్ని సూచిస్తుంది.

## త్రిపుండ్రం త్రిగుణాత్మకమ్

శూన్యలలాటంతో చేసే శివపూజ అయినా వ్యర్థమే అని దేవీభాగవతం పేర్కొంది. సాధకుడు ఏదో ఒక భస్మం తప్పక ధరించాలి. పవిత్ర భస్మాన్ని ఈక్రిందివిధంగా ధరించాలి. కుడిచేతి మధ్యాంగుళిత్రయంతో అనగా ఐదువేళ్ళలో బొటనవ్రేలు, చిటికినవేలు మినహాయించి మిగిలిన మూడువేళ్ళలో నుదుట త్రిపుండ్రాన్ని ధరించాలి. ఇది ఈ కంటి కొసనుంచి ఆ కంటికొసదాకా ఉండేలా త్రిరేఖలు తీర్చిదిద్దుకోవాలి.

మూడువేళ్ళతో భస్మాన్ని త్రిరేఖలుగా ధరించాలి. ఈ రేఖలలో అనామికకు అకారమనీ, మధ్యమాంగుళిని ఉకారమని, తర్జనిని మకారమని అంటారు. అనగా చిటికెన వ్రేలు ప్రక్కవేలు అకారము, మధ్యవేలు ఉకారము, చూపుడువేలు మకారమని అంటారన్న మాట ఈ మూడువేళ్ళతో ధరించిన త్రిపుండ్రాల త్రిగుణాత్మకం, ప్రణవాత్మకం (అకార ఉకార మకారాలతో ఓంకారం అన్నమాట) అడుగున ఉండే అనామికరేఖ బ్రహ్మతత్త్వం రజోగుణ సూచకం కాగా, మధ్యవేలిగీత విష్ణుతత్త్వం సత్త్వగుణ సూచకం. అలాగే చివరిది తర్జనీరేఖ శివతత్త్వం తమోగుణం ఈవిధంగా త్రిపుండ్రం త్రిగుణాత్మకం త్రిమూర్త్యాత్మకంగా గ్రహించాలి.

ఈవిధంగా త్రిపుండ్రధారణ జేసే బ్రహ్మచారి అయినా గృహస్థుదు అయినా, వానప్రస్థుదు, చివరికి సన్యాసి అయినా అతదు మహాపాతకాలనుండి, ఉపపాతకాలనుండి విముక్తుదవుతాదు అతదు సకలదేవతలను ఎరిగినవాదు (జ్ఞాత) అవుతాదు. సర్వభోగాలను అనుభవించి చివరకు శివలోకాన్ని చేరతాదు. పునర్జన్మరహితుదు కూడా అవుతాదు.

తొలుత ఎదచేతితో తరువాత కుడిచేతిలో గంగ, భగీరథి మొదలైన తీర్థాల మృత్తికను లేదా గాహాంచాత్యాపాసన యొక్క అగ్నిభస్మాన్ని గ్రహించి దానికి జలాన్ని సమ్మిశ్రితం చేశాక కుడిచేతిలో భస్మాన్ని గ్రహించి జలాన్ని కలిపిన తరువాత కుడిచేతిలో భస్మాన్ని మర్దన చేయాలి. ప్రాతఃకాలంలో జలం మిశ్రితంగా, మధ్యాహ్నం చందనమిశ్రితంగా, సాయంకాలం జలంమిశ్రితంగా భస్మాన్ని ధరించాలి. భస్మాన్ని ఈ క్రింది మంత్రాలలో అభిమంత్రించాలి.

ఓం అగ్నిరితి భస్మ । ఓం వాయురితి భస్మ ।
ఓం జలమితి భస్మ । ఓం స్థలమితి భస్మ ।
ఓం వ్యోమితి భస్మ । ఓం సర్వహవా ఇదం భస్మ ।
ఓం మమ ఏతాని చక్షుషి భస్మా నీతి ।

ఆ తరువాత క్రిందపేర్కొన్న మంత్రాలతో విభిన్న అంగాలకు భస్మాన్ని ధరించాలి.

ఓం ప్రసహ్యా భస్మనాయోనిమపశ్చ పృథ్వీ మగ్నే ।
ఓం త్రయాయుష జ్జమదగ్నే రితి లలాటే ।
ఓం కశ్యపస్య త్రయాయుషమితి దక్షిణాంగ ।
ఓం యద్దేవేషుం త్రయాయుషమితి దక్షిణాంగ ।
ఓం తన్నోం అరస్తు త్రయాయుషమితి హృది ।

## మృత్తికాతిలకం

శాస్త్రాలలో మృత్తికా తిలకానికి ప్రాధాన్యత ఇవ్వబడింది తిలకానికి (బొట్టుకు) తీర్థ స్థలాలలోని మృత్తిక మహిమాన్వితమైనదిగా పరిగణించబడింది మృత్తిక ఆవిధంగా లాభదాయకమైనది పూలు, పళ్ళలో వనస్పతులలో ఉండే గుణాలు మూలతః మట్టిలోనే దాగి ఉంటాయి. శాస్త్రజ్ఞులు కూడా ఈ విషయాన్ని నిర్ధారించారు కూడా ఫలాలు, పుష్పాలు వృక్షాలు మొక్కల లాగానే పృథ్వినుండి కూడా నిరంతరంగా బాష్పం (ఆవిరి) బయటకు వస్తూ ఉంటుంది అది శరీరానికి ఉపయోగపడే పోషకతత్త్వాలతో (ధాతువులతో) నిండి ఉంటుంది

అందువల్లనే ఆరోగ్యనియమాలలో పృథ్వీసామీప్యము కూడా ఒక విశిష్టనియమంగా ఉన్నది. మట్టి విషనాశకం దీనిద్వారా అనేక విషాలు విరుగుడు అవుతాయి వ్రణాలు, తామర, గజ్జి, దరదలు వంటి చర్మరోగాలు దూరమవుతాయి. ఇంకా జీర్ణకోశంలో అల్సర్లు, కడుపు నొప్పులు, మలబద్ధకము, ప్రేగులలో నొప్పి, అతిసారము, మూలశంక, మూత్రశయ వ్యాధులు, కాలేయసంబంధమైన వాపులు, గుండెదడ , గర్భాశయ వ్యాధులు మట్టిద్వారా మాయమవుతాయి అన్నివిధాలైన జ్వరాలు, ఉబ్బసం, సన్నిపాతం, పిచ్చి, నేత్రాలు, దంతాలు, చెవులకు సంబంధించిన వ్యాధులలోను, స్వప్నదోషాలు, వీర్యగతమైన వ్యాధులు, ప్రదరం వంటి స్త్రీల వ్యాధులకు మట్టి ఉత్తమైన ఔషధిగా భావించబడుతుంది మట్టి కేశవృద్ధికి అత్యంత ఉపయోగకరమైనది. పోషకమైన పదార్థము కూడా. వైజ్ఞానికంగాను, వ్యాధుల నివారణకు ఉపయోగకరంగాను ఉన్న మట్టి ముఖ్యంగా తీర్థాలలోని మట్టిలో సాత్త్వికతను పెంచే గుణం ఉండబట్టి అన్నివిధాలా ఉపయోగపడుతుంది.

## కుంకుమతిలకం

పసుపు గుండకి నిమ్మరసాన్ని చేర్చి కుంకుమను తయారుచేస్తారు. ఈ కలయికలో పచ్చటి పసుపు ఎరుపు రంగుగా మారి కంకుమ తయారవుతుంది ఆయుర్వేదంలో పసుపుకు సంయోజక గుణాధిక్యతను గుర్తించారు తెగిన గాయాలకు పసుపు బాగా పనిచేస్తుంది. కాయగూరల్లో కూడా కేవలం రంగుకోసమే కాకుండా దీనికి గల సంయోజక గుణవిశేషం చేతనే పసుపును వాడుతున్నారు. ఇది చర్మశుద్ధికి విశేష లాభదాయకం ఉంటుంది కుంకుమతిలకంలో ఈ రెండు లాభాలు చేరటంవల్లనే కుంకుమ వాడకం అత్యంతావశ్యకం.

